# నాటక విమర్శనము

రచయిత:

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ సహాయ సంపాదకుఁడును,
ఆంధ్ర విశ్వకళా పరిషత్తుచే వీరశైవాంధ్రవాఙ్మయమునకై
'సర్. ఆర్. వెంకటరత్నం పరిశోధన' సువర్ణ పతక పారితోషికముఁ బడసినట్టియు,
ఆంధ్ర విమర్శ వ్యాసకర్తయుఁ నైన,
శిష్టా రామకృష్ణ శాస్త్రి, ఎం. ఏ., బి. ఓ. యల్.

శిష్టావారి గృహము
బచ్చుపేట :: బందరు

# పీఠిక

నాటకవిమర్శ పాశ్చాత్యదేశములలో ననేక ముఖముల వర్ధిల్లినది. అందు నాంగ్లభాషలో విశేషము. సంస్కృతభాషలో శ్రవ్యకావ్యములకు వలె దృశ్యకావ్యములకుఁగూడ పండితులు వ్యాఖ్యానములు రచియించి యందు నాయకుఁడు, సంధులు, రసము, నలంకారములు, భావార్థ చమత్కారాదులును లక్షణ గ్రంథసూత్రములతో సమన్వయించి, సమర్థింప ప్రయత్నించిరి. పాశ్చాత్య నాటక విమర్శ పద్ధతి బహు విశాలమును, సర్వతోముఖము నైనది. వానిని విపులముగ 'నాటక రచన' మను భాగమున వివరించితిని. ప్రాచ్య పాశ్చాత్య నాటకవిమర్శన పద్ధతుల నాశ్రయించి ప్రధాన సంస్కృత నాటకములపై విమర్శనములు రచియించుట నా ప్రస్తుత ప్రయత్నము. ఇట్టిమార్గ మాంధ్రభాషలో నవీనము గావచ్చును.

ఈ నాటకవిమర్శనములలోఁ గొన్నిభాగములు పూర్వము కృష్ణాపత్రిక, భారతి మొదలగు పత్రికలందు ప్రచురింపఁబడుటయేగాక, నేను కళాశాలలో నధ్యాపకునిగా నుండుకాలమున బి. యే, విద్వాన్ విద్యార్థుల కుపన్యాసములుగా నొసఁగఁబడినవి. వీనికి కొలఁది సంవత్సరములక్రిందటనే గ్రంథరూపమొసంగఁ బ్రయత్నించితిని గాని ముద్రణ సౌకర్యములు లేమిచే నేఁటికిఁగాని యీపని కొంతవఱకైనను కార్యరూపము దాల్చలేదు. ప్రస్తుతము 'నాటకరచనము' ప్రారంభవ్యాసముగాఁ గొన్ని నాటకములపై విమర్శనము మాత్రము ప్రచురింపఁగల్గితిని. మరికొన్ని సంస్కృత నాటకములపైఁ గూడ విమర్శనములు సిద్ధముగా నున్నవి. వానిని కొలదికాలములో 'నాటకప్రదర్శన'మను ప్రారంభవ్యాసముతో ద్వితీయ సంపుటముగ ప్రచురింపఁదలఁచితిని. ఈ నాటకవిమర్శ రచనకు ముఖ్యముగా నాంగ్లమందు Shakespeare నాటకములపై Bradley,

Dowden, Moulton మొదలగు పండితుల విమర్శ రచనములు నాకు మార్గదర్శకములైనవి. వీనికితోడు సంస్కృత నాటక వ్యాఖ్యానములు నాకు సాయపడినవి. ఇందలి నాటకరచనమును వ్యాసమునకు నేను ముఖ్యముగా ఈ క్రింది గ్రంథములను సంప్రతించితిని. 1. దశరూపకము, 2. Hudson:- Introduction to the study of literature. 3. Butcher:- Aristotle's theory of Drama and fine arts. 4. Winchester:- Principles of literary criticism. 5. Bradley:- Shakespearen Tragedy. 6. D. L. Roy:- Kalidas & Bhavabhuti.

ఇందు సంస్కృత నాటకకర్తలను నిర్ణయించుపట్ల యెంత జాగరూకత వహించినను ప్రబలమగు ప్రమాణములు లేమిచే నవి నాకే సంతృప్తికరములుగా లేవు. అందుచేతనే యాతరగతి విమర్శపై నాకు సవతితల్లి ప్రేమగలిగినది. ఇక గ్రంథవిమర్శ విషయమున యథాశక్తిని వినియోగించితిని. గుణగ్రహణ పారీణులగువారు వానియర్హతను బట్టి యాదరింతురుగాక. గ్రంథమున కొన్ని యచ్చుతప్పులు దొర్లినవి. వానిని శుద్ధపత్రము ననుసరించి దిద్దికొన ప్రార్థన.

16-6-49
బందరు.

శిష్టా రామకృష్ణశాస్త్రి.

# నాటకవిమర్శనము

## నాటకరచన

వాస్తవజగమం దంతర్లీనమైయుండు పరమసత్యస్వరూపమును బ్రదర్శించుటయే యుత్తమశిల్ప ప్రయోజనము. శిల్పనిర్మాణము నిత్యసత్యమగుటలో వాస్తవమును, యాథార్థ్యముగాకుండుటలో నాదర్శము నై యున్నది. కావ్యసత్యము సంభావ్యమందే కాని యాథార్థ్యమందు విశ్వాసముంచదు. వాస్తవజగత్తున స్థూలదృష్టికి గోచరింపని సత్యమును భావనాబలముచే దనకు గోచరించినదానిని సాక్షాత్కారముగా బ్రదర్శించుటయే శిల్పవిధి, కాని యున్నదున్నట్లుగా నిర్మించుటకాదు. కళ ప్రత్యక్షప్రపంచమునకు మెఱుగుపెట్టు నుత్తమ సృష్టియేకాని, దానికి కేవలము ప్రతికృతిమాత్రముగాదు. అవసరమగుచో కళ మూలమును గూడ సంస్కరించును. సుఖదుఃఖమయమైన యీ ప్రపంచమును సర్వాంగసుందరముగను, కళ్యాణాత్మముగను సృష్టించి, సత్యము, శివము, సుందరమును స్ఫురింపజేయుటయే కళాప్రయోజనము. దీనిని ప్రదర్శించుటకు శిల్పి యనేక యాలంకారికసాధనముల వాడును. లోకధర్మమును దలపింపజేయుటయే కళాధర్మముగాని, లోకధర్మమే కళాధర్మముకాదు. అందుచే కళ స్వాభావికముగ నుండవలయుననుట సమంజసముగాదు. కవిత్వము, పాత్రపోషణము మొదలైనవి కేవలము ప్రపంచ స్వభావానుగుణముగ నుండజాలవు.

నాట్యము లలితకళలలో నొకటైనను నది కవిత్వ సంగీతముల సహాయముపొందిన మిశ్రకళయేకాని స్వతంత్రమైన ప్రత్యేకకళ కాదు. సంగీతములేని యభినయము మనోహరముగ నుండనట్లే, కవిత్వములేని నాట్యమందు స్పష్టతయుండదు. ఇట్లు సంగీత కవిత్వాభినయముల కాశ్రయమై, మనోహర వస్తువర్ణనలతో రమణీయమై, చతురసంభాషణములతో రసవంతమై, స్ఫుటమైన పాత్రపోషణముతో హృదయాహ్లాదకరమై, నిబిడమైన కథాసంధానముచే నానందదాయకమై, రంగస్థలమున

ప్రదర్శనయోగ్యములైనవానిని మాత్రమే గ్రహింపుటచే ప్రాజ్ఞులు 'కావ్యేషు నాటకం రమ్య' మని భావించిరి. మానవజీవిత ప్రతిపాదకమైన కవిత్వమును పాత్రలముఖమున ప్రత్యక్షరూపముఁదాల్చి పరమోత్కృష్ట స్థానమునకుఁ గొంపోవును గాన 'నాటకాంతం సాహిత్య' మనికూడ బుధులు దలఁచిరి.

యథార్థమునకు నాటకరచనయందును నవలరచనయందును గూడ సంస్కరింపఁబడని కథ, పాత్రపోషణ, సంభాషణ, జీవిత పరమార్థము, పరిసరములు మొదలైన సమాన మూలవిషయములే స్వీకరింపఁబడును. కాని నిర్మాణనియమ భేదములవలన నా యసంస్కృత సామగ్రి నాటక నవలరచనలందు బహుభేదములతో నిర్వహింపఁబడు చున్నది. ఉద్రేకపూరితమైన స్త్రీ పురుషుల కథయందు స్త్రీ పురుషులకుఁ గల యభిరుచియే నవలసృష్టికి ముఖ్యకారణమైనది. ఈ యభిరుచియే సారస్వతమునకు మూలశక్తి. ఈశక్తియే వివిధదేశకాలము లందలి సాంఘిక కళాపరిస్థితుల మార్పుల ననుసరించి పురాణ, నాటక, గేయ, నవలాది వివిధమార్గములుగ వ్యక్తీకరింపఁబడి, భిన్నరూపములఁ దాల్చినది. జనసామాన్యమున ప్రాచీనరచనయైన నాటకమునకంటె నర్వాచీన రచనయైన నవలకే యెక్కువప్రచారమున్నను, నిది నాటకమునకన్న నుత్కృష్టమైన దని మాత్ర మెన్నడుతలపరాదు. నాటకోత్కృష్టతకు వేఱు కారణములున్నవి. అది కేవలము శుద్ధసారస్వతమైన యొక్కటేకళ కాదు. ఇది కళాసమ్మేళనము. ఇందు గానాభినయ రంగపరికరములతోఁ గావ్యాంశము కలిసిపోయినది. ఇఁక నవలయన్ననో, యితర కళాపేక్ష లేని స్వతంత్ర సారస్వతశాఖ. ఇది 'జేబునందలి నాటకశాల'యని యొక విమర్శకుఁ డనిన ట్లిందు కథ, పాత్రలు మాత్రముండుటయేగాక, దుస్తులు, రంగపరికరములు మొదలైన నాటకప్రదర్శన ప్రకరమంతయు నిమిడియే యుండును. ఇదియే నాటకమునకు నవలకు ముఖ్యతారతమ్యము. మఱియు రంగనియమ నిబద్ధములచే నాటకమందలి ప్రతిభాగమును శృంఖలాబద్ధముగానుండును. నవలయం దిట్టి నియమము లేవియు లేక స్వేచ్ఛగను, విశాలముగను సాగును. కాని నాటకమందుగల ప్రత్యేక స్పష్టతలుమాత్ర మిందుండవు. నాటకమున సర్వము కన్నులకుఁ గట్టి

నట్లుండుటయు నవలయందు సకలమును భావప్రపంచమున నూహించవలసి నదే. మఱియు నాటకము బహుకఠిన నియమబద్ధమైన కావ్యశిల్పము. నాటకరచనకు మొదట తల్లక్షణానుసార శిక్షణమును, రంగవిషయ పరిపూర్ణజ్ఞానమును ముఖ్యముగ నుండవలెను. ఇక నవలయన్ననో బహుసరళమైన రచనగలది. కాగితములు, కలము, సిరా గలిగి, కొంత తీరికయు నోర్పు నున్నవారెల్లరు నవలను వ్రాయవచ్చును. కాన నవల రచనాసూత్రము లసంఖ్యాకములు, స్వతంత్రములు, స్వేచ్ఛాయుతములు నగుటచే వాని నిర్ణయించి వివరించుటకంటె, నాటకరచనా ధర్మములను వాని విమర్శన సూత్రములను నిర్ణయించుట సులభసాధ్యము. నవలలు బహువిధ వ్యక్తిగతాభిరుచులపై నాధారపడియుండుచు గాన తద్రచనకు ధర్మముల నిర్దేశించుట బహుదుర్లభము.

ప్రాచీనపురాణములు ధారణచేసి పాడుకొనుటకు, నర్వాచీన నవల వినోదార్థము చదువుకొనుటకు నుద్దేశింపఁబడగ, నాటకము వర్ణనా సంభాషణలతోడ కథయందలి పాత్రలకు స్వరూపమొసఁగి నటులు ప్రదర్శించుట కుపయుక్తమైనది. పురాణనవలలందు కథాకథనశక్తి మాత్రమే యుండగ, నాటకము కథను వాచికాభినయములతో నను కరించును. ఈ యభినయమూలసూత్రముల ననుసరించియే నాటక నిర్మాణసూత్రములు వివరింపఁబడి, యనువదింపఁ బడినవి. నాటకమున నీ యనుకరణధర్మమే ముఖ్యముగాన, నీయనుకరణము నాట్యనియమ బద్ధముగాన, నీ కావ్యకళ దృశ్యకావ్యమని ప్రసిద్ధిగాంచినది.

తన భావములను బ్రత్యక్షముగాఁ దాను జెప్పుకొనుటకును, స్వేచ్ఛమై కథను దీర్ఘముగా నడుపుటకు నవలరచయితకువలె నవకాశముండమి నాటకకర్త యొక దుర్ఘట కార్యభారమును దాల్పవలసియుండును. అతఁడు చెప్పునది సర్వమొక్కమాఱు పూర్తి చేయఁదగినట్లు బహుక్లుప్తముగా మాత్రమే యుండవలయును. దీనికిఁ దోడు రచన రంగ పరికరముల కనుగుణముగా నుండుట మఱియొకటి. అందుచేతనే యిది దృశ్య కావ్యమైనది. కావున కావ్యగౌరవమును, బ్రయోగానుకూల్యతయుఁ గలిగియుండినఁగాని యుత్తమ నాటకము

ప్రదర్శనయోగ్యము లైనవానిని మాత్రమే గ్రహించుటచే ప్రాజ్ఞులు 'కావ్యేషు నాటకం రమ్య' మని భావించిరి. మానవజీవిత ప్రతిపాదకమైన కవిత్వమును పాత్రలముఖమున ప్రత్యక్షరూపముదాల్చి పరమోత్కృష్ట స్థానమునకుఁ గొంపోవుట గాన 'నాటకాంతం సాహిత్య' మనికూడ బుధులు పలికిరి.

యథార్థమునకు నాటకరచనయందును నవలరచనయందును కూడ సంస్కరింపఁబడని కథ, పాత్రపోషణ, సంభాషణ, జీవిత పరమార్థము, పరిసరములు మొదలైన సమాన మూలవిషయములే స్వీకరింపఁబడును. కాని నిర్మాణనియమ భేదములవలన నా యసంస్కృత సామగ్రి నాటక నవలరచనలందు బహుభేదములతో నిర్వహింపఁబడు చున్నది. ఉద్రేకపూరితమైన స్త్రీ పురుషుల కథయందు స్త్రీ పురుషులకుఁ గల యభిరుచియే నవలసృష్టికి ముఖ్యకారణమైనది. ఈ యభిరుచియే సారస్వతమునకు మూలశక్తి. ఈశక్తియే వివిధదేశకాలము లందలి సాంఘిక కళాపరిస్థితుల మార్పుల ననుసరించి పురాణ, నాటక, గేయ, నవలాది వివిధమార్గములుగ వ్యక్తీకరింపఁబడి, భిన్నరూపములఁ దాల్చినది. జనసామాన్యమున ప్రాచీనరచనమైన నాటకమునకంటె నర్వాచీన రచనమైన నవలకే యెక్కువ ప్రచారమున్నను, నిది నాటకమునకన్న నుత్కృష్టమైన దని మాత్ర మెన్నఁడుఁ దలఁపరాదు. నాటకోత్కృష్టతకు వేరు కారణములున్నవి. అది కేవలము శుద్ధసారస్వతమైన యొక్కటేకళ కాదు. ఇది కళాసమ్మేళనము. ఇందు గానాభినయ రంగపరికరములతోఁ గావ్యాంశము కలిసిపోయినది. ఇఁక నవలయన్ననో, యితర కళాపేక్ష లేని స్వతంత్ర సారస్వతశాఖ. ఇది 'జేబునందలి నాటకశాల'యని యొక విమర్శకుఁ డనిన ట్లిందు కథ, పాత్రలు మాత్రముండుటయేగాక, దుస్తులు, రంగపరికరములు మొదలైన నాటకప్రదర్శన ప్రకరమంతయు నిమిడియే యుండును. ఇదియే నాటకమునకు నవలకు ముఖ్యతారతమ్యము. మఱియు రంగనియమ నిబద్ధముచే నాటకమందలి ప్రతిభాగమును శృంఖలాబద్ధముగా నుండును. నవలయం దిట్టి నియమము లేవియు లేక స్వేచ్ఛగను, విశాలముగను సాగును. కాని నాటకమందుగల ప్రత్యక్ష స్పష్టతలుమాత్ర మిందుండవు. నాటకమున సర్వము కన్నులకుఁ గట్టి

నట్లుండును. నవలయందు సకలమును భావప్రపంచమున సహించవలసి నదే. మఱియు నాటకము బహుకఠిన నియమబద్ధమైన కావ్యశిల్పము. నాటకరచనకు మొదట తల్లక్షణసంస్కార శిక్షణమును, రంగవిషయ పరిపూర్ణజ్ఞానమును ముఖ్యముగ నుండవలెను. ఇక నవలయన్ననో బహుసరళమైన రచనగలది. కాగితములు, కలము, పీఠ గలిగి, కొంత తీరికయు నోర్పు నున్నవారెల్లరు నవలను వ్రాయవచ్చును. కాన నవల రచనాసూత్రము లసంఖ్యాకములు, స్వతంత్రములు, స్వేచ్ఛాయుతములు నగుటచే వాని నిర్ణయించి వివరించుటకంటె, నాటకరచనా ధర్మములను వాని విమర్శన సూత్రములను నిర్ణయించుట సులభసాధ్యము. నవలలు బహువిధ వ్యక్తిగతాభిరుచులపై నాధారపడియుండును గాన తద్రచనకు ధర్మముల నిర్దేశించుట బహుదుర్లభము.

ప్రాచీనపురాణములు ధారణచేసి పాడుకొనుటకు, నర్వాచీన నవల వినోదార్థము చదువుకొనుటకు నుద్దేశింపఁబడగ, నాటకము వర్ణనా సంభాషణలతోడ కథయందలి పాత్రలకు స్వరూపమొసఁగి నటులు ప్రదర్శించుట కుపయుక్తమైనది. పురాణనవలలందు కథాకథనశక్తి మాత్రమే యుండగ, నాటకము కథను వాచికాభినయములతో ననుకరించును. ఈ యభినయమూలసూత్రముల ననుసరించియే నాటక నిర్మాణసూత్రములు వివరింపఁబడి, యనువదింపఁ బడినవి. నాటకమున నీ యనుకరణధర్మమే ముఖ్యముగాన, నీయనుకరణము నాట్యనియమ బద్ధముగాన, నీ కావ్యకళ దృశ్యకావ్యమని ప్రసిద్ధిగాంచినది.

తన భావములను బ్రత్యక్షముగాఁ దాను జెప్పుకొనుటకును, స్వేచ్ఛమై కథను దీర్ఘముగా నడుపుటకు నవలరచయితకువలె నవకాశముండమి నాటకకర్త యొక దుర్ఘట కార్యభారమును దాల్పవలసియుండును. అతఁడు చెప్పునది సర్వమొక్కమాఱు పూర్తి చేయఁదగినట్లు బహుక్లుప్తముగా మాత్రమే యుండవలయును. దీనికిఁ దోడు రచన రంగ పరికరముల కనుగుణముగా నుండుట మఱియొకటి. అందుచేతనే యిది దృశ్య కావ్యమైనది. కావున కావ్యగౌరవమును, బ్రయోగానుకూల్యతయుఁ గలిగియుండినఁగాని యుత్తమ నాటకము

గాఁజాలదు. ఇందేది లోపించినను నాటకము సంపూర్ణరూపము నొందదు. ఉత్తమ కావ్యలక్షణము లుండి ప్రయోగార్హము గానిచో నందు కావ్యతా గౌరవముండునే కాని నాటకతా గౌరవము సిద్ధింపదు. రంగోచితముగా నుండవలయు నను తలంపుతోఁ గావ్యతా గౌరవమును లోపింపఁజేసినచో నది తాత్కాలిక ప్రయోజనము గలిగినదైనను వాఙ్మయమున చిరస్థాయి మాత్రము గాఁజాలదు. ఈరెం డుత్తమలక్షణములు గల నాటకము లేభాషయందైనను బహు స్వల్పముగానే యుండును. ఉత్తమ నాటకములని మనము సహజముగా నెంచు ననేకములు రూపముచే నాటకములైనను వ్యవహారములకుఁ గావు. అట్టివి సంస్కృతమున భవభూతి రచిత మహావీర చరితము, నుత్తర రామచరితము, రాజశేఖరుని బాలరామాయణము, మురారి, యనర్ఘరాఘవము మొదలైనవియు. నాంగ్లమున షేక్స్పియరు కవికృత టెంపెస్టు, కింగు లియరు మొదలైనవి. వీనిని శ్రవ్యనాటములనుట మేలు కాని, దృశ్యకావ్యములనుట తగదు. ఇందు కావ్యప్రతిష్ఠ తగ్గదు; కవులు కృతార్థులే, కాని తమనాటకము లుత్తమదృశ్యములని భావించుచో పరిహాసపాత్రు లగుటయేకాక దాని నభినయించిన నటులును నగుబాటుగుదురు. కావున నవి సాహిత్యవేత్తలకేకాని నాట్యపరులకుఁ బ్రయోజనము లేమిచే రంగస్థలమునకు దూరములైనవి. ఉత్తమనాటక మీా రెండుప్రయోజనములకు లక్ష్యభూతము కావలయును.

నాటకమందు కథాసంధానము, పాత్రపోషణము, రసపోషణము, కవిత్వము, తత్త్వోపదేశ మను నైదింటి యైక్యముచే సంపూర్ణస్వరూపమునకుఁ గలిగినశోభయందుఁ గవి దృష్టి నుంచవలెను. వీనిలో నేయంగము వికృతమైనను సమష్టిస్వరూపము దుష్టమగును.

కథాసంధానము:— నాటక రచనమున కుదాత్తవస్తువు తప్ప నితర మేదియు పనికిరాదని ప్రాచ్య పాశ్చాత్యు లేకగ్రీవముగ నంగీకరించిరి. ప్రాచీన లక్షణకర్తలు కావ్యనాయకుఁడు ధీరుఁడు గావలయు ననుట వలన, ధీరనాయకుని చరిత్ర ముదాత్తమై యుండునని స్పష్టము. మఱియు నా ధీరుని చరితము సర్వము నుదాత్తముగ నుండకపోయినచో,

నందలి యుదాత్త భాగముల మాత్రమే గ్రహించి తద్విరుద్ధమైన యంశ ముల నుత్కృష్టములుగా నుండునట్లు మార్చుటగాని, లేక వానిని త్యజిం చుటగాని యొనర్చి వివిధాంశములకుఁ గార్యకారణ సంబంధముండునట్లు గాను, నాటకోచితముగాను, రసమును పోషించునట్లుగాను, పాత్రల స్వభావము స్వయంవ్యక్తమగునట్లుగాను, బీజమునకు నిర్వహణము నకు విరోధము లేకుండునట్లుగాను, ప్రారంభమునుండి అంతమువరకు కథ సహజముగా నడపించుటయు, నెయ్యెడ సూత్రసంబంధ లోపము లేకుండ రచించుటయు నాటకకర్త భారములు. ఇవన్నియు నేకపాత్ర దర్శన యోగ్యమైన సంక్షిప్త ప్రదేశమగు నాట్యరంగ స్థలమున ప్రదర్శనార్హ మగునట్లు నిర్మించుటయే నాటకకళ. నాయకచరిత్ర ముదాత్తము కాక పోయనచో నది యాదర్శప్రాయముగ నుండకపోవుటయే కాక కావ్య కళకు పరమార్థ మాపాదించదు. అందుచే నీరసములైన కథా భాగము లనే కాక ననుచిత విషయములఁగూడ రంగస్థలమున పరిహరించవల యుననియు, నొకవేళ నవి కథ కత్యవసరములైనచో విష్కంభ ప్రవేశ కాదులందు సూచ్యములు మాత్రమే కావలయునని ధనంజయుఁడు దశ రూపకమున నిర్దేశించుటయేకాక, పాశ్చాత్యులుగూడ నీ మతమున నేకాభిప్రాయులై యుండిరి. అందుచేతనే భోజన శయ నాలింగనాది నీరసవిషయములను, యుద్ధవధాద్యనుచితోద్రేకకరములను లాటిణీయులు రంగస్థల ప్రదర్శనార్హములుగావని నిషేధించిరి. ప్రాచీన గ్రీకులుగూడ నీమర్యాదను పాటించిరి. షేక్స్పియరు నాటకముల యుద్ధవధాదుల రం గమున ప్రదర్శనార్హముగావించుట పామరులైన సామాజికుల సంతృప్తి కొఱకని సమర్థించినను వాని ననేక విమర్శకులు నిందించిరి. పై నీరసాను చిత విషయములను ప్రదర్శనా సంభవములైన దూర ప్రయాణములు, కోటముట్టడులు మొదలైన నెట్టి సర్వోపస్కర సంయుతమైన రంగము మీఁదనైనను ప్రదర్శింపఁ బూనుట తృప్తికరముగానుండక పోవుటయే కాక హాస్యాస్పదముగఁగూడ నుండును. ఇట్టివానిని నవీనులు కొందఱు తమ నాటకములందు ప్రదర్శనార్హములుగఁ జేయుట శోచనీయము.

సంస్కృత నాటకములందు సాధారణముగా, కథావిషయమున వైవిధ్యము చాల తక్కువయగుటచేఁ గథా సంధానము సాంకేతికముగ

నుండును. ఏదియనఁగా శృంగారరస ప్రధానమైన నాటకమందు నాయికా నాయకులు ఏదియుద్యానవనమునందో కలిసికొనుట, విరహమొందుట, మొదలగుసామాన్యవిషయములుండును. వీరరస ప్రధాన నాటకములందుయుద్ధము వర్ణింపఁబడును. నాటకకథాసంధానమునకుఁ దెలితి రాకుండ రక్షించుటకును, క్రమపరిణామముపొందించుటకును, మనలక్షణకర్తలు ముఖ ప్రతిముఖ గర్భావమర్శ నిర్వహణములను పంచసంధుల నిర్దేశించిరి. పాత్రపోషణము, రసవిన్యాసము, ఔచిత్యపాలనము మొదలైన గుణములున్నను సంధులుపాటింపని కథాసంధానము క్రమ్మఁదప్పిన బొమ్మవలె వికృతముగా నుండును. పాశ్చాత్యులుగూడ వస్తువునకు ప్రారంభము, పరిణామము, పరమావధి, పర్యవసానము, పరిసమాప్తి యను నైదు కార్యావస్థల నేర్పరచిరి. వీనిబట్టి ముఖనిర్వహణముల కవిబోధభావమును గూర్చుటకై మధ్యావస్థలు పోషకములుగ నుండుటయేఁ ప్రాచ్యపాశ్చాత్యు లుద్దేశించిన ప్రయోజనమనుట స్పష్టము. ఇది సహజమైన విభాగము. కాని నాటకమందలి యంక విభజనము వీని ననుసరించి చేయఁబడినది కాదు. అంకములు నటకసామాజికులకు విశ్రాంతిఁగూర్చుటకై యేర్పఁబడిన విభాగములగుటచేఁ గృత్రిమములైనవి. ఏకాంక నాటకమందుగూడ పంచసంధులు నిరూపింపనగును. ఈపంచసంధులలో మొదటిరెండు నారోహణక్రమమును, తుదిరెండు నవరోహణక్రమమును, మధ్యసంధి శిఖరమును వహించుచున్నది. ఈరీతి ప్రాచ్యపాశ్చాత్యరూపకములందు సక్రమముగఁ బొడకట్టుచున్నవి.

ప్రారంభమున సామాజకులకుఁ గథతోఁ బరిచయము గూర్చుటయం దాముఖము ముఖ్యముగా ప్రయోజనకారి. సంస్కృతనాటకములందు దీనికిఁ బ్రత్యేకస్థానమున్నది. పాశ్చాత్య నాటకములం దీ నియమము వివక్షనే కోరుచున్నదికాని నిర్బంధముగా నున్నట్లు లేదు. ఈ ప్రారంభావస్థను నిర్వహించుటలోనే నాటకకర్త శక్తి కొంత ప్రకటితమగును. కథయందలి రసవంతమైనభాగము నుండి ప్రారంభించి క్లిష్టమైన సంభాషణతోఁ జమత్కారముగఁ బ్రస్తావనయందుఁ గథావస్తువును సూచించుట యొక నైపుణ్యము. శాకుంతల ముద్రారాక్షసాది నాటకములం దిది బహుసామర్థ్యముతో నిర్వహింపఁబడినది. కొన్ని సంస్కృత

నాటకములందుఁగూడ నిది బహు నీరసముగ నున్నది. నిర్వహింపలేక యాధునికులు గొందఱు దీనిని త్యజించుచున్నారు. ప్రథమాంకముననే ప్రధాన కథాబీజము నాటఁబడి ముఖసంధి యేర్పడవలయును. ప్రతి ముఖసంధియందు సామాజికుల యభిరుచిని ప్రేరేచి నాటకకర్త శిల్పశక్తిని గ్రహింపఁజేయు నగును. పాత్రల పరిస్థితులంబట్టి పూర్వవిషయములనుండి కథ సహజముగ వృద్ధిపొందుచుండీ, యనావశ్యక విషయములు తప్ప, రసవంతములైనను నప్రస్తుత విషయములనో నెంతమాత్రము నింపరాదు. భావపరంపరలీలలు స్పష్టముగఁ బ్రదర్శింపఁబడి పాత్రల వాక్కులకుఁ గర్మలకు సామరస్యము గలుగుచుండవలయును. ఇందు పాత్రలకుఁ గథకుఁ గల సంబంధమును బహు జాగరూకతతోఁ బోషింపవలయును. కథాగమనమునుగాని, పాత్రల శీలవ్యక్తీకరణమునుగాని, లేక రెండింటిపరిణామమునుగాని వ్యక్తపఱచునదై ప్రతిభాగముండవలయునే కాని తద్విరుద్ధముగ నేభాగమును ప్రవేశపెట్టరాదు. నాటకోత్తరభాగమున ప్రాముఖ్యము వహించు సకలపాత్రలు నీ పూర్వభాగముననే పరిచితముగా వింపఁబడుటయేకాక నుత్తరభాగమున నాయకుని వైప్రభావమునెఱపు గుణములన్నియు నీ పూర్వభాగముననే సూచింపవలయును. ఈ ప్రకారముగా నుత్తరకథాభాగమునకుఁ బూర్వరంగముగ నిదియుండఁదగును. పూర్వపరిచితము లేని క్రొత్తభావమునుగాని, నూత్నపాత్రనుగాని, యాశయములగాని, యాకస్మికముగఁ బ్రవేశపెట్టుట నాటకకళకుఁ గళంకము గూర్చుచే. దీనినే మన లక్షణకర్తలసూచితపాత్రప్రవేశము పనికిరాదనుట. ఈ చిక్కును విడదీయుటకుఁ బాశ్చాత్య నాటకములలో నేనియమములు లేవు కాని, మననాటకములందు విష్కంభ ప్రవేశకము లీ కార్యములను నిర్వహించుచున్నవి. ఇవి కృత్రిమములుగాఁ దోఁచినను ప్రయోజనకరములే యగు ను.

ప్రతికథయును బెరుగుచువచ్చి యేదేనొకచోట నాగి తిరుగుముఖమగును. కాన నా యుచ్చ భాగము గర్భసంధి యగుచున్నది. ఇది గత పరిస్థితులనుండి సహజముగను సక్రమముగను సహేతుకముగను పరిణమించినదిగ నుండవలయును. అనఁగా నది యాపాత్రలమీఁద, నా కాల పరిస్థితులమీఁద నాధారపడి యుండవలయునేగాని, యాకస్మిక

సంఘటనము గాఁగూడదు. అర్వాచీనులు గొందఱు గర్భసంధిని నుత్తరభాగమునకుం గొనిపోయిరి, కాని ప్రాచీనులు నాటక మధ్యభాగముననే నిల్పిరి. అవమర్శ సంధియందు కథాగమన మవరోహణ ముఖము దాల్చును. వీరరస ప్రధాన నాటకమున నాయకుని జయమునకును, ప్రతినాయకుని పరాజయమునకు నిక్కడ మార్గమేర్పడును. శృంగారరస ప్రధాన రూపకమున వివాహ ఫలమగు పుత్త్రోదయాది దశలు నిందు ప్రారంభమగుచుండును. ఎట్లును కథ పరమావధి దాటగానే మన యభిరుచి పూర్వకథా పరిణామమునకు మఱియొక విషయమునందు లగ్నమై దానియం దాసక్తి వహించును. పూర్వభాగమున మన యభిరుచిని, యభిలాషను ప్రేరేచి, యుత్తర భాగమున రాఁబోవుకథ స్పష్టమగుచున్నను, పాత్రలయందు సానుభూతి యేర్పడి మనము వారియం దభిమానముంచుదుము. కథలో పసయు బిగువును సడలుటచే మనయభిరుచియు మందగించును. కాని కథాభిరుచిని చివరవఱకు నిల్పుటకై నిర్వహణమును విలంబనము సేయు కొన్నిమాత్ర విషయముల మధ్యఁ జేర్చి కవి యభిరుచిని, నాసక్తిని నిల్పును. అందుచేతనే సంస్కృత లాక్షణికు లిక్కడ నద్భుత రసమును బ్రవేశపెట్టు నియమమును జేయుట. వేణీ సంహార నాటకమున బ్రాహ్మణుని వేషమున రాక్షసుఁడు ప్రవేశించి ధర్మరాజును మోసగించుట యిట్టి ప్రయోజన మాశించియే

నిర్వహణ సంధియందు కథ ముగింపునకుఁ జేరవలయును. ఇందుఁ గూడ గర్భసంధివలెనే కార్యకారణ సంబంధ మనుసరించి పూర్వసంఘటనల సక్రమ పరిణామ మొందవలయునేకాని యాకస్మికముగ సమాప్త దశకుఁ జేగూడదు. కథాపాత్రలతో నత్యంత పరిణామము నొందక, వెలినుండివచ్చిన సమాప్తదశ దోషమగును. మానవాతీత విషయములఁ బ్రవేశపెట్టి సామాన్యకవు లిట్టి యుపసంహారమునకుఁ గథను తీసికొని వచ్చుదురు. ఇది శిల్పనైపుణ్యముగాదు.

ఇఁక నంకవిభజనము సహజము కాకపోయినను నియమ బద్ధముగానే యుండఁదగునేకాని యథేచ్ఛముగా నుండరాదు. అంకమందలి వృత్తాంత మేకదిన వృత్తమును, నాసన్న నాయకమును, బహుపాత్రి

ప్రవేశార్హమును గావలయునని లాక్షణికుల మతము. అంకసమాప్తి గూడ బీజానుగుణముగఁ జేయనగునే కాని తద్విరుద్ధముగఁ జేయరాదు. మఱియు నంకమును రంగములుగా విభజించుట ప్రాచీనుల యాచారముకాదు. విష్కంభ ప్రవేశకాదులు ప్రదర్శనానర్హములగు విషయముల సూచించుటకు మాత్రమే యేర్పడినవి. అర్వాచీను లంకమును రంగములుగ విభజింపఁగ విమర్శకులు దానిని ప్రాచ్యపాశ్చాత్యదేశములందుగూడ ప్రతిఘటించిరి. అంకమును రంగములుగా విభజించుటచే కథయం దనేక సన్నివేశముల నితరుల మాటలచే నూహింప నక్కర లేకయే ప్రత్యక్షముగ మనము చూడవచ్చునని సమర్థింపఁ బడినను, నందుచే నేకాగ్రత వహించిన సామాజికుల చిత్తములకు భంగము గలుగుటవలన నాటకరక్తియు, వారి రుచియు ఖండితమగునని గ్రహించియే యీ లోపము రాకుండుటకై మన ప్రాచీనులు దీని నాదరింపలేదు. ఏకారణము చేతనైన నంకములను రంగములుగా విభజించుచో రంగము గూడ నేకదిన వృత్తముగాను, నొక యంకమందలి వివిధ రంగములు పరస్పరము దేశకాలములకు సమీపములుగా నుండుట యుచితము.

గ్రీసుదేశీయులు మొట్టమొదటఁ దమ నాటకములందు దేశకాల వస్త్వైక్యత్రయము నుపపాదింపఁగఁ బాశ్చాత్త్యు లందఱు దీనినే గ్రహించిరి. కాలైక్యమనఁగ నాటక కథ యొకదినము గాని, లేక దాని ప్రదర్శనకాలముగాని మించరాదనుట. అట్లే స్థలైక్యమనఁగ నాటక మందలి సంఘటన లొక్క ప్రదేశమందుఁగాని తత్పరిసరములందుఁగాని జరుగవలెఁగాని, యంకములందలి కథ సాగు కొలఁది యొక దేశమునుండి మఱియొక దేశమునకు మాఱరాదనుట. ఈరీతిగనే వస్తువు నాటకమందలి వివిధ భాగములతో పరస్పర సంబంధము నైక్యతయును గల్గి కడకొక ప్రధాన కార్యమందు ముగించవలయును. కాలస్థలైక్యములు స్వభావ వాదము మీఁద నాధారపడినవి; దాని ననుసరించి యనేక నెలలలోను, సంవత్సరములలోను జరిగిన కథను రంగప్రదర్శనమునకు వలసినట్లు కొలఁది గంటల కాలములో జరిగినట్లు క్లుప్తీకరించుట స్వభావ విరుద్ధమని ప్రాచీనులు తలఁచిరి. అట్లే యొక దేశమును ప్రతిపాదించిన రంగస్థలము వివిధ ప్రదేశములకు మాఱినట్లు ప్రదర్శించుటకూడ నసమంజసమని భావిం

చిరి. ఇఁక వస్త్వైక్యతను నాటకనిర్మాణతత్త్వమున కత్యావసరము. అందలి వివిధ భాగములు పరస్పర సంబంధముతో నొక నిర్వహణమునకుఁ జేరనిచో నది నాటక మనే యనిపించు కొనదు. ఈరీతిగఁ బ్రాచీనులు స్వభావ వాదమును పురస్కరించుకొని కాలస్థలైక్యములకు ప్రాధాన్యమిచ్చి యోజనా బలమునకు వలయు శిక్ష నొసంగిరి. గ్రీకు లీయైక్యత్రయమును సుఖాంత నాటకములందే కాక, కష్ట సాధ్యమైన విషాదాంత నాటకములందుఁ గూడ బహునియమములతోఁ బాటించిరి. ఈ మార్గమునే ఫ్రాంసు నాటకకర్తలును, ప్రాచీనాంగ్లరూపక రచయితలును గూడ ననుసరించిరి. కాలస్థలైక్యములను పాటింపని నాటక కర్తలను 'అపాలజీ ఫర్ పొయట్రీ' యను దానిలో స్విడ్నీ పండితుఁడు దూషించినాఁడు. కాని యర్వాచీనుఁడగు షేక్స్పియరు కాలస్థలైక్యముల నుల్లంఘించినాఁడు. అతని చారిత్రక నాటకములన్నియు సుమారు, దేశకాలైక్యములను పాటింపనివే "వింటర్సు టేల" నే నాటక మీ ధోరణి నెక్కువ తిరస్కరించినది. ఇందలి యుపకథయు, మోదవిషాద విషయ మిశ్రీకరణమును, గ్రీకుల భావమగు వస్త్వైక్యతకు బద్ధవిరోధము. కాని షేక్స్పియరీనాటకములందు యథార్థ వస్త్వైక్యతను మాత్రము త్యజింపలేదు.

సంస్కృత నాటక కర్తలుగాని, లక్షణ రచయితలుగాని యీ యైక్యత్రయ మిట్టివిగా నుపపాదింపలేదు. వస్త్వైక్యతను మాత్ర మర్థప్రకృతులు, నవస్థలు, సంధుల మూలమునఁగూర్చిరి. అరిస్టాటిలు స్వయం సంపూర్ణమైన యేక కథ వస్తువుగా నుండవలయు ననెను. దీనిని బట్టి నాటకమునఁ బ్రాసంగికము లేవియుఁ జేర్పరాదనియు, నేకనాయకాశ్రియమైన యాధికారికము మాత్రమే యుండఁదగు ననియుఁ గొందఱు విమర్శకులు సంకుచిత దృష్టితో వ్యాఖ్యానముచేసిరి. కాని మఱికొందఱాధికారికమైన కథతో సన్నిహిత సంబంధముగల్గి, దానికిసహాయభూతమైన ప్రాసంగికములఁగూడ జేర్పవచ్చునని విపుల వ్యాఖ్యానము చేసిరి. భారతీయు లీ యభిప్రాయమే గలవారగుటచే మన నాటక కథ నాధికారికమనియును ప్రాసంగికమనియును విభజించి పతాకాపకరులందు ప్రాసంగికములను వాడిరి. కాన నుపకథను గూర్చుటయు, మోదవిషాద విషయ మిశ్రీకరణమును సంస్కృత నాటకములందు సర్వసాధారణ విష

యములే. ఇందుకు మృచ్ఛకటిక మాలతీమాధవ వాది నాటకములే తార్కాణము. ఇఁక కాలస్థలైక్యములఁ గూర్చిన నియమము వికల్పముగానే యున్నదిగాని, నిర్బంధముగ లేదు. మన లాక్షణికులు స్థలకాల విషయమై ప్రత్యేకానుశాసనము చేసినట్లుగఁ బడదు, సంస్కృత నాటకములందు కాలస్థలైక్యములు పాటింపలేదనియే చెప్పవచ్చును. మననాటక కథలు స్వర్గమర్త్యలోకముల రెండింటియందు వ్యాపించి యున్నవి. మఱియు నందలి నాయక చరితములతోఁబాటు నాయక సంతాన చరితముగూడఁ దెలుపఁబడుటచే మధ్య నైదారు సంవత్సరముల కాలముదాట వలసి వచ్చుచున్నది. అభిజ్ఞాన శాకుంతల మాఱు సంవత్సరముల వృత్తాంతము దెల్పును. ఉత్తరరామ చరిత్ర ప్రథమ ద్వితీయాంకముల మధ్య పండ్రెండు సంవత్సరములు గడుచును. స్థలవిషయముననో యభిజ్ఞాన శాకుంతలమున మొదటి నాలుగంకములును గణ్వాశ్రమమునను, పంచమ షష్ఠాంకములు దుష్యంతు రాజధానియందును, సప్తమాంకము స్వర్గమునుండి దిగుచు హేమకూట పర్వతమునను కథ జరుగును. కాని యీనాటకములలో నొక యంకమందలి కథ ప్రయాణ విషయము దెల్పునపుడు మాత్రము తప్ప, యొక్క ప్రదేశమునకు, తత్పరిసరములకు తప్పక చెందియుండును. కాళిదాసుని మాళవికాగ్నిమిత్రమందు కథయంతయు రాజభవనమున, తత్పరిసరమున జరుగుట కేవలము యాదృచ్ఛికము కాని స్థలైక్యమును పాటించుటకుఁగాదు. భాసుని ప్రతిమాస్వప్నవాసవదత్త నాటకములందు మాత్రము మూల కథలకు భిన్నముగా నిర్వాహణ మన్యస్థలమున జరుపుట స్థలైక్యమును పాటించుట కొఱకే కవి యిట్లు మార్చునేమోయను భావముగల్గుచున్నది. మన నాటకములందు దేశకాల వ్యత్యాసములు విష్కంభ ప్రవేశకాదులందలి కథాసూచనల వలనఁ గొంత సమర్థింపఁబడి స్పష్టపఱుపఁబడుచున్నవి. పాశ్చాత్య నాటకములందు కాలవ్యత్యాసము 'కోరస్' మూలమున స్పష్టపరుపఁబడును.

నాటకకథయందు సామ్యముగల సన్నివేశములఁ గూర్చి రచించుట నాటకకర్తలకు సర్వసాధారణమైన యాచారము. దీనివలన నాటకమున నొకభాగమందలి ముఖ్యవిషయము మఱియొకభాగమునఁగూడ

సంభవించి యాభావమును నిబిడీకృతము చేయును. ఒకప్పుడు నాటకాభిరుచిని క్లిష్టముగాఁ జేయుటకుఁగూడ నీ పద్ధతి యవలంబింపఁబడును. మఱియొకప్పు డీ ప్రయోజనములు మాత్రమేకాక చెదరిపోయిన వివిధ విషయముల నొకచోటఁ గూర్చుటకుఁగూడ నుపయోగించును. ఒక కథయందలి వివిధవిషయములకు తుల్యత్వమునుగూర్చి, పునరుక్తిగాఁ బ్రదర్శించుటచే, నాటకమందలి వివిధభాగములకు సంబంధముగల్గి యైక్యత యొనగూడును. మాలతీమాధవములోని మాధవమకరందుల వృత్తాంతము లిట్టివి.

సామ్యముకంటె భిన్నత్వమును ప్రతిపాదించుట నాటకరచనయం దెక్కువ యావశ్యకము. ఇద్దఱువ్యక్తులకుఁగాని, రెండుభావములకుఁగాని, రెండభిలాషలకుఁగాని, రెండుసన్నివేశములకుఁగాని సంఘర్షణము గల్గినపుడు ప్రతినాటకమం దీ తత్త్వము ప్రదర్శింపఁ బడుచునే యుండును. నాటకములం దీ భిన్నత్వ మనేక రూపములఁ బ్రతిపాదింపఁ బడును. సామాన్యముగ కథయందు మంచిచెడ్డలకు, సరసవిరసములకు భేదము గుర్తించినఁ జాలును. ముఖ్యముగ నీ భేదము పాత్రలమూలమునఁ బ్రతిపాదింపఁబడును. సాధారణముగా నిది యారోహణావరోహణ భాగములందు గోచరించును. కథాసంధానమున సంతోషముతోఁ బ్రారంభించి దుఃఖముతోఁ బరిసమాప్తినొందుటగాని, దుఃఖముతోఁ బ్రారంభించి సుఖముతో సమాప్తినొందుటగాని స్పష్టముగ వ్యక్తీకరింపఁబడును. అభిజ్ఞాన శాకుంతలమున పూర్వభాగము బహుసంతోషకరమగు ననురాగ శృంగారవిషయములుండి, యుత్తరభాగమున విషాదవృత్తాంతములగు వియోగతిరస్కారములు ప్రకటింపఁబడినవి. అసలుజగత్తులోనే యీ హెచ్చుతగ్గులు వివిధభేదములుగలవు. అవే నాటకమున ప్రతిపాదింపఁ బడుచున్నవి. క్లిష్టకథగల మహానాటకమందు సామ్యభేదములు రెండు ప్రతిపాదించుఘట్టము లనేకము లుండును. ఈ భిన్నత్వము కథాభివృద్ధి యందును సంకానుక్రమణికయందుఁగూడ నుండును. కాన దీని నత్యుక్తిపాలుచేయక బహుజాగరూకతతోఁ బ్రయోగింపనగును.

నాటకమున సర్వసాధారణముగా వివిధపాత్రలు భావగుణాదులలోఁ బరస్పర భిన్నములుగ నుండును. ఇట్లు సృష్టించుట కవులకు

సామాన్యాచారమై పోయినది. ముఖ్యముగా ముద్రారాక్షసమున నిట్టి పాత్రలు రాక్షసచాణుక్యులందును, చంద్రగుప్త మలయకేతువులందును గాంచనగును. ఈ భేదము నైతికదృష్టియందుఁగూడ ప్రకటింపఁబడును. ఇట్టి తారతమ్య ప్రకటనమువలన నాటకప్రభావమును, నైతిక ప్రాబల్యమును నిశితముగఁ గనఁబడును.

మఱియు నాటకమున నొకవిషయమునకే భిన్నభావము ప్రకటించుట మఱియొక చమత్కారపద్ధతి. దీనినే యాంగ్లమున Dramatic irony, లేక Tragic irorny యందురు. ఈ విరోధభావ మాసమయముననైనఁ దోఁచవచ్చును. లేదా, తర్వాతనైన స్పష్టపడవచ్చును. రంగము మీఁద పాత్రయొనర్చిన కార్యమునకుఁగాని, నుడివిన మాటలకుఁగాని పాత్రలకొక యర్థమును సామాజికులకు మఱియొక యర్థమును కథాసందర్భమునుబట్టి స్ఫురించినచో నది విరోధభావ మనఁబడును. ఈ భావభేదము పాత్రల మూలకముగ నుచ్చరించిన మాటలనుండియే గలుగును. ఈ భిన్నత్వము మాటలందుఁగాని, సందర్భమందుఁగాని యాధారపడియుండును. ఒకప్పుడిది శ్లేషార్థముగల యొకశబ్దమైనను జాలును. ఈ విరోధభావమును ధ్వనియనియైన ననవచ్చును. ఇట్టివి ముద్రారాక్షస వేణీసంహారనాటకములందు విశేషముగాఁ గాననగును. వేణీసంహారమున భానుమతీ స్వప్నవృత్తాంతము సన్నివేశరూపమైన విరోధభావము. అందే దుర్యోధనుఁడు వచించు 'నాయూరుయుగము' అనుపదములును, కంచుకి తత్తరపాటుతోఁ బ్రవేశించి పల్కు 'భగ్నమైనద' ను మాటలును, దుర్యోధనుఁ డెవరిచేనని యడిగినపుడు 'భీమునిచే' నని చెప్పఁబడిన ప్రత్యుత్తరము నేకవాక్యముగఁ బరిణమించినపుడు 'నాయూరుయుగము భగ్నమైనది భీమునిచే,' నని రాఁబోవు వృత్తాంతమును సూచించుట వాక్యగత విరోధభావమగును. ఇవి నాటకమునఁ జమత్కారము గొల్పుటకు విశేషముగ నుపయోగపడి సామాజికుల కానందదాయకమగును. ఇట్లు రచించుట కవినైపుణ్యమునుగూడ చాటును. కాని యివి ప్రయత్నపూర్వక రచనలవలెఁ గన్పడరాదు. ఇట్టి రచనగల కావ్యము ధ్వనికావ్యమనియు, **నతి యుత్తమకవిత్వమనియు నాలంకారికుల యుద్దేశము.**

పాత్రపోషణము :— పాత్రచిత్రణము నాటకమున కాత్మవంటిది. పాత్రల స్వభావనిరూపణముండే నాటకగౌరవ మాధారపడి యుండుటచే నది లేనినాటకము నస్తుప్తు. పిల్లలకుఁ జెప్పు కథవలెఁ బేలవముగ నుండును. నాటకమునందుఁ బ్రతిపాత్రము స్వరూప స్వభావములందు సుస్పష్టముగ గోచరించుట, కథయందు దేనికదే యొక స్థానమలంకరించుట, యను ముఖ్య ధర్మముల ననుసరించియే నాటకకర్త పాత్రపోషణము సేయఁదగును. భావించినప్పుడెల్ల నవనవోన్మేషములై సజీవములుగా మన మనోనేత్రము నకుఁ బ్రత్యక్షములుగాఁ గాంచనగునట్లు దోఁచు పాత్రలుగల నాటకమే యే దేశకాలములందైన నుత్తమ రూపకముగఁ బరిగణింపఁబడును. మన ప్రాచీన నాటకకర్తలు రసపోషణమునందు వహించినంత శ్రద్ధ పాత్రపోషణమునఁ జూపినట్లు గనఁబడదు. నాటకకర్తలేకాదు, లక్షణకర్తలు గూడ నట్లే. పాశ్చాత్య నాటకకర్తలు పాత్రపోషణ విషయమున బహు శ్రద్ధవహించిరి. షేక్స్పియరు నాటకములందలి గౌరవాభిరుచులు వాని పాత్రపోషణమునఁ గల యసాధారణ విశేషమునం దిమిడి యున్నవి. సంస్కృత లక్షణకర్తలు నాయకనాయికా భేదములను, వారిగుణములను వివరించి యుండుటచే, సంస్కృతనాటకములందలి పాత్రలు సాంకేతిక ముగ నుండునేకాని సామాన్యముగ విశేషవ్యక్తిత్వముతోఁ గనఁబడవు. అట్లయ్యు శాకుంతలము, మృచ్ఛకటికము, ముద్రారాక్షసము, భాసుని ప్రతిమ మొదలగు నాటకములందుఁ బాత్రచిత్రణము బహుసామర్థ్య ముతో నిర్వహింపఁబడినది.

యథార్థమునకుఁ గథాసంధానమునకును బాత్రపోషణమునకు నవినాభావ సంబంధమున్నది. పాత్రపోషణ మనఁగా మనోవాక్కాయ ముల ప్రవృత్తిగాని కేవల మాకార చిత్రణముగాదు. నాటక కార్యము గూడ నా ప్రతికరణ వ్యాపారమేగాని యన్యముగాదు. నానావిధోద్దేశో ద్దేశపాలితచిత్తవృత్తులు గల వివిధపాత్రల ప్రవర్తనముతోడనే కథా పరిణామమేర్పడును. కథాపర్యవసానమున, తత్సంధానశక్తులగు వారి యుద్దేశోద్దేశకములు స్పష్టపడును. మానవచర్యలు పరిస్థితులమీఁద నాధారపడియుండునట్లే, చేష్టలు శీలమునందు పాదుకొనియుండును. అందుచే నా కార్యములను దదనుగుణముగ ననువదింప వలసివచ్చును.

కథ పాత్రలమీఁద నాధారపడుటయును, పాత్రల ప్రవర్తనము కథలో మిళితమై యంతర్భూతముగా నుండుటయును గల్గునుగాన, వీనిలో నొకదానిని విడిచి మఱియొకదాని నిరూపించుట సాధ్యపడదు. ఈ రెండు నొకవస్తువు యొక్క ముఖద్వయము. కనుక పాత్రల స్వభావమును స్పష్టపఱచు కథాంశములను మాత్రమే యేర్చి నాటకమునఁ గూర్పవలయును. ప్రతి కథాంశము పాత్రల గుణకర్మల స్వయంవ్యక్తము చేయునదిగానుండవలెఁ గాని, యన్యము గారాదు. కాన పాత్రపోషణము చేయు నెపమున కథాప్రవాహమున కడ్డుపెట్టుటకాని, కథను చెప్పు మిషచేఁ బాత్రచిత్రణమును మఱుగుపఱచుటకాని చేయరానిపనులు. రూపకమునఁ బాత్రలు వాడు ప్రతివాక్యము కథ కుపయోగపడువఱకు వారివారి గుణముల వ్యక్తీకరించుచుండవలెనేగాని యన్యములుగా నుండరాదు. కాన నాటక పాత్రల విమర్శనమున తత్కథయందు వ్యక్తమగు గుణములచే నిరూపింపఁబడునుగాని యన్యూనాతిరిక్తముగా గుణములు ప్రశంసింపఁబడవు.

ప్రత్యక్ష పరోక్షమార్గము లను ద్వివిధపాత్రపోషణములలో, నాటకకర్త పరోక్షమార్గమునే యవలంబించి వాక్యరూపమునఁ గొంత, చర్యలరూపమున మఱికొంత వ్యక్తముసేయును. ఒకపాత్ర తన స్వభావానుగుణముగ నితరులతో సంభాషణమున మాటాడిన వాక్యములకు మఱియొక పాత్ర యాతనిఁగూర్చి పలికినవి వ్యాఖ్యాన ప్రాయముగ నుండును. స్వవాక్యము వలన పాత్ర శీలము స్వయంవ్యక్తమగుచుండఁ, బరుల వాక్యములు దానిని ఋజువుసేయును. ఈ రీతి సాక్ష్యములవలె పరిణమించును; గాని, యీ విషయమున విమర్శకుఁడు బహుజాగరూకతతో నుండఁదగును. పరుల వాక్యములలో నేవి పక్షపాత మమతాది భావ దూషితములో, నేవి నిష్పాక్షికములో, ఏవి ప్రమాణార్హములో గ్రహింపవలెను. పాత్రల స్వవాక్యములకును వారి చర్యలకును సామరస్యము కల్గినప్పుడును, పక్షపాతాదులు లేక విశ్వాసార్హములుగనుండి, యాథార్థ్యమెఱుఁగుశక్తిగల వారిపలుకులే ప్రమాణార్హములగును. అట్టి స్వవాక్యము లితరుల వాక్యములతోఁ బొందుగలిగెనేని యవి పరమ ప్రమాణము లగును. స్వవాక్యములో స్వగతమనునది పాత్ర స్వభావమును ప్రత్యక్షముగఁజూపు ముఖ్యసాధనము. ఇతరులతో సంభాషించు

నప్పుడుకంటెఁ నేకాంతముగా నాలోచించునప్పుడు ప్రతి మానవుఁడును నిష్కపటముగ నుండునుగాన, వారి రహస్య స్వభావమును, ప్రవర్తనమును బ్రకటించుటకే స్వగతవాక్యములే సహాయకరణములగుచున్నవి. దీనిఁబట్టి పాత్ర యథార్థశీలము పరిశీలింపఁ దగును. ఇట్టివి సంస్కృత నాటకములం దనేకముగాను, పాశ్చాత్య నాటకములందుఁ దరచుగా నున్నవి.

రసపోషణము:— మన ప్రాచీన నాటక కర్తలు పాత్రపోషణమునందుఁగల లోపమును రసపోషణమున సర్దుకొనిరి. కథా సంధానమునకుఁ బాత్రపోషణముతో నెట్టి సంబంధముగలదో రసపోషణముతోఁ గూడ నట్టి సంబంధమే గలదు. అందుచేఁ బాత్రరసపోషణములకు సన్నిహిత సంబంధమేర్పడినది. కాన సంస్కృతనాటకములందుఁ బాత్ర పోషణము రసానుగుణముగ నున్నది. తద్రసపోషకములైన భాగములనేరి కవి కథాసంధానము సేయును.

రసోచిత కథా పరివర్తనము:— కాళిదాసాది సంస్కృత రూపక కర్తలును, షేక్స్పియరు మొదలగు నాంగ్ల నాటక రచయితలును దమ నాటకములకై ప్రఖ్యాతమైన కథను వస్తువుగా నే పురాణమునుండియో దేశచరిత్రనుండియో గ్రహించి, తమనాటక నిర్మాణమునకై మూలమునుండి కొన్నిమార్పులను జేయుదురు. ఈ మార్పులు ముఖ్యముగా రసపోషణమునకును, పాత్రపోషణమునకు, నౌచిత్యపోషణమునకుఁ జేసి తన్మూలమున నాటకమున కొక విచిత్రగుణమును గూర్చుదురు. మూలములోనున్నటులే నాటకములోఁగూడ మార్పులు లేకుండిన సామాజకుల కభిరుచియుండదు. విన్నకథనే చూచుటకు జనులు కుతూహలపడరు. సామాజకులకుఁ గుతూహలము నభిరుచియుఁగూర్చి వారి హృదయముల రంజింపఁజేసి, నాటకమును వారాదరించునట్లు చేయుటయే నాటక రచయిత ముఖ్యకర్తవ్యము. ఇదియే వాని లక్ష్యము. కాన మార్పు లత్యవసరము. అట్లుచేసి కవులు కృతకృత్యులగుదురు. అందుచేతనే 'నిరంకుశాః కవయః' యనిరి. పైమూఁడుద్దేశములతోఁ గవిచేసిన మార్పులెంతవఱకు నాటక నిర్మాణమునం దనుకూలపడినవని విమర్శకుఁడు విచారింపవలెను. అనఁగా కవిచేసిన మార్పువలన రసపోషణమందుఁగాని,

పాత్రపోషణ మందుగాని, యౌచిత్యము పెరిగెనా లేక తరిగెనా? యా మార్పులు కవ్యుద్దేశమునకు సాధకములాయెనా, లేక బాధకము లాయెనా? యని కవియుద్దేశముతో మొదట సహృదయ బుద్ధితో విచారించవలెను. ఒక మూలకథనే వేరు వేరు కవులు వేరు వేరు రసానులక్ష్యములతో, నొకరుచేసిన మార్పులు మఱియొకరు సేయక, తమ ప్రసానుగుణములైన రూపకములు రచియించి సామాజికుల విచిత్రాభిరుచులకుఁ బాత్రతను గల్గించుచున్నారు. అందుచే నొకమూలకథయే వేరు వేరు విధములుగా కనఁబడును. ఇందు కుదాహరణముగా రామాయణ కథలో విశ్వామిత్రునితో శ్రీరాముఁడు వెళ్లుట మొదలు రావణాసుర సంహారము వఱకుగల మూలకథకు మార్పులుగూర్చి, వీరరస ప్రధానముచేసి భవభూతి మహావీరచరితమును, మురారి యనర్ఘరాఘవమును, భాసుఁ డభిషేక ప్రతిమా నాటకములను వ్రాసిరి. ఈకథనే శక్తిభద్రకవి యద్భుతరసము ప్రధానముగఁ జేసి యాశ్చర్యచూడామణిని వ్రాసి, తద్రసమునకు వలయు మార్పులను జేసెను. ఇట్లు నాటక కర్తలు చేసిన మార్పులవలన పాత్రలశీలములు మారుట నైజమేకాని, వారి యథార్థశీలములను గ్రహించవలెనని నాటకముల మూలమున గ్రహింపరాదు. ఎందుకనఁగా నాటకములందు చేసినమార్పులచే మారిన పాత్ర తన్నాటకానుగత రసపోషణమునకై యౌచిత్యము గూర్చినపాత్రగాని, చరిత్రలోని యథార్థమైన పాత్రగాదు. మూలగ్రంథమైన రామాయణములోని శ్రీరామునిశీలమునకును, మహావీరచరితానర్ఘరాఘవ ప్రతిమాభిషేకాశ్చర్యచూడామణులలోనున్న రాముల శీలములకును పరస్పర భేదము చాలయున్నది. అనఁగానాటకములలోనున్న రాములశీలములు సందర్భములఁబట్టిమారుచున్నవి. అందుచేతనే నాటకకర్తలు మూలమందున్నదొక నాయకునే యవస్థాభేదములచే విచిత్రరీతులుగ తమ బుద్ధికౌశలముచేఁజూపి, తన్మూలమున కథకు నూత్నత నాపాదించి, సామాజికుల యభిరుచిని కుతూహలము నాకర్షింతురు. అందుచే నొక నాయకుఁడే వేరువేరు నాటకములందు వేరువేరు విధములుగ కనఁబడుట. ఇదియొక దీపమునే వివిధ వర్ణములుగల యద్దములుగల 'లాంతరు' మూలమునఁ జూచినట్లుండును. ఇందుచే పై ఛాయనుబట్టి యథార్థశీలమును చర్చింప

రాదు. ఏకనాయకుఁడుగల వివిధ నాటకములందు నాటకానుగుణముగ రసములెట్లు మారుచుండునో, యట్లే పాత్రల శీలములును మారు చుండును. పాత్రకు రసమునకు నవినాభావ సంబంధమున్నది.

రసోచిత పాత్రపోషణము:— ఇఁక పాత్రపోషణమనఁగమూల కథలోనున్న పాత్రశీలమును పోషించుటయా? అనఁగా మూలమందు దోషములతోను దుర్గుణములతోను గూడుకొన్న వ్యక్తిని మార్పులవలన నిర్దోషిగాను, సుగుణవంతునిగాను చేయుటయా? ఇట్లు నాటకము నందలి ప్రతి పాత్రను చేయవచ్చునా? ఇట్లు పాత్రను పోషించుటకు లక్ష్యమేమి?— పాత్ర పోషణమనఁగా మొదలు చివరలేక ప్రతిపాత్రను మూలముకంటె నుత్తమముగాఁ జూపుటకాదు. దీనికి లక్ష్యము రసము. పాత్రపోషణమనఁగా తద్రసోచిత పాత్రపోషణము. భారతీయ నాటకము లలో శృంగార రసోచిత ధీరోదాత్తుఁడు వేఱు. వీరరసోచిత ధీరోదాత్తుఁడు వేఱు. ఆంగ్ల నాటకములలో విషాద నాయకుఁడు వేఱు. ఆహ్లాద నాయకుఁడు వేఱు. వివిధ నాయకులు వారి పాత్ర పోషణమునుబట్టి, శీలములబట్టి వేఱగుచున్నారు. ఇట్టి పాత్ర పోషణమందు కవి చేసిన మార్పులకు పాత్రుఁడైన నాయకునకు, మూల మందున్న నాయకునకు సంబంధముండదు. నాటకమందలి నాయకునకు తద్రసానుగుణమైన యుచితగుణములు మాత్రముండి, తద్రసమునకు విరుద్ధములై, మానవ ప్రకృతియందు సుగుణములుగా బరిగణింపబడుచు, మూలమందున్న కొన్ని సుగుణములుగూడ నుండకపోవచ్చును. అట్లయి నప్పటికి పాత్రపోషణము సిద్ధించును. కాన పాత్రపోషణమునకు ముఖ్య లక్ష్యము రసముగాని, ధర్మము, నీతి, న్యాయము ముఖ్యముకాదు. చాణక్యునీతి వేఱు, రాముని నీతి వేఱు. కాన నాయా రసములకుఁ దగి నట్లు పాత్రశీలమును మార్చి పోషించవలెను. అనఁగా రసానుగుణముగ సుగుణములుగాని, దుర్గుణములుగాని యాపాదించవలెను. ఇట్లే నాయిక కుఁగూడ. ఐతేయిఁక ప్రతి నాయకుని పోషణమెట్లు? వానినిగూడ నాయ కుని పోషించినవిధముగా దుర్గుణములు కప్పిపుచ్చి సుగుణముల వృద్ధి సేయుటయేనా? అట్లయిన నాయక ప్రతినాయకులు సమానస్థానమం దుండి, వారిలో నెవరికి కీడుగల్గినను ధర్మవిరుద్ధమగును. అందుచే

నాకావ్యము విశ్వశ్రేయము. కాజాలదు. కాన నేమి చేయవలయును? ప్రపంచములో ధర్మవిప్లవము లేదని చూపుటయే కావ్యమునకు విశ్వశ్రేయత్వమును గూర్చుట. ఈ ధర్మవిప్లవ మెప్పుడు లేకుండ పోవునది, 'శిష్టసంరక్షణము, దుష్టశిక్షణము' 'ధర్మో జయతి' యని తెల్పుటవలన. ఇట్టి తెలుపుటకు కారణ కలాపములు, పరిస్థితులు సాయపడవలెను. కాన, నధర్మమును ధర్మము జయించెనని చెప్పవలయును గాని, యొక ధర్మగుణమును మఱియొక ధర్మగుణము జయించినదని చెప్పుట యసమంజసము కాదా? అట్లనే యధర్మాత్ముని ధర్మాత్ముఁడు జయించెనని చెప్పవలె. సుగుణములున్న వాఁడు ధర్మాత్ముఁడును, దుర్గుణములుగలవాఁ డధర్మాత్ముఁడు నగుచున్నాఁడుకదా! భారతీయ నాటకములలో జయింపఁబడువాఁడు హింసింపఁబడువాఁడు నాయకుఁడుగా నుండరాదు కాన, నాయకునివధను సూచింపనైనంగూడదు కాన, ధర్మాత్ముఁడు నాయకుఁడు, నధర్మాత్ముఁడు ప్రతినాయకుఁడు నగుచున్నారు. అందుచే నాయకునియందు ధర్మగుణములును, ప్రతినాయకునియం దధర్మగుణములు నుండవలె మూలకథయందొకవేళ నాయకునియందు కొన్ని కళంకములును, ప్రతినాయకుని యందు కొన్ని సుగుణములున్నను, వానినికప్పిపుచ్చి నాయకునిఁబూర్తిగా సుగుణవంతునిగాను, ప్రతినాయకునిఁ బూర్తిగా దుర్గుణవంతునిగాను చేయ ప్రయత్నించుటే భారతీయ నాటకపాత్రపోషణ సంప్రదాయము.

కవిత్వము:— నాటకము సంగీతకవిత్వముల మిశ్రకళ కాన సంగీతాశ్రయమైన కవిత్వమం దుండఁదగును. నాటకము దృశ్యకావ్యమగుటచేఁ గావ్యగుణమైన కవిత్వమందు ముఖ్యము. ఆ కవిత్వము గద్యపద్యమిశ్రమము. ఆద్యంతము పద్యభూయిష్ఠముగగాని, గద్యమయముగ గాని నాటకములు వ్రాయునాచారము పాశ్చాత్యదేశములందు గలదు, కాని మన ప్రాచీనులందు లేదు. ఆధునికులు స్వభావవాదమును పురస్కరించుకొని నాటకమున పద్యము లుండరాదని వాదించుచున్నారు. కాని యది కళాదృష్టితోఁ జూచిన నిలువఁజాలదు. త్రివిధాభినయములలో వాచిక మొకటి కాన, దాని యౌచిత్యమును బోషించుటకై సందర్భమెఱిఁగి గద్యపద్యముల నాటకమందు ప్రయోగించుట మేలు. సామాన్యసల్లాపములకు గద్యము వాడుట తగును. అదియును చతురముగా నుండిన

రసవంతముగా నుండును. దీర్ఘవచనములెంత రమణీయములైనను విసుగు గొల్పును. భావము తీవ్రరూపముదాల్చినచోట పద్యము సమంజసముగా నుండును; కాని పద్యమాలికను వాడుటయు వెగటుదోఁపును. భావ మతితీవ్రముగ నున్నచోట పాటలు వాడినను రమణీయముగనే యుండును. కాని సందర్భము తెలియక యీ మూఁటిని తారుమారు సేయుచో పరిహాసపాత్రముగ నుండును. మఱియు నేభావమున కేవృత్తముపయోగించిన మనోహరముగ నుండునో, బహుజాగరూకతతో గుర్తించి వ్రాసినఁగాని యీ పద్యము రసవంతముగా నుండదు. పాత్రోచిత భాషవలె, రసోచితశైలివలె, భావోచిత వృత్తమును రసపోషకమగును, కానినాఁడు రసభంజక మగును. లలితభావములకు చంపకోత్పలమాలాదులును, గంభీరభావములకు శార్దూలమత్తేభాది వృత్తములు నుపయోగార్హములు. ఈ రహస్య మెఱుఁగక యనేక నాటకకర్తలు దమరూపకముల రసాభాసము చేసిరి.

రసోచితశైలి:—పాత్రయున్న పరిస్థితులలోఁ దాను పొందిన యావేశముచేతఁగద రసముజనించుచున్నది. ఆ యనుభవించిన రసము భాషచేఁగద వ్యక్తీకరింపఁబడుచున్నది. ఆ భాష తద్రసావేశితపాత్రనుండి వచ్చునపుడు తద్రసానుగుణమైన శైలిలో నుండవలయును గదా! అందుచే శైలికి రసమునకు నెడతెగని సంబంధమున్నది. అట్లయిన తద్రసానుగుణమైన శైలి యేది? అది యిదమిత్థమని గ్రహించుటెట్లు? ఏ శైలియైతే మరలమరలఁ జదివినపుడా రసముద్భవించునో యది తద్రసమునకుఁ దగినదని గ్రహింపవలె. దీర్ఘసమాసభూయిష్ఠమైన శైలి, యారభటీ, సాత్వతీవృత్తులలోనున్న శైలి, చదివినపుడు వీరరౌద్రాదిరసము లుత్పన్నములగుచున్నవి. సమాసములు లేక, మృదుపదములతోడను, తేటతెల్లమైన మాటలతోనున్న శైలివలన శృంగారకరుణాదిరసము లుదయమగుచున్నవి. అట్లుగాక దీర్ఘసమాసయుక్తశైలి శృంగారాదిరసములకును, లలితపదయుతశైలి వీరరౌద్రములకు వాడినతద్రసోత్పత్తికలుగుచున్నదా? యని పరీక్షింపుడు. కాన నొక్కొక్కవృత్తి యొక్కొక్కరసము నాశ్రయించి యుండును. ఒక రసమునకు తద్రసానుయుక్తమైన శైలిని వాడకపోయిన తద్రసానుగుణమైన భావము వ్యక్తీకరింపఁబడదు. అందుచే రసా

భాసము గలుగును. అందుచేతనే పాత్రోచితభాష వాడుట. పాత్రయనఁగా నీచపాత్రి, యుత్తమపాత్రి యనియే కేవలముగాక, వీరకారుణ్యరసావేశిత పాత్రియా? లేక శృంగారరసావేశిత పాత్రియా? యనికూడ విచక్షణ చేయవలయును. కాన రసమనునది కథాసందర్భపరిస్థితి, లేక యవస్థయం దును, పాత్రిపోషణమందును, పాత్రిభాషితశైలిమీఁద నాధారపడి యుండును.

తత్త్వోపదేశము:— వేదాంతివలె ప్రత్యక్షముగాఁ గాకపోయినను మహాకవులు తమ కావ్యముల నేదే నొక పరమార్థమును వ్యంగ్యప్రాయ ముగ నుపదేశింతురు, కాని కేవలము కథాప్రయోజన మాశించి కావ్య రచన చేయరు.అది స్థూలదృష్టికి ప్రత్యక్షముగాగోచరింపకున్నను విమర్శ కునికిఁ దోఁచుచునేయుండును. నాటకకర్త లనకు గోచరించిన తత్త్వమును శ్రవ్యకావ్యకర్తవలెఁ దానేచెప్పడుకాని, పాత్రలమూలమున కథాంత ర్వాహినిగాఁ బ్రవహింపఁజేయును. ఇట్లని తనకావ్యమును కవి వేదాంత సిద్ధాంతములతో నింపినచో కథకు రసమునకుఁగూడ భంగపాటు వాటి ల్లును. కావ్యరసమును తత్త్వోపదేశమును మిళితము చేయుటచేతనే షేక్స్పియరు వ్రాసిన ప్రతినాటక మొక సూక్ష్మజగత్తైనది. అందు కవియే సృష్టికర్త. తత్కథాసంధానము విధివిధానమని మాల్టను పండితుఁడు చెప్పినమాట ప్రతియుత్తమ నాటకవిషయమున ననువర్తించును.

ఇందనుక ప్రాచ్య పాశ్చాత్య నాటక నిర్మాణ విధానము చాల వఱకు సామ్యభావముతోనుండినది, కాని మనవారు నాటకమున వీర శృంగారములు మాత్రిమే ప్రధాన రసములుగ నుండవలయు ననుట లోను, పాశ్చాత్యులు సుఖాంతముగాని, విషాదాంతముగాని కాఁదగు ననుటలో వీరిద్దఱకు ముఖ్యభేదమున్నది. మన లక్షణకర్తలు దశవిధ రూపకముల వివరించిరి, కాని యందెందును విషాదమయ నాటక లక్ష ణములు లేకపోవుటయేకాక, నాయకవధ నెక్కడను సూచింపరాదను నియమమునుగూడ చేసిరి. ఐనను సంస్కృతమున వధాంత నాటకము లక్కడక్కడ లేకపోలేదు! ప్రాచీనులలో పతంజలి పేర్కొన్న కంసవధ, బలిబంధము మొదలైనవియు, నర్వాచీనులలో భాసుని యూరుభంగ ము నిట్టివే, కాని యివన్నియు పాశ్చాత్యుల విషాదమయ నాటకముల

(tragedy) వంటివి కాఁజాలవు. ఎందుకన వారి నాటక లక్షణములు వీనికి సమన్వయింపవు. విషాదమయ నాటకము కరుణభయాత్మకమై యుండ వలయునని యరిస్టాటిలు శాసనము. ఈ మతమునే యనుసరించి షేక్స్పియరు దననాటకములం దీ లక్షణముల పాటించెను. నాయకుఁడు మహాధీరుఁడై యుండియు నరిషడ్వర్గములో నేదే నొకదానికి వశ్యుఁడగుచు, ధైర్యముతైన యతని మహాపురుష లక్షణములకును, క్షుద్రమైన యంతశ్శత్రువునకును దన జీవనమున సంఘట్టనమును పొందును. ఈ చిత్తక్షోభములో మనస్సాక్షి సేయు నుపదేశమునకు, నంతశ్శత్రువు గల్గించు భ్రమకు వశ్యుఁడై నిశ్చయమునకు రాక డోలాందోల మానసుఁడగుచుఁ జివర కంతశ్శత్రువు మనస్సాక్షికంటెఁ బ్రబలమై తన్ను దుష్కార్యాచరణమునకుఁ బ్రేరేపం గ్రమముగా దుష్కార్య పరంపర నొనర్చి చివరకుఁ బాపఫలము పక్వముచేసి తత్ఫలమనుభవించును. కడకు నిష్ప్రయోజకమైన పశ్చాత్తాపమొంది జీవించుటకుఁగూడ రోసి తనచేతిలోఁగాని, పరులచేతిలోఁగాని మరణించును. మొత్తముమీఁద 'నెవని నాశనమునకు వాఁడే కర్త' యను సూక్ష్మధర్మమీనాటకముప్రతిపాదించును. ఈ నాయక పతనము విధివశమున జరిగినట్లెచ్చటను గన్పడరాదు. ఇట్టి విషాద నాయకునెడ మన కాదరమును సానుభూతియుఁ గలుగవలయునుగాని, యతని పతనము వలన మనము సంతోషింపఁదగినట్లుండరాదు. మఱియు నెట్టి మహానీయునకెట్టిగతి పట్టెన దను భావము గలుగనిచో విషాదమయ నాటక ప్రయోజనము చెడును. ఈగుణములేవియు లేక పరహత్యలు నాత్మహత్యలు మాత్రము గలనాటకములు యథార్థ విషాదమయ నాటకములు గాఁజాలవు. కాన కంస దుర్యోధన రావణాదుల జీవితములందు ధర్మాధర్మ సంఘట్టనయే లేక, కేవల మధర్మమార్గావలంబకులగుటచే వారానాటకములం దుపనాయకులు, లేక ప్రతినాయకులు మాత్రమేయైరి, కాని నాయకులుగా లేదు. వారియెడ మనకు జాలి గలుగవలసిన యావశ్యకతయే యుండదు. మఱియు నాగానందమున జీమూత వాహనునకు మరణావస్థ సంభవించినను నీశ్వరానుగ్రహముచేఁ బునర్జీవితుఁడగును. అట్లు గాకున్నను స్వార్థత్యాగియైన యుతఁడు పతితులలోఁ జేరఁడు. విషాదనాయక లక్షణము లితనికిఁబట్టవు.

నాటకమున ముఖ్యముగా నుండఁదగిన విషయము మఱొకటి గలదు. లోకమున నేమానవుని జీవితము ప్రశాంతముగ జరుగదు. మహారాజు మొదలు సేవకునివఱకు ప్రతి మనుష్యుని జీవితమం దేవో కొన్ని విఘాతములు గలుగుచునే యుండును. అందుచేతనే ప్రతివ్యక్తి జీవిత చరిత్ర మొక నాటకప్రాయమై, మానవజీవిత ప్రతిపాదనమే కళ యనఁబడుట నాటకమందలి యుదాత్తనాయకజీవితమం దీ సంఘటన లతితీవ్రముగను, నధికముగఁగూడ నుండును. నాటకకథ సంఘటనల ఘాతప్రతిఘాతములచే వెనుక ముందులకుఁ బోవుచుండును. నాటకమున ముఖ్యముగ నీ స్థితియే ప్రకటింపఁబడును. నాటకమందు నాయకులు దనజీవితమున, సంకల్పకార్యములందు సంఘటిల్లిన విఘాతముల నతిక్రమించుటకుఁ బ్రయత్నించుచున్నట్లు ప్రకటింపఁబడును. విఘ్నపరంపర లడ్డుదగులుచుండ వాని నెదుర్కొనుచుండునంతవఱకు నాటకము జరుగుచునే యుండును. నాయకుఁడు విఘాతముల నతిక్రమింపఁగలుగుచో నాటకము సుఖాంతమగును. విఘాతముల దాటలేక నాయకుఁ డకృతార్థుఁడై తాను మరణించినచో నాటకము విషాదాంతమగును. సుఖదుఃఖముల సంఘర్షణముచేతనే నాటక కళోత్పత్తియగును. అందు బహిర్ఘటనలతోఁగాని, యంతఃప్రవృత్తులతోఁగాని సంఘర్షణ ముండవలయును. బహిర్ఘటనల యుద్ధము నుపలక్ష్యముగ నుంచి, మనుష్యప్రవృత్తుల వికాసమును జూపించుట సామాన్య నాటకపద్ధతి. ఇక నంతఃప్రవృత్తుల పరస్పర సంఘర్షణమును ప్రతిపాదించుట యుత్తమ నాటకవిధానము. ఇట్టి సంఘటనల సంఘర్షణము లేనిది నాటకమే కాదు.

నాటకమున నింకొక ముఖ్యవిషయము ప్రవృత్తుల సామంజస్యమధికముగాఁ జూపుట. అనుకూల ప్రవృత్తుల సామంజస్యమును ప్రతిపాదించుట సామాన్యవిధము. కాని ప్రతిమానవుని చరిత్రము గుణదోషములతోఁ గూడుకొనియుండును. ఇట్టి విపరీత ప్రవృత్తుల సమ్మిళనమును బ్రకటించుట నాటకకర్త కెక్కువ కష్టసాధ్యము. అట్టిది నాటకకర్త సంపూర్ణ మనుష్య చరిత్రమును, మానవ మానసిక తత్త్వాభిజ్ఞత్వము నెక్కువ స్పష్టముగ వెలువరించును. ఇదియే మానవుని యంతర్జగత్తును విప్పిచూపి, నాటకకర్త శక్తినైపుణ్యములఁ బ్రదర్శించు సంద

(tragedy) వంటివి కాఁజాలవు. ఎందుకన వారి నాటక లక్షణములు వీనికి సమన్వయింపవు. విషాదమయ నాటకము కరుణభయాత్మకమై యుండ వలయునని యరిస్టాటిలు శాసనము. ఈ మతమునే యనుసరించి షేక్స్పి యరు దననాటకములం దీ లక్షణముల పాటించెను. నాయకుఁడు మహా ధీరుఁడై యుండియు నరిషడ్వర్గములో నేదే నొకదానికి వశ్యుఁడగుచు, ధైర్యము లైన యతని మహాపురుష లక్షణములకును, క్షుద్రమైన యంతశ్శత్రువునకును దన జీవనమున సంఘట్టనమును పొందును. ఈ చిత్తక్షోభములో మనస్సాక్షి సేయు నుపదేశమునకు, నంతశ్శత్రువు గల్గించు భ్రమకు వశ్యుఁడై నిశ్చయమునకు రాక డోలాందోల మాన సుఁడగుచుఁ జివర కంతశ్శత్రువు మనస్సాక్షికంటెఁ బ్రబలమై తన్ను దుష్కార్యాచరణమునకుఁ బ్రేరేపం గ్రమముగా దుష్కార్య పరంపర నొనర్చి చివరకుఁ బాపఫలము పక్వముచేసి తత్ఫలమనుభవించును. కడకు నిష్ప్రయోజకమైన పశ్చాత్తాపమొంది జీవించుటకుఁగూడ రోసి తనచేతిలోఁగాని, పరులచేతిలోఁగాని మరణించును. మొత్తముమీఁద 'నవని నాశనమునకు వాఁడే కర్త' యను సూక్ష్మధర్మమీనాటకముప్రతి పాదించును. ఈ నాయక పతనము విధివశమున జరిగిన దైవచ్చటను గన్పడ రాదు. ఇట్టి విషాద నాయకునెడ మన కాదరమును సానుభూతియుఁ గలుగవలయునుగాని, యతని పతనము వలన మనము సంతోషింపఁదగి నట్లుండరాదు. మఱియు నెట్టి మహనీయునకెట్టిగతి పట్టిన దను భావము గలుగనిచో విషాదమయ నాటక ప్రయోజనము చెడును. ఈగుణము లేవియు లేక పరహత్యలు నాత్మహత్యలు మాత్రము గలనాటకములు యథార్థ విషాదమయ నాటకములు గాఁజాలవు. కాన కంస దుర్యోధన రావణాదుల జీవితములందు ధర్మాధర్మ సంఘట్టనయే లేక, కేవల మధర్మ మార్గావలంబకులగుటచే వారానాటకములం దుపనాయకులు, లేక ప్రతినాయకులు మాత్రమేమైరి, కాని నాయకులుగా లేరు. వారియెడ మనకు జాలి గలుగవలసిన యావశ్యకతయే యుండదు. మఱియు నాగా నందమున జీమూత వాహనునకు మరణావస్థ సంభవించినను నీశ్వరా నుగ్రహముచేఁ బునర్జీవితుఁడగును. అట్లు గాకున్నను స్వార్థత్యాగియైన యతఁడు పతితులలోఁ జేరఁడు. విషాదనాయక లక్షణము లీతనికిఁబట్టవు.

నాటకమున ముఖ్యముగా నుండఁదగిన విషయము మఱొకటి గలదు. లోకమున నేమానవుని జీవితము ప్రశాంతముగ జరుగదు. మహారాజు మొదలు సేవకునివఱకు ప్రతి మనుష్యుని జీవితమందు ఏవో కొన్ని విఘాతములు గలుగుచునే యుండును. అందుచేతనే ప్రతివ్యక్తి జీవిత చరిత్ర మొక నాటకప్రాయమై, మానవజీవిత ప్రతిపాదనమే కళ యనఁబడుట నాటకమందలి యుదాత్తనాయకజీవితమందీ సంఘటన లతితీవ్రముగను, నధికముగఁగూడ నుండును. నాటకకథ సంఘటనల ఘాత ప్రతిఘాతములచే వెనుక ముందులకుఁ బోవుచుండును. నాటకమున ముఖ్యముగ నీ స్థితియే ప్రకటింపఁబడును. నాటకమందు నాయకులు దమజీవితమున, సంకల్పకార్యములందు సంఘటిల్లిన విఘాతముల నతిక్రమించుటకుఁ బ్రయత్నించుచున్నట్లు ప్రకటింపఁబడును. విఘ్నపరంపర లడ్డగులుచుండ వాని నెదుర్కొనుచుండుటయే యంత నాటకము జరుగుచునే యుండును. నాయకుఁడు విఘాతముల నతిక్రమింపఁగలుగుచో నాటకము సుఖాంతమగును. విఘాతముల దాటలేక నాయకుఁ డకృతార్థుఁడై తాను మరణించినచో నాటకము విషాదాంతమగును. సుఖదుఃఖముల సంఘర్షణముచేతనే నాటకకథోత్పత్తియగును. అందు బహిర్ఘటనలతోఁగాని, యంతఃప్రవృత్తులతోఁగాని సంఘర్షణ ముండవలయును. బహిర్ఘటనల యుద్ధము నుపలక్ష్యముగ నుంచి, మనుష్యప్రవృత్తుల వికాసమును జూపించుట సామాన్య నాటకపద్ధతి. ఇఁక నంతఃప్రవృత్తుల పరస్పర సంఘర్షణమును ప్రతిపాదించుట యుత్తమ నాటకవిధానము. ఇట్టి సంఘటనల సంఘర్షణములేనిది నాటకమే కాదు.

నాటకమున నింకొక ముఖ్యవిషయము ప్రవృత్తుల సామంజస్య మధికముగాఁ జూపుట. అనుకూల ప్రవృత్తుల సామంజస్యమును ప్రతిపాదించుట సామాన్యవిధము. కాని ప్రతిమానవుని చరిత్రము గుణదోషములతోఁ గూడుకొనియుండును. ఇట్టి విపరీత ప్రవృత్తుల సమ్మేళనమును బ్రకటించుట నాటకకర్త కెక్కువ కష్టసాధ్యము. అట్టిది నాటకకర్త సంపూర్ణ మనుష్య చరిత్రమును, మానవ మానసిక తత్త్వాభిజ్ఞత్వము నెక్కువ స్పష్టముగ వెలువరించును. ఇదియే మానవుని యంతర్జగత్తును విప్పిచూపి, నాటకకర్త శక్తినైపుణ్యములఁ బ్రదర్శించు సంద

ర్భము. అసలు మానవప్రకృతి బహు విచిత్రమైనది. అందు రెండు రెండు లక్షణము లున్నవి. మొదటిది పాశవప్రవృత్తి. రెండవది దివ్యప్రవృత్తి. ఇందు మానవుని నొకశక్తి వెనుకకు లాగిన, రెండవశక్తి యాతనిని ముందుకు నెట్టును. ఈసంఘర్షణముచే మానవుఁడు ప్రకృతిని మాత్రము దాటలేకపోవును. పాశవప్రవృత్తి సుశిక్షణలేనిచో నరిషడ్వర్గప్రేరితమై, క్రమముగా నభివృద్ధిచెంది, మానవుని హీనాతిహీనుని గావించును. దివ్యప్రవృత్తి సదుపదేశ, సదభ్యాసములచే నతనిని దేవతాతుల్యు నొనరించును. ఈ పాశవ దివ్యప్రవృత్తులకు జరుగు యుద్ధమును ప్రతిపాదించునదే యుత్తమనాటకము. పాశ్చాత్యనాటకములం దీ రెండు ప్రవృత్తుల వైరము నేకవ్యక్తియందే ప్రదర్శించి, కవి వాస్తవజగత్తును నిర్మించును. భారతీయ నాటకములం దీ రెండు ప్రకృతులు ప్రత్యేక వ్యక్తులందు నిరూపించి, దివ్యప్రవృత్తిని నాయకునిగను, పాశవప్రవృత్తిని ప్రతినాయకునిగఁజేసి కవి వారిద్దరకు వైరమును ప్రదర్శించును. (ఈ తత్త్వము కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయ నాటకమున స్పష్టపరుపఁబడినది.) ఇట్టి సంఘర్షణమందు భారతీయ నాయకులకు శ్రుతిస్మృతి ధర్మములు సాయము వచ్చి, ప్రభుసమ్మితములై, ధర్మాచరణమార్గదర్శకములగుటచే,పాశవకార్యాచరణమునుండి రక్షించును.అందు ధర్మమునకే ప్రాధాన్యమిచ్చి, స్వార్థత్యాగముచేసి యాదర్శచరిత్రము చిత్రింపఁబడును. దీనికిఁదోడు ధర్మరక్షణార్థమై యతిమానుషశక్తి ప్రవేశపెట్టఁబడి, యే మహర్షియో, భగవంతుఁడో నాయకుని సాహసకార్యాచరణమునుండి రక్షించును. ఇందుచే చికీర్షితమునుగూర్చి నాయకుని మనస్సులో సందిగ్ధపూర్వక ధర్మాధర్మమీమాంసచేయు దీర్ఘస్వగతముల కవకాశముండదు. ఇది దివ్యచరిత్రము. ఇట్టివారు శ్రీరాముఁడు, దుష్యంతుఁడు మొదలైనవారు. ఇఁక మానవుని పాశవ ప్రవృత్తులకు నిరంకుశప్రభావమున్నట్లు ప్రతిపాదించు పాశ్చాత్య నాటకములందలి నాయకుఁడు, సంఘటనల విఘాతప్రతిఘాతము లధికమైనపు డరిషడ్వర్గప్రేరణమునుండి, తన యంతఃప్రకృతిని నిగ్రహించుకొనలేక, స్వార్థపరుఁడై, చికీర్షిత మెఱుఁగఁజాలక, సాహసకార్యాచరణ మొనర్చి రక్తపాతమున తన జీవితమును విషాదాంతము చేసికొనును.

మనప్రాచీను, లిట్టి నాటకముల వ్రాయకుండుటకుఁ గారణము చిత్తక్షోభము గల్గించు నాటకముల పరిహరించుటయు, 'మంగళాదీని, మంగళమధ్యాని,' మంగళాంతాని, యనుశాసనము ననుసరించి జగము కళ్యాణాత్మకమనియే నిరూపింపఁదలఁచుటయు, నుత్తమ నాయకునియెడ వారికిఁగలగౌరవము నైయుండుననియూహింపఁదగినది. మనపూర్వులుచిత్త క్షోభమునుగాని, క్షుద్రభావోదయములగాని, గల్గింపకయుద్రిక్తులఁజేయక ప్రశాంతముగ సత్వశుద్ధిని రససిద్ధిని గల్గించు నాశయముతో నాటకముల రచియించిరి. మనోనేత్రములకు దుస్సహ్యమైన ఘోరకార్యములను నాటకములందువర్ణించుటకాని, ప్రదర్శించుటకాని సహింపరాని దురాచారముగ వారు భావించియుందురు. వీరరస ప్రధాన నాటకములందుఁ గూడ వారీ మర్యాదను పాటించియే యుండిరి. భారతీయ నాటకకర్తలు ధీరనాయకులఁ గైకొని, వారిని గష్టపరంపరలలోఁదేల్చి యార్చి తుదకు ధీరత్వముచే వారు కంటకశతంబులదాటి మిన్నలై నిజసత్వమును ప్రకటించి, యీప్సితార్థముల సంపాదించిన యుదంతముల నభిమానముతోఁ జిత్రించిరి.

పాశ్చాత్యులు మన ప్రాచీనులతో భేదించిన మఱియొకవిషయము పాత్ర పోషణవిధము. పాశ్చాత్యులు మానవ స్వభావానుగుణముగ నుత్తమ నాయకునియందుఁ గూడ నేదో యొక కళంక లేశముండుటను చూపి తన్మూలమున వానిపతనమును గల్గఁజేసి కర్మప్రాబల్యమును బ్రకటింతురు. మఱియు దుష్టునియందుఁగూడ గుణలవ ముండుటను చిత్రించి మానవప్రకృతి మిశ్ర గుణయుతమనియుఁగూడ నిరూపించుదురు. మన ప్రాచీను లుత్తమనాయకుని సకల సద్గుణ శోభితునిగాను, దుష్టునాద్యంత కళంక దూషితునిగాను చిత్రించి యాదర్శ ప్రాయులుగఁ జేయుదురు. ప్రాచ్య పాశ్చాత్య నాటకములఁ గళాదృష్టితోఁ జూచిన నీ ద్వివిధపాత్రపోషణమునందుశిల్పనైపుణ్యము సమానమేయనవలయును. అది కవిశక్తిమీద నాధారపడి యుండునుగాని, పద్ధతిమీదనుండదు. కాన వీనిలో నొకటి మంచిది, మఱియొకటిచెడ్డదని భావించుట సమంజసముగాదు. ఈ భేదము సాంఘిక సంప్రదాయాభిరుచులపై నాశ్రయించి యుండును.

అద్యతనకాలమున సంఘమందలి గుణదోషములఁ బ్రకటించుటకై 'టాలుస్టాయి' మొదలైన పాశ్చాత్యకవుల ననుకరించుచుఁ గొందఱు వచనరూపమున నాటికలను పేరితో వ్రాయుచున్నారు, ఇవి దశరూపకమునఁ జెప్పఁబడిన మనప్రాచీన సంప్రదాయమునకుఁ జెందిననాటిక జాతికిమాత్రము చెందవు. ఇక మనప్రాచీనులు సాంఘికకథ వస్తువుగా గల నాటకమును ప్రకరణమని నిర్దేశించి, యందు దశాంకము లుండవలయునని నిర్దేశించిరి అట్టివి మృచ్ఛకటికము, మాలతీమాధవము, మల్లికామారుతప్రకరణము మొదలైనవి. కాని యివి యెంత రమణీయములైనను, ప్రదర్శించుటకేకాక, చదువుటకుఁగూడ బహుకాలము పట్టును. కాన స్వల్పకాలములో ముగింపఁదగి, సులభగ్రాహ్యమైన వచనములో రచియింపఁబడి, సర్వవిధముల లాఘవమైన సంభాషణరూపమగు రచనలు ప్రస్తుతము నాటికలనుపేరితో వ్యవహరింపఁబడుచున్నవి. ఇందుదాత్తమైన విషయమునుగ్రహించి, పరమార్థమునంతర్వాహినిగాఁ బ్రవహింపఁజేసి, లౌకికతత్త్వమును వ్యంగ్యముగా బోధించి, గంభీర రచనచేయఁగల కవులక్కడక్కడ లేకపోలేదు. ఇట్టివి యుత్తమరూపకములని యంగీకరింపక తప్పదు. కాని సంఘమందలి కొందఱివ్యక్తుల గుణదోషములమాత్రము ప్రకటించుటకుగాని, చమత్కారముగ వినోదారము ప్రకటించుటకుఁగాని, చదువుటకుఁగాని వ్రాయఁబడినవి దశవిధరూపకములలోఁ బ్రహసనమను నాటకజాతికిఁ జెందినవి. ఇవి హాస్యరసము ప్రధానముగాగల్గి, సంఘసంస్కరణమునకు ముఖ్యముగా నుపయోగించును. కాని గంభీరముగాను విశ్వజనీనముగ నుండవు.

ఈ విధనాటకములందుఁగూడ మహానాటకలక్షణములైన పంచసంధులతోడి కథాసంధానము, పాత్రరసౌచిత్యాది పోషణములు, తత్త్వోపదేశము మొదలైనవి యున్నప్పుడే యవి శోభించునుగాని, దారి తెన్ను లేకపోయినచో రసాభాసముగనుండును. కాన నవి వీనియందుగూడ నవుసరములే. వీనిలోఁ గొన్నింటికి విశేషప్రాధాన్యమిచ్చి, మిగిలినవానిని గమనింపకపోవుటచేత నవీననాటకములందు కొన్ని కొంద ఱకుమాత్రమే యభిమానకరములైనను, సర్వజనాదరణపాత్రము కాకపోవుటకుఁ గారణములైనవి.

## స్వప్న వాసవదత్తము

భాససమస్య:—భాసమహాకవి రచిత నాటకములం గూర్చియు నాతని కాలమును గూర్చియు బండితులం దనేకాభిప్రాయము లున్నవి. 1912 సం.న మహామహోపాధ్యాయ పండిత టి. గణపతిశాస్త్రిగారు 1 మధ్యమ వ్యాయోగము, 2 దూత ఘటోత్కచము, 3 ఊరుభంగము, 4 కర్ణభారము, 5 దూతవాక్యము, 6 బాలచరితము, 7 అవిమారకము, 8 పంచరాత్రము, 9 అభిషేకము, 10 ప్రతిమ, 11 చారుదత్తము, 12 ప్రతిజ్ఞా యౌగంధరాయణము, 13 స్వప్నవాసవదత్తమను నాటకములను ప్రచురించువఱకు నవీనులు భాసనాటకముల నెఱుంగరు. ఈ నాటకసంపాదకులగు గణపతిశాస్త్రిగారు పైరూపకములన్నియు భాసమహాకవి రచితములే యని కొన్ని కారణములంబట్టి యుపపాదించిరి. కాని ప్రతిపక్షులావాదమును బూర్తిగా ఖండించిరి. యథార్థమున కుభయవాదములు సంతృప్తికరములుగ గాని, దోషరహితములుగగాని లేవు. సంపాదకు లుపపాదించిన కారణము లివి. (1) సాధారణముగ నాటకములందు ప్రారంభమున నాందియు తరువాత 'నాంద్యంతే సూత్రధారః' యని యుండును. కాని యీనాటకములందు 'నాంద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః' యనియు, తర్వాత మంగళాచరణ శ్లోకము నున్నవి. ఈ విశిష్ట లక్షణమునే బాణుఁడు దన హర్షచరిత్రమున,

> "సూత్రధార కృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః ।
> సపతాకై ర్యశో లేభే భాసో దేవకులైరివ॥"

అని సూచించెను. (2) ఈ నాటకములం దన్నింటను ప్రస్తావనకు బదులు 'స్థాపన' యని వాడఁబడినది. (3) సాధారణనాటకములకు భిన్నముగ నీ స్థాపనలందు నాటకకర్త పేరుగాని, నాటకము పేరుగాని పేర్కొనఁబడియుండ లేదు. ఇందుచే నీనాటకములు ప్రాచీనకాలమునకుఁ జెందినవనియు, నా కాలమున నీవిషయములు ప్రారంభకార్యములకే విడిచివేయు నాచారము గలదనియు భావింపఁబడినది. (4) వీనియన్నింటి భరతవాక్యములు 'మా రాజు భూమినంతయు పాలించుఁగాక' యను

నాశీర్వాదవాక్యముతో నింపియున్నవి. (5) ఈ నాటకములన్నియు నిర్మాణవిధానమున సామ్యముగల్గి, ప్రారంభశ్లోకములు ప్రధానపాత్రల సంబంధమునుగూర్చు జసి ముద్రాలంకార లక్షణముతోఁ గూడియున్నవి.

(6) రాజశేఖరుఁడు సూక్తిముక్తావళిలో,

"భాసనాటక చక్రేఽపి ఛేకైః క్షిప్తే పరీక్షితుమ్
స్వప్నవాసవదత్తస్య దాహకోఽభూ న్న పావకః॥"

అని స్వప్నవాసవదత్త నాటకకర్త భాసుఁడని తెలిపెను. శైలి, నాటకలక్షణములు, భావములు, శబ్దజాలము మొదలైనవానియందు సామ్యముగల యితరనాటకములుగూడ భాసరచితములే యని నిర్ణయింపఁ బడినవి. (7) ఆలంకారికు లనేకులు భాసునినాటకములనుండి యుదాహరణముల గ్రహించిరి. వామనుఁడు ప్రతిజ్ఞా యౌగంధరాయణము, స్వప్నవాసవదత్తము, చారుదత్తములనుండి యుదాహరణముల స్వీకరించెను. భామహుఁడు ప్రతిజ్ఞా యౌగంధరాయణమును విమర్శించుచు నా నాటకభాగములనే యుదహరించెను. దండి బాలచరిత, చారుదత్తనాటకముల నుండి శ్లోకముల గ్రహించెను. అభినవగుప్తుఁడు 'నాట్యవేదవివృతి'యందు స్వప్నవాసవదత్తమును సూచించి, ధ్వన్యాలోకమున దానినుండి యొక శ్లోకము నుదాహరణముగా గ్రహించెను. కాని యాశ్లోకముమాత్ర మీనాత్నప్రతియందుఁ గానరాదు. వీనికిఁదోడు ఛందస్సు, వ్యాకరణ విశేషములు, ప్రాకృత వైలక్షణ్యమును వీని బహుప్రాచీనతను దెల్పును. నాయకవధను, శయనమును బ్రదర్శించుట మొదలైన నాట్యశాస్త్ర విరుద్ధవిషయములుగూడ వీని ప్రాచీనత నుద్ఘోషించుచున్నవి.

ప్రతిపక్షులు పైవాదములనన్నింటిని ఖండించి యీ నాటకములు ప్రాచీనుఁడైన భాసునివి కావని వాదించిరి. ఈ నాటకములందుఁ గవి నామము పేర్కొనకపోవుటకుఁ గారణముగా బహునాటకములనుండి భాగముల దొంగిలించిన సంపాదకకవులు దమనామమును గుప్తముగా నుంచుకొనుట సహజమని వారివాదము. హర్షునిశ్లోకమగు 'సూత్రధారకృతారంభైః' అనుదానియందు విశేషభావము లేదనియు, నది భాస నాటకవైలక్షణ్యము గాదనియు, నర్వాచీననాటకములఁగూడ నిట్లే వ్యాఖ్యానము చేయవచ్చుననియుఁదెల్పి 'నాంద్యంతే తతః ప్రవిశతి' మొద

లగునవి దక్షిణదేశప్రతులందలి విశిష్టలక్షణము గాని ప్రాచీన లక్షణము గా దనిరి. మఱియు నెక్కువ రమణీయముగా నుండుటకై నాట్యశాస్త్ర విరుద్ధలక్షణములు గల్గిన విషయములు నాటకమునఁ జేర్పఁబడె సహజ మనియు వాదించిరి. ఇంక నపాణినీయ ప్రయోగములు పురాణకావ్యము లందుఁగూడఁ గాంచనగును గాన నిది ప్రాచీనతను నిర్ణయింపదనియును, ప్రాకృత విలక్షణత్వము మలయాళప్రతులగు కాళిదాసాదుల కావ్యము లందుఁ గూడ గానఁగుటనుబట్టి యిదియును ప్రాచీనతను దెల్పదని వాదించిరి. మరియు నాలంకారికులు లక్షణగ్రంథములలోఁ బేర్కొనిన శ్లోకములను నాటకనామముతోఁగాని, కవిపేరుతోఁగాని కలిపి తెలుపరైరి. భాసునిశ్లోకములని తెల్పఁబడిన పద్యము లీ నాటకములందు గానరాకుండుట పూర్వపక్షుల వాదమున కొక బలమైన కారణము.

క్రోడీకరించిన పైవాదములఁబట్టి రెండుపక్షములవారి వాదములు గూడ సంతృప్తికరముగ లేవని గ్రహింపఁగలము. కాని యీ నాటకములలోఁ గొన్ని భాసునినాటకముల క్లుప్తీకరణములని విశ్వసింపక తప్పదు.

ఈమత వైరుద్ధ్యమునకు సమాధాన మిటీవల కే. రామపిషారొటీ పండితుఁ డీవిధముగా దెల్పుచున్నాఁడు. కేరళదేశనటులు సామాన్యముగ నేనాటకమును బూర్తిగ నభినయించరనియు, వివిధ నాటకములనుండి వివిధాంకముల నేర్చి కూర్చుదురనియు, నప్పుడు ప్రతి యంకమునకును ప్రత్యేకముగ వారొక ప్రస్తావనను గూర్తురనియు, నా ప్రస్తావన లా రంగస్థల పరిస్థితులకుఁ దగినట్లుండి, మిగిలిన నాటకము మాత్రము మూలానుగుణ్యమై, యొకప్పుడది కూడ క్లుప్తీకరింపఁబడుటయో, కొంతమార్పు చేయఁబడుటయో తత్సందర్భానుకూలముగఁ జేయఁబడుటయు జరుగుచుండును. అందుచే నీశైలీసాదృశ్యమును, నాటకపద్ధతులు, పారిభాషికములు, దేశీయుల సంపాదకత్వమునఁ జేరియుండును. కాన వీని కర్తృత్వమేకముగాక యనేకమని యూహింపనగును. రాజశేఖరుఁడు భాసున కాపాదించిన స్వప్నవాసవదత్తనాటకము తిరువాన్కూరు సంస్కృతప్రతి కాఁజాలదు. అది భాసుని గ్రంథము ననుసరించిన కృతిమాత్రముకాఁదగును. ఎందుకన ధ్వన్యాలోకమున నభినవగుప్తుఁ డుదాహరించిన,

"సంచిత పక్ష్మకవాటం నయనద్వారం స్వరూపతడనేన
ఉద్ఘాట్య సాప్రతిష్ఠా హృదయగృహం మే నృపతనూజా !॥

అను శ్లోకము తిరువాన్కూరు ప్రతియందు గానరాదు. కాని భోజుఁడు శృంగార ప్రకాశమం దుదాహరించిన "స్వప్నవాసవదత్తే...... వావివక్షితం" అను భాగము మాత్రము దానిలోఁ గనఁబడుచున్నది. కాన నిది భాసుని గ్రంథమైయుండఁదగును.

శారదాతనయుఁడు భావప్రకాశమున, స్వప్నవాసవదత్తమున సుబంధు చెప్పిన ప్రశాంత నాటక విధమున కుదాహరణ మొసఁగి, పరిశాంతనాటక పంచసంధులను జేర్చుచు, నందు రాజు పద్మావతి యలంకరించుకొనిన తిలకముచే వాసవదత్త బ్రతికియున్నదని గ్రహించి 'వాసవదత్తా' !రమ్మ, ఎక్కడికేగెదవు ? మొదలగు రీతి ప్రలాపించును. ఈవిషయము కథాసరిత్సాగరమునఁ గూడఁ గనఁబడుచున్నది కాని తిరువాన్కూరు ప్రతియం దీభాగము కానరాదు. కాన శారదాతనయుఁ డుదాహరించిన భాగముగల స్వప్నవాసవదత్తనాటకము వేఱొకటియుండవలెను.మరియు లెవి పండితుఁడు ప్రకటించినట్లు నాట్యదర్పణమున గుణచంద్ర రామచంద్రులు, భాసకృత స్వప్నవాసవదత్తమునుండి యుదాహరించిన

"పాదాక్రాంతాని పుష్పాణి సోష్మచేదం శిలాతలం
నూనం కాచిదిహాసీనాం దృష్ట్వాచ సహసా నతా (గతా).॥"

ఇదికూడఁ దిరువాన్కూరు ప్రతిలో లేకుండుటచే నిది భాసకృత మూలనాటకమునకు బ్రక్షిప్తభాగమై యుండనగును. మఱియు సాగరనంది నాటక లక్షణ రత్నకోశమున స్వప్నవాసవదత్తమందలి స్థాపననుండి "యథా స్వప్నవాసవదత్తే నేపథ్యే సూత్రధారః(ఉత్సారణం శ్రుత్వా పఠతి) అహో! కథం తపోవనేఽప్యుత్సారణా (విలోక్య) కథం మంత్రీ యౌగంధరాయణో వత్సరాజస్య రాజ్యప్రత్యానయనం కర్తుకామః పద్మావతీ యజనేనోత్సార్యతే" యని యుదాహరించిన భాగము తిరువాన్కూరు సంస్కృత ప్రతిలో లేక వేఱుగా నాభావమే తెల్పఁబడినది. పై కారణములఁబట్టి తిరువాన్కూరు సంస్కృతప్రతి భాసుని మూలనాటకమునకు

కు ప్లీకరణమని భావింపఁదగును. మఱియు ద్వితీయ తృతీయాంకములు మిగిలిన యంకములకంటెను జాల చిన్నవై విష్కంభములవలె నుండుట పైవాదమును బోషించుచున్నది.

భాసునికాలము:_ కాళిదాసు మాళవికాగ్నిమిత్ర నాటక ప్రస్తావన యందు 'ప్రథిత యశసాం భాస సౌమిల్లిక కవిపుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య' యనినుడువుటచే భాసుఁడు కాళిదాసునకుఁ బ్రాచీనుఁడనుట స్పష్టము. కాని కాళిదాసుని కాలముగూడ సంధిగ్ధముగనే యున్నది. భాసుని గ్రంథములం దపాణినీయ ప్రయోగము లున్నంతమాత్రమునఁ బాణినికిఁబూర్వుఁడు భాసుఁడనుట తగదు. పాణినీయము పాణిని కనేక శతాబ్దముల తర్వాతఁగాని ప్రామాణ్యము వహింపలేదు. ప్రతిజ్ఞానాటక, అర్థశాస్త్ర గ్రంథములందుఁ గానవగు శ్లోక మేకమాత్రుని యగు మఱియొక గ్రంథమునుండి యీగ్రంథద్వయము గ్రహింపఁబడియుండవచ్చును. ప్రతిమానాటకమున రావణుఁడుచ్చరించు 'వాసవీయం ధర్మశాస్త్ర' మను వాక్యమునుబట్టి కవి క్రీ. పూ 200 వాఁడగు మనువు తర్వాతి వాఁడని తలంపవలసి వచ్చుచున్నది. భాసుని ప్రాకృతభాష యశ్వఘోషుని సమీపపు భాషగాఁ గనఁబడుచున్నది. కాన భాసకవి క్రీ. పూ. 100 ప్రాంతమువాఁడై యుండ వచ్చును. అంతేగాని కీత్తుపండితుఁడు తలఁచినట్లు క్రీ. శ. 200 ప్రాంతము వాఁడుగాని, గణపతిశాస్త్రిగా రూహించినట్లు క్రీ పూ. 500 ప్రాంతము వాఁడుగానికాఁజాలఁడు భరతవాక్యమునసూచించినరాజసింహుఁడుపశ్చిమ క్షాత్రపుఁడగు రుద్రసింహుఁడు గాఁ దగునుగాని, క్రీ. శ 700 న దక్షిణదేశమును బాలించినరాజసింహాన్యపాలుఁడు గాఁజాలఁడు. అతఁడు త్రరహిందూస్థానమందలి రాజు కాఁదగును. ఇతఁడు సూచించిన మగధ, రాజగృహము, వేణువనము మొదలైన వానిని బట్టి, యితఁడుజ్జయినివాసి యనుటకంటె, మగధ దేశీయుఁడనుట మేలు. ఇతని నాటకముఁబట్టి యితఁడు శివ విష్ణు తారతమ్య మరయని స్మార్తుఁడనియు, బ్రాహ్మణారాధకుడై, బౌద్ధ జైనమతములందు నిరాదరణ గలవాఁడనియుఁ దెలియుచున్నది.

భాసుని నాటకముల నన్నింటిని చిలకమర్తి లక్ష్మీనరసింహం గారాంధ్రీకరించిరి. కొన్నింటిని మాత్రము మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, తెలుఁగుచేసిరి. స్వప్నవాసవదత్త నాట

కమును, కాటూరి వేంకటేశ్వరరావుగారును, దివాకర్ల తిరుపతిశాస్త్రి గారి కుమారుఁడగు వెంకటావధానిగారు కూడ తెలుఁగు చేసినారు. ప్రస్తుతము వి. ఎ. నరసింహంగారి గ్రంథమునుండి నేనుదాహరింతును.

పూర్వకథ:—వత్సదేశాధీశ్వరుఁడగు నుదయనుఁడు కౌశాంబి ముఖ్యపట్టణముగాఁ బాలించుచుండెను. సౌందర్యశాలియగు నతఁడు దన గానవిద్యచే గజముల నాకర్షించి వేటాడువాఁడు. ఆకాలమున నవంతి దేశమును బ్రద్యోతనుఁడను వాఁ డుజ్జయిని రాజధానిగా నేలుచుండెను. మహాసేనుఁడను నామాంతరముగల యారాజునకు మహాసౌందర్యవతి యగు వాసవదత్తయను తనయ గలదు. ఈమెను వత్సరాజునకు వివాహము సేయు దలంపులో మాయా గజము మూలమున మోసముచేసి, యుదయనుని దనకోటలో బంధించి,వాసవదత్తకు సంగీతము చెప్పుటకై నియోగించెను. ఉదయనుని మంత్రులగు యౌగంధరాయణాదులు మారువేషమున నుజ్జయినిలోఁ బ్రవేశించి వత్సరాజును రక్షించుచుండిరి. క్రమమున నుదయనవాసవదత్తలకుఁ బరస్పరానురాగ మభివృద్ధి చెందెను. కాని, మహాసేనుని యభిప్రాయము వారెరుగనందున వారిద్దరు రహస్యముగ నుజ్జయినినుండి పారిపోయి కౌశాంబి నగరమున వివాహము చేసికొనిరి. కొంతకాలము తర్వాత వత్సరాజు భోగలాలసుఁడగుటచేఁ దనరాజ్యమును గోల్పోయి లావాణక గ్రామమున వసించుచుండ, మగధరాజ సోదరి యగు పద్మావతిని వివాహమాడినచో వత్సరాజునకుఁ బునః రాజ్యప్రాప్తి గల్గునను సిద్ధుల యాదేశమును రాజభక్తిపరాయణుఁడగు యౌగంధరాయణుఁడు విని తనరాజున కామెను వివాహము సేయఁ బూనుకొనెను కాని వాసవదత్త బ్రతికియుండగా రాజు మరియొక కాంతను వివాహమాడఁడు. కాన నొకనాఁడుదయనుఁడు వేట కరిగినపుడు లావాణకమునకు నిప్పుపెట్టి వాసవదత్త యందులో మరణించెనని యౌగంధరాయణుఁడు వాదు పుట్టించి, వాసవదత్తను బద్మావతియొద్ద న్యాసముగాఁ బెట్టి, పద్మావతీ వత్సరాజుల వివాహ ప్రయత్న మొనర్చినాఁడు.

కథాపరివర్తనము:—వత్సరాజు కౌశాంబీ నగరమును గూడఁ గోల్పోవుటచేఁ దత్సంపాదనార్థము సిద్ధుల వాక్యానుసారముగ యౌగంధరాయణుఁడు మగధరాజ తనయయైన పద్మావతిని రాజునకు వివాహము

చేసి తత్పర్యవసానముగఁ బూర్వరాజ్యమును సంపాదించుట యనునది నాటకమందలి ముఖ్యకథ. మూలమందీకథ యనేకానౌచిత్యములతోఁ గూడి పచ్చిపచ్చిగా నున్నది. భాసుఁడు స్వప్నవాసవదత్త కథావస్తువును గుణాఢ్యుఁడు పైశాచీ ప్రాకృతమున రచియించిన బృహత్కథనుండి గ్రహించెను. దీనిని సోమదేవుఁడు కథాసరిత్సాగరమను పేర సంస్కృతమున వ్రాసెను. ఈకథనే వస్తువుగా గ్రహించి కొన్నిమార్పులు చేసి మాతృరాజను కవి 'తాపసవత్సరాజము'ను నాటకమును రచియించెను. ఈకథాచ్ఛాయను వత్సరాజవాసవదత్త నామములను గ్రహించి మఱికొన్ని మార్పులతో శ్రీహర్షకవి 'ప్రియదర్శికా, రత్నావళి' లను రెండు నాటకముల వ్రాసెను

(1) కథాసరిత్సాగరమున వత్సరాజు కులక్రమాగతమైన విశాల రాజ్యమంతయుఁ గోల్పోయి, యేమూలనో కౌశాంబిని మాత్రము గల్గి యుండెననియును, బూర్వ విశాలరాజ్య పునస్సంపాదనార్థము మంత్రి యౌగంధరాయణుఁడు వాసవదత్తను దాఁచి, లావాణకమున దగ్ధమైనదని వాదుపుట్టించి పద్మావతీ వివాహ ప్రయత్నము చేసినట్లుండఁగా, భాసుఁడు, వత్సరాజు కౌశాంబినిగూడఁ గోల్పోయినట్లు తత్సంపాదనార్థము సిద్ధుల వాక్యానుగుణముగ బద్మావతీ వత్సరాజులవివాహమును యౌగంధరాయణుఁడు గావించినట్లు రచియించెను. ఈతంత్రమందు వాసవదత్త దగ్ధమైనట్లు వాదుపుట్టించి, యామెకు బద్మావతిని సపత్నిగాఁ జేయుటయేకాక, యామె పద్మావతికి సేవకురాలుగాఁ గూడ నుండవలసి వచ్చును గాన, నందుకు వాసవదత్త నంగీకరింపఁ జేయుటకై తగిన యుత్కృష్ట కారణముండినఁగాని యామె యంగీకరింపదు. సపత్నీత్వ మెంతమాత్రము సహింపని స్త్రీ ప్రకృతి దానికంగీకరింపఁజేయుట కెంతయో మహోపద్రవకారణ ముండినఁగాని సాగదు. కేవలము రాజ్యవిస్తీర్ణమే కారణమైనచో నున్నదానితో సంతృప్తి పొందరాదా, యీమాత్రమున కంతఃపుర స్త్రీలైన రాణులుగూడ శ్రమచెందనేల యని వాసవదత్త యాతంత్రమునఁ బాల్గొనుట కంగీకరింపక పోవచ్చును. అందుచేఁ గార్యసాధనము కాకపోవచ్చును. కాన నంతకంటె నుపద్రవకర కారణమగు కౌశాంబీనగర నష్టమే సంభవించినచో నుదారులగు స్త్రీ లంతఃపురవాసులైన నంగీకరింతురు. కాన

భాసుఁడు కేవలము రాజ్యవిస్తీర్ణమే కాక నష్టకౌశాంబీరాజ్యసంపాదనకే తంత్రమును యౌగంధరాయణుఁడు పన్నినట్లు కల్పించెను. ఇది యౌచిత్యపోషణమునకై భాసుఁడుచేసిన మార్పు.

(2) మూలమందు లావాణకమున వాసవదత్తతోఁబాటు వసంతకుఁడుగూడ దగ్ధమైనట్లు, నాతఁడామెసోదరుఁడను మిషచే నామెతోఁగూడ పద్మావతిదగ్గర యౌగంధరాయణుఁడు దాఁచినట్లు గల్పింపఁబడినది. కాని పరపురుషునికంటఁబడకుండ రక్షించుటకును, నజ్ఞాతవాసకాలమున నామె శీలమునకు సాక్షీభూతముగా నుండుటకును, వాసవదత్తను బద్మావతియొద్ద నుంచుకాలమునఁ బురుషుఁడైన వసంతకునిఁ గూడ నామెయొద్ద నుంచుట యుచితముగ నుండదు. విశేషించి పరపురుషుని జేర్చికొనుటకుఁ బద్మావతి యంగీకరించిన దనుటయును సమంజసముగాదు. మఱియు విదూషకుఁడైన వసంతకుఁడు స్త్రీపార్శ్వవర్తియగుటకంటె, రాజుపార్శ్వముననుండి యాతని నోదార్చుచు, హాస్యముసేయుచు రాజున కుల్లాసము గూర్చుచుండుటయే యుచితము. కాన నౌచిత్యపోషణార్థము వసంతకుఁడు దగ్ధము గానట్లుమార్చి, యాతనిని రాజుదగ్గరనుంచి, యౌగంధరాయణుఁడు వాసవదత్తతోఁగూడ మరణించెనని కవి మార్చెను. లావాణకాగ్నిలో నొక్క వాసవదత్తమాత్రమే దగ్ధమైనదనుట విశ్వసనీయము గాకుండుటయు, మఱియు సమర్థుఁడగు యౌగంధరాయణుఁడు వాసవదత్త దగ్ధమగుచుండఁ జూచుచు నూరకుండ లేదనియు, నాతనిప్రయత్నము వ్యర్థమై తానుగూడ నగ్నిలో భస్మమయ్యెనని కవి కల్పించెను.

(3) మూలమున యౌగంధరాయణుఁడు బ్రాహ్మణరూపమునఁ బద్మావతీ యుద్యానవనమునకుఁ బోయి, తనకు మాఱైన యామెను తన న్యాసముగానుంచుకొనుమని ప్రార్థించి, వాసవదత్త నామెయొద్ద నుండుటకై యొప్పించును. కాని భటరక్షితమై యంతఃపురస్త్రీలకుమాత్రము నియమింపఁబడిన యుద్యానవనమును యౌగంధరాయణుఁడు బ్రాహ్మణరూపమున బలవంతముగాఁ బ్రవేశించుటయుఁ, బద్మావతి వాసవదత్తను న్యాసముగానుంచుకొనుట కంగీకరించిన దనుటయు సందేహాస్పదములుగాఁ గనుపించును. స్త్రీలున్న యుద్యానవనమును బ్రవేశింపఁబోవు బ్రాహ్మణరూప యౌగంధరాయణు నడ్డగించి కావలివాండ్రు చెప్పి

సాలయం దుంతురు. అందుచే రహస్యభంగముగూడ వాటిల్లును. మఱియు ధనాదులనైన దానము సేయవచ్చును గాని కన్యాన్యాసమును గ్రహించుట దుఃఖహేతువని యెవరును గ్రహింపరు. కనుక నిదియు ననౌచిత్యముగాఁ గనుపించును. అందుచే భాసుఁడు నాటకమునఁ బద్మావతి తాపసి దర్శనార్థము తపోవనమునకుఁ బోవుటయు. తాపసు లెవరైన నరణ్యమున నిశ్శంకముగాఁ బ్రవేశార్హులు గాన నక్కడకు యౌగంధరాయణుఁడు తపస్వివేషమునఁ జేరుటయుఁ, బద్మావతి వరదానగ్రహీతల నన్వేషించుటయు, నంత యౌగంధరాయణుఁడు వాసవదత్తాన్యాసమును వరదానమును వేడుటయు, పద్మావతి దాని నిచ్చుట కష్టమని కంచుకిచే నుపదేశింపఁబడియు, సత్యవాక్యపరిపాలనార్థము దానిని గ్రహించుటయు నను మార్పులఁ జేసి యౌచిత్యమును బోషించినాఁడు. భాసుఁడు వాసవదత్తను యౌగంధరాయణుని సోదరిగా మార్చుట వయస్సున కనుగుణముగా నుండుటకై చేసియుండవచ్చును. లేదా యాకాలపుమూలగ్రంథమున నట్లేయుండిన నుండవచ్చును. ఎట్లయిన నిందంత గొప్పభేదము లేదు.

4 మూలమున నారదుఁడు వత్సరాజునకు వాసవదత్తతోఁ గొంతకాలము వియోగము గల్గునని యుఁ, బునస్సమాగమమైన పిమ్మట నామెయం దొక పుత్త్రుఁడు గల్గునని యు జెప్పెను. మఱియు మూలకథయందు వాసవదత్త దగ్ధమగుటకు యౌగంధరాయణ రుమణ్వంతాదులు విశేషదుఃఖ మనుభవింపకుండుటచే రాజామె మరణము ననుమానించును. నాటకమునఁగూడ నిట్లేయున్నచోఁ గథాసంధానమున బిగువు సడలుటయే కాక కథయం దభిరుచియుఁ దగ్గును. అందుచే నారదవాక్యములఁ బూర్తిగఁ బరిహరించి, భాసుఁడు, రుమణ్వంతుఁడు రాజుతోఁ బాటు విశేషదుఃఖము నొందెనని మార్చెను. రాజు పంచమాంకమున వాసవదత్తనుగూర్చి స్వప్నమందుఁగూడ విలపించునుగానఁ బూర్వాపరములకు సామరస్యము గూర్చుటకై కూడ నీమార్పు ముఖ్యమే. కాన నిది కూడ నౌచిత్యపోషణార్థము చేయఁబడిన మార్పే.

5 మూలమున, వివాహమైనవెంటనే పద్మావతీ వాసవదత్తలతోఁగూడ రాజు లావాణకమునకుఁ బోయినట్లున్నది. నాటకమున వివాహానంతరము గొంతకాలము పద్మావతీగృహమున రాజున్నట్లును,

నందే స్వప్నమున వాసవదత్తను గాంచు వృత్తాంతమును గల్పింపఁ బడినది. చతుర్థాంక కథావృత్తాంతమంతయు భాసకవి కల్పితమే. దీని మూలమున పద్మావతీ వాసవదత్తా వత్సరాజుల శీలములు స్పష్టపడును. ఇది పాత్రపోషణార్థము కవిచే కల్పింపఁబడినది. పంచమాంక కథా విషయముగూడఁ బూర్తిగ కవికల్పితమే. స్వప్నమందుఁ గూడ రాజు వాసవదత్తను కలవరించి ప్రేమను జూపుట, యామెకై విలపించుట, కరుణగొల్పును. పరుండిన రాజును పద్మావతినిగా దలఁచి యాపాన్పుపై వాసవదత్త శయనించుట, రాజామె నెఱుఁగకయే ఆమెకై కలవ రించుట, యతని నామె స్పృశించుట మొదలైన సన్నివేశములన్నియు బహురసవంతము లైనవి. ఇదంతయు రసపోషణమునకై కవి కల్పించినదే.

6 మూలమునఁ బద్మావతితోఁ గూడ రాజు లావాణకమునకుఁ జేరఁగానే వాసవదత్త తన సోదరుఁడైన గోపాలుని మందిరమునకు వెళ్ళి నట్లును, పద్మావతి యలంకరించుకొనిన దివ్యమాలా తిలకముల వలన వాసవదత్త సజీవయని రాజు అనుమానించి, యాతంత్రములో బాల్గొనిన గోపాలునింటికిఁ బోయి యందు వాసవదత్తా వసంతక యౌగంధరాయ ణులఁ గాంచినట్లును, తర్వాత పద్మావతి యక్కడకువచ్చి సర్వము నెఱిఁగి నట్లున్నది. నాటకమున నిర్వహణమును బద్మావతియింటియొద్దనే నిర్వ హింపఁ దలఁచి భాసుఁడు, మహాసేనునిఁ గంచుకి పద్మావతి యింటనున్న వత్సరాజు దగ్గరకు వాసవదత్తా వత్సరాజుల చిత్రఫలకములఁ గొనివచ్చు నట్లును,బద్మావతీ సమ్ముఖముననే యాచిత్రములు గ్రహింపబడినపు డామె యాచిత్రమందలి వాసవదత్తతో దనయొద్దనున్న యావంతిక సదృశముగా నుండుట గన్గొని రాజునకుఁ దెల్పి, యాతని యానతి చొప్పున నామె దోడ్కొనిరాబడి, వాసవదత్తగా రాజుచే గ్రహింపఁ బడుటయు, నీసమ యముననే న్యాసముగా నుంచిన తన సోదరిని దిరిగి గ్రహించుటకై యౌగంధరాయణుఁడు గూడ వచ్చుటయు మొదలగు నాశ్చర్యకర విష యములతో నకస్మాత్తుగా నన్నియు బయలుపడునట్లుగాఁ గవిమార్చెను. ఈమార్పు కవి స్థలైక్యమును (Unity of place) బాటించుటకై కూడఁ జేసి యుండవచ్చును.

7 మూలమున వాసవదత్తా దహన తంత్రమునందుఁ బాల్గొనిన గోపాలుఁడు తన సోదరియగు వాసవదత్త యథార్థస్థితిని మహాసేనునకుఁ బూర్వమే తెలుపును. నాటకమున వాసవదత్తా వాస్తవస్థితి మహాసేనునకుఁ దెలియదు. ఆమె మరణించెననియే యాతఁడు తలఁచును. ఆమె యథార్థవార్తను వత్సరాజు చివరకు మహాసేనుని కంచుకిద్వార నాతనికిఁ దెలుపును. వాసవదత్త బ్రతికియున్నదని తెలియుచో మహాసేనుఁడు వారి ప్రతిమల నవసరముగా వత్సరాజునకుఁ బంప నవసరముండదు. అందుచే వాసవదత్తను గుర్తించుట యంత చమత్కారముగ జరిగియుండదు. మూలమున దివ్యమాల వలన వాసవదత్త బ్రతికియున్నదని గ్రహించి రాజు గోపాలుని మందిరమునకుఁ బోవుటకుఁ గలకారణము తెలియదు. అదియుఁ గాక వాసవదత్త సజీవయని నిర్ధారణ చేయుటకు దివ్యమాల యొక్క బలమైన కారణముగాదు. మఱియు నీచిత్రపటములఁ బంపుటవలన మహాసేనుని యౌదార్యాతిశయములు బయలుపడుచున్నవి. నాటకమున వాసవదత్త యాథార్థ్యవిషయ మంతయును బద్మావతీ సమ్ముఖమున జరుగుట వలనఁ బ్రత్యేకముగ నామె కావృత్తాంతమును రాజు మరల జెప్ప నవసరము లేకపోవుటయే గాక, యళీక వాసవదత్తా మరణవార్తను సృష్టించి పద్మావతి నామె సోదరుని మోసగించి పునర్వివాహము గూర్పఁబడినదని రాజు నిందింపఁబడకుండుటయు, నంతయు యౌగంధరాయణుని తంత్రమే గాని రాజు నిష్కపటుఁడని తెలుపఁబడి యాతని పాత్ర పోషించుటకును, బద్మావతి సమక్షముననే రాజు మహాసేనుని కంచుకివలన వార్తలను వినుట కిచ్చగించునట్లుగా భాసకవి మార్చెను. మూలమున వాసవదత్తా పాతివ్రత్యము నిరూపించుటకు యౌగంధరాయణుఁ డనేక ప్రమాణములఁ జేయును. నాటకమం దవి యన్నియు నసభ్యములగుటచే ననవసరములు.

8 మూలమున మహాసేనుని ప్రేరణమున వాసవదత్తా సోదరుఁడగు గోపాలుఁడు వాసవదత్తా వత్సరాజుల వివాహమును సక్రమముగా వత్సరాజు నింట జరిపినట్లున్నది. నాటకమునఁ గవి రాజునకు వాసవదత్త చిత్రపటముమూలమున నామె సజీవ యని పద్మావతివలనఁ దెలుపఁజేయు వాఁడై, వారి చిత్రపటములఁ బ్రవేశపెట్టుటకుఁ గాను, వాసవదత్తా వత్స రాజుల వివాహమును వారి పటములతో మహాసేనుఁడే తనయింట

నొనర్చెననియు, నాచిత్రములనే వాసవదత్తను గోల్పోయిన రాజునకుఁ బారితోషికముగఁ బంపినట్లు మార్చినాఁడు. మూలమున మగధ రాజు బహు బలవంతుఁడనియు నతనికుమార్తె యగు పద్మావతిని వివాహమాడుటచే వత్సరాజునకు మహారాజ్య ప్రాప్తి గలుగుటయేకాక బలవంతుఁడైన మగధరాజు సాయమున దిగ్విజయము చేసి రాజ్యమును విస్తరింపఁ జేసినట్లును గలదు. కాని నాటకమున నష్టరాజ్యమును దిఁగి పొందుట మగధరాజు మూలమునఁ గాక వాసవదత్త తండ్రియగు మహాసేనుని సహాయమున జరిగినట్లు మార్చఁబడెను. ఇందువలన మహాసేనునకు వత్సరాజు చేసిన యుపకారమునకుఁ బ్రతిగా మహోపకారము చేసిన యతని యౌదార్యమును దెలుపును. మూలమున వాసవదత్తావీణయగు ఘోషవతి రాజునకు దొరికిన వృత్తాంతము లేదు. నాటకకర్త దీనిని గల్పించి తన్మూలమున వాసవదత్తను స్మరింపఁజేసి యామెకై రాజు దుఃఖించునట్లు చేయును. ఇది కరుణ రసోదయమునకుఁగారణ మగుచున్నది కాన రసపోషణమునకై కల్పింపఁబడినది. మఱియును చివరకు రాజునకు వాసవదత్తతోఁ బునస్సమాగమము కల్గునుగాన నామె సజీవ యను భావము రాజునకాకస్మికముగాఁ గాక, క్రమక్రమముగాఁ గలుగఁజేయుటకును, కథానిర్వహణమునుగూడ నల్లి కూర్చుటకును మొదట వాసవదత్త వీణయగు ఘోషవతి దొరికినట్లు కవి కల్పించినాఁడు ఇది దొరుకుటవలనఁ ద్వరలో దాని స్వామినియగు వాసవదత్తగూడ దొరకఁగల దను భావము ద్యోతకమగును. దీనివలన నౌచిత్యముగూడఁ బోషింపఁబడుచున్నది. మూలమున మగధరాజు ప్రద్యోతనుఁడనియుఁ బద్మావతి యతని కుమార్తె యనియుఁ గలదు. నాటకమున మగధరాజు దర్శకుఁడనియుఁ బద్మావతి యతని సోదరియనియు, మఱియుఁ బ్రద్యోతనుఁడు వాసవదత్త తండ్రియనియు నతఁడు మహాసేనుఁడను నామాంతరముగల యవంతిరాజనియుఁ గలదు. ఈమార్పంత ముఖ్యమైనది కాదు.

9 మూలమున వాసవదత్త పద్మావతికై దివ్యమాల గ్రుచ్చి యిచ్చును. దానిమూలముననే వాసవదత్త బ్రతికియున్నదని రాజు

గ్రహించును. నాటకమున సపత్నీసర్దవ మను నోషధితోఁ గాతుక మాలికను వాసవదత్త పద్మావతికి గ్రుచ్చియిచ్చును. కాని దీని మూల మున వాసవదత్త పాత్రము గుర్తింపఁబడదు. దీనివలన నాటకమున విశేష ప్రయోజనమేమియును లేదు.

—: పాత్రపోషణము :—

పద్మావతి:—ఒక పాత్ర. రంగస్థలము మీదికి రాకపూర్వమే యా పాత్ర ప్రవేశమును సూచించుట సంస్కృత నాటక సంప్రదాయము. ఇంతేకాక ముందు రాఁబోవు పాత్ర శీలముతో సామాజికులకుఁ బరి చయము గూర్చుట యొక కళానైపుణ్యము. షేక్స్పియరు నాటకము లందుఁగూడ నీరీతిఁ గనబడుచున్నది. ఈ నాటకమునఁ గథానాయికయైన పద్మావతిదర్శక మహారాజు సోదరి. ఈమె సుగుణములను కవిముందే తెల్పువాఁడై యామె రంగస్థలమునకు రాకపూర్వమే కంచుకిచేత

'మ. ప్రమదారత్నము, మాన్యపాలసుత, ధర్మప్రీత. యెన్నండు సం
యములం జోర్వదు ధర్మశీల, యిది వంశాచార మా యింతికిన్.'

అని పలికించును. ఆమె పేరు వినగానే యౌగంధరాయణుని కామెపై గౌరవ భావమును, వాసవదత్త కామెయందు సోదరీస్నేహమును బొడమినట్లు తెల్పుదురు. పద్మావతినిఁ జూడఁగనే వాసవదత్త యామె యాభిజాత్యము నకుఁదగినసౌందర్యమును గనుగొనినది. తర్వాతనామెరూపముతోఁబాటు మాటలును మృదుమధురముగా నుండినట్లు గ్రహించినది. ముందు ముందామె ప్రవర్తన మామెరూపభాషణముల కనురూపముగ నుండు నట్లు స్పష్టపడును. పాత్రపోషణ మనఁగఁ గేవలము బాహ్యాకార వర్ణ నము కాక, వారి మనోవాక్కాయముల యానుగుణ్యమును దెల్పుటే.

పద్మావతి యాచకుల నాహ్వానించుటచేఁ గరుణార్ద్రహృదయ యైన దాత యనియు, యౌగంధరాయణుని సోదరీన్యాసము నంగీకరిం చుట కష్టమని కంచుకిచే బోధింపఁబడియు సత్యపాలన కొఱకై యందుల కంగీకరించుట వలన సత్యసంధురాలనియు, విశదము. ఇట్టి యౌదార్య

వంతురా లగుటచేతనే వాసవదత్తాన్యాసము సగౌరవముగను నిర్విఘ్నముగ నెఱవేరినది. 'పద్మావతి సుగుణముల గ్రహించియే' యౌగంధరాయణుఁడు వెంటనే యామెను 'పూజ్యురా'లని నుడివెను. దానికను గుణముగఁ బద్మావతియు వాసవదత్తను స్వీకరించుచు 'నా దానవైతి' వని తెల్పి, స్వతుల్యురాలుగను, స్వజనముగను భావించెను. ఇట్టి యుదారచేతిలో వాసవదత్తను బెట్టుటచేతనే యౌగంధరాయణుఁడు నిశ్చింతతో నుండెను.

వాసవదత్తా దగ్ధవార్త విని రాజు మూర్ఛితుఁడయ్యెనని బ్రహ్మచారివలన నెఱిఁగి పద్మావతి హృదయము జాలివలనఁ గలఁతఁ జెందినది. ఈమె కన్యగాన ముగ్ధ. ఆటపాటలందు కాలము గడుపుటయుఁ బ్రియకథాశ్రవణ కౌతూహలముగలది. ప్రథమాంకమున బ్రహ్మచారి వాసవదత్తా మరణమునకై వత్సరాజు పొందిన దుఃఖమును వర్ణింపకపూర్వము, పద్మావతి ప్రద్యోతనుని కుమారునికై యడుగఁబడినట్లు చేటి తెల్పినది. కాని వత్సరాజు దగ్ధవాసవదత్తపై జూపిన దయాళుత్వము నామెవిని యాతనియందు బద్ధానురాగ యయ్యెను. వాసవదత్తవలన నామె రాజు సౌందర్యమునుగూడ విని యాతనిని త్రికరణశుద్ధిగ మోహించినది. కనుకనే ప్రథమాంకాంతమున రాజు తిరిగి యెవనిని వివాహమాడునో యని చేటికిఁదోఁచిన భావమే యామెకుఁ గల్గి, యామె కాతనియందలి యభిమానమున్నట్లు తెల్పును. ద్వితీయాంకమునఁ బ్రద్యోతనుని కుమారుని వివాహమాడుటకుఁ బద్మావతి కిష్టములేదనియు, వత్సరాజు సుగుణములచే నాకర్షింపఁబడి దయాళువగు నాతనినే యామె వివాహమాడ నిచ్ఛగించెనని స్పష్టముగాఁజేటి తెల్పును. కాన నీమె గుణగ్రహణపారీణయనియు, వరగ్రహణమందు బాహ్యాకారమువలన మోసముపోక, యతని గుణములను బరీక్షించి, సంతృప్తిజెందిన పిమ్మటనే తనహృదయ మర్పించుకొను వివేకియనియు స్పష్టము. ఈమె భర్తయందు గౌరవానురాగములు గలిగి యతనిని సంతోషపఱచుటకై ప్రయత్నించును. ప్రియునెడఁబాసి క్షణమైన నుండఁజాలదట. రాజు తనమీఁదకంటె వాసవదత్తమీఁద నధికానురాగముగలవాఁడని యావంతికవలన నెఱిఁగియు, సామాన్యముగా స్త్రీలకుఁ గలుగు నసూయ యామెకుఁగలుగదు.

ఈ మెయందలి విశేష గుణమిది. తనతోనున్న వాసవదత్త పరపురుషుని దృష్టికి బడునని యోచి యామెకొఱకై పద్మావతి రాజదర్శనమును గూడ మానుకొనుట స్వార్థత్యాగి యని తెల్పుటయేకాక, వాసవదత్త యం దామెకుఁగల గౌరవముగూడ విశదపఱచును. ఇతరులైనచో మిగి లినవారిని బంపివేసి తానుమాత్రమే రాజును గలిసికొనుదురు. మఱియు నీమె సహజముగాఁ గరుణార్ద్ర హృదయ యగుటచేతనే వాసవదత్త యన్య కారణమున దుఃఖించునపు డెల్ల నామె జాలిచెందుచుండును.

పద్మావతి 'లలిత రూప విలాసములచే మధురమైన' దని రాజు దలఁచినాఁడు. తనమీఁదకంటె దగ్ధమైన వాసవదత్తపై నధికప్రేమను రాజుచూపుట యతని దయార్ద్రహృదయత్వమని యామె వ్యాఖ్యానము సేయుటవలన నామె గుణాతిశయము వెల్లడియగుచున్నది. అందుచేతనే వాసవదత్త యామెనుగూర్చి 'నీఁతుకు-లప్రసూతికుఁ దగినట్లు పల్లి తి'వని యోగ్యతాపత్ర మొసఁగుచున్నది. ఆమె గుణములచే సపత్నినిగూడ నాకర్షించినది కాన నీ వాక్యము పరమప్రమాణమైనది. హాస్యవిషయమై నను నామెశీలమున కనుగుణముగాఁ బ్రవర్తించి వసంతకు నాదరణ ముతోఁ బిలిచి వానికిఁ బంచభక్ష్యపరమాన్నమును బెట్టుచుండెడిదట. వసంతకుఁ డామెశీలమునుగూర్చి యథార్థమును క్లుప్తముగా నిట్లు పలు కును. 'పద్మావతీదేవి యువతీరత్నము. చక్కనిచుక్క. కోపమన్నమాట లేదుకదా! అహంకారమేమో యెఱుగనే యెఱుగదు. మాట తేనెతేట కదా! పైగా దయారాశి'. రాజు వాసవదత్తమీఁదఁ బక్షపాతమును జూపినందుకై పద్మావతి యెంతమాత్రము కలుషహృదయ కాదు. ఓర్పెంతేనియును గలదు భర్తమనస్సును గలఁచిన విమాషకు నెంతేనియు దూషించును. పరమపతివ్రత. నాటకోత్తరభాగమునఁగల యీామె సుగుణములన్నియును బూర్వభాగముననే సూచింపఁబడినవి. ఇదే నాటక కర్త నైపుణ్యము. వాసవదత్తాజనమైన మహాసేనునియొద్దనుండి వచ్చిన కంచుకిని పద్మావతి స్వజనముగా భావించుట యామె శీలమున కెంత యు మెఱుఁగుపెట్టి యామె సుహృదయమును వెల్లడించుచున్నది. తాను భర్తసమక్షమున నుండుటవలన వాసవదత్తాజనము స్వతంత్రముగ సంభా షింపలేమో యని తానే యనుమానించి భీతిల్లు పరేంగితజ్ఞానము గలది.

కాని తనయైశ్వర్యమునకు గర్వపడదు. భర్తకు బహువినయ వర్తిని. చిత్రరువునందలి వాసవదత్తా వత్సరాజులకు నమస్కరించుటచేఁ బెద్దలందామెకుఁగల గౌరవమును, సపత్నీద్వేషరాహిత్యమును స్పష్టపడును. వాసవదత్తా చిత్రపటదర్శనము వలన నామెకుఁగల్గిన భావములఁబట్టి యామె వివేకహృదయ యనియు, సాత్త్వికభావ యనియు గోచరించును. సద్వంశజాతకుం దగిన పలుకులును బ్రవర్తనము నీమెశీలమునఁ గాననగును. ప్రశాంతచిత్తురా లీమె. ఆవంతిక వాసవదత్తయే యని తెలిసికొనిన వెంటనే పద్మావతి యామె పాదములపైఁబడి, తా నామెవలన పనులు సేయించుకొనినందుకు క్షమింపఁ బ్రార్థించుటవలన నామె నిగర్వశిరోమణియనియు, వినయవతి యనియుఁ జాటును. ఈమె సకలసౌమ్యగుణములతోఁ గూడిన మనోహరమైన రూపసి. ఆమెహృదయ మెప్పుడు నసూయా ద్వేషములచేఁ గలుషితముకాదు. ఆమెమనసున నరిషడ్వర్గము ప్రవేశింపదు. ప్రసన్నచిత్తురాలు. నిర్మలప్రవర్తనము, గంభీరభావమును, మధురవాక్కును, బరోపకారశీలము గలది. ఈవిధముగ నాటకమునఁ బద్మావతి సకలసుగుణములుగలిగి, దోషరహితయై వాసవదత్తకంటె నుత్కృష్టశీలము గలదిగాఁ గనఁబడుచున్నది. కాని రాజీమెయందుఁగంటె వాసవదత్తయందధికానురక్తుఁడుగాఁ జిత్రింపఁబడినాఁడు. స్త్రీజనము స్వభావసిద్ధముగా నసూయచెందఁదగిన పరిస్థితులందు వాసవదత్తయీర్ష్యాపూరితురాలైనను బద్మావతిమాత్ర మట్లసూయ చెందదు.

వాసవదత్త:— ఈమె యావంతిక యను మాఱురూపముననున్నను బద్మావతి నమస్కరించిన తాపసి యీమె యాకారసౌందర్యములఁబట్టి, రాజమహిషియై యుండవచ్చుననియు, నామె చేటి యీమె పూర్వము సుఖపడినదై యుండవచ్చుననియు నూహించిరి. ప్రియుని రాజ్యప్రాప్తికై యెట్టికష్టములకైన సహించిన స్వార్థత్యాగియు, సహనప్రియయు నీమె. కాని యవమాన మొంతమాత్రము సహించదు; మార్గాయాసముకంటె నది యెక్కువ దుఃఖకరముగా నీమె యెంచెను. పద్మావతి రాజపుత్రియని తెలియఁగానే యామెయందు వాసవదత్తకు సోదరీభావ ముదయించుటచే నామె సుహృదయము దెలియుచున్నది. సామాన్యులవలె సపత్నీర్ష్యను బూనదు. కాని యీవిషయమై యామె

మనస్సు పద్మావతి మనస్సువలె నిష్కల్మషముగ లేదు. పద్మావతీసౌందర్యాభిజాత్య మధురవాక్కుల కీమె యానందించి, తనసోదరుని భార్య కాఁగలదని విని సంతోషించినది యౌగంధరాయణునియం దీమెకు సంపూర్ణవిశ్వాసముగల్గి యతఁడేమిచెప్పిన దానిని జేసెను. వాసవదత్తను న్యాసముగా నుంచుకొనుమని యౌగంధరాయణుఁడు పద్మావతిని వేఁడుకొనఁగానే యీమె తనలో 'అహో! ఆర్యయౌగంధరాయణుఁడు నన్నిక్కడ దాఁచఁదలఁచుకొన్నాఁడు. అయినను సరిగా విచారింప కీతఁడేపనియుఁ జేయువాఁడు కాఁడుగదా!, యనియు, పద్మావతి తనన్యాసమును గ్రహింపఁగానే యీమె దనలో, 'వేరుగతి లేదు కావున మందభాగ్యరాల నగు నేనిప్పుడే చెప్పెద' నను మాటఁబట్టి యౌగంధరాయణుఁడు దన్ను పద్మావతియొద్ద న్యాసముగా నుంచఁదలఁచిన ప్రయత్న మీమెకుఁ దెలియదేమో యని తలఁపవలసివచ్చుచున్నది.

ఈమెకుఁ దన ప్రియునిపై గాఢానురాగ ముండుటచే నాతఁడు దనకై పొందిన శోకమునకు జాలిచెంది, యతఁడు సురక్షితముగా నుండుటెఱిఁగి సంతోషించెను. కాని పద్మావతివలె నీమెయును బరమపతివ్రత. తన (యళీక) మరణానంతరము రాజు పద్మావతిని వివాహమాడఁగోరుటను గూర్చి యాతనిని కలుషునిగా భావించియును, దర్వాత రాజు నిర్దోషి యని యెఱిఁగినవెంటనే సంతోషించెను. ఆమె రాజునకు మారస్థురాలైనందుకుఁ గ్లేశపడెను. ఈమె నిపుణముగఁ బద్మావతీవత్సరాజుల పరస్పరానురాగమును గ్రహించుచు, వత్సరాజునుగూర్చి తాను జారిన వాక్యములఁ జమత్కారముగ సమర్థించుకొనుచు, వత్సరాజునకుఁ దనయందుఁగల ప్రేమకుఁ, దనకై యతఁడు పడు వేదనకుఁ దన జన్మ ధన్యమైనదిగా నెంచెను. భర్త స్సుఖస్థితిని గాంచి తృప్తిచెందిన గాఢానురాగ. లలితరూపవిలాస శీల యగు పద్మావతినిగూడ మించి రాజును ప్రేమింపఁ జేసిన దీమె గుణము. దన గుణముల గ్రహించిన భర్తవలనఁ దన జీవనము ధన్యమైనదని భావించినది. తనయందుఁ దక్కువ ప్రేమగల్గిన వత్సరాజు సదయహృదయుఁడని తెల్పిన పద్మావతి యౌదార్యమును మెచ్చుకొనిన వివేకి. వత్సరాజు దుఃఖము నోదార్చుటకై పద్మావతిని నియోగించు దయాళువు. పద్మావతికిఁ జమత్కారకథలు చెప్పి తలనొప్పినైనను దొల

గించు నేర్పరి. ఈమె చిత్రవిచిత్రమాలలను గుచ్చు శక్తురాలు. బాధపడుచున్న పద్మావతిపైకంటె నీమెకు రాజుపై నెక్కువప్రేమ. రాజు సంతోషకారణమైన పద్మావతి శిరోవేదన చెందుటచే, రాజు సుఖమున కంతరాయము వచ్చినదని విచారించును గాని, యామె కష్టస్థితినిగూర్చి యెక్కువవిచారింపదు. పద్మావతియందుఁ గృతజ్ఞతయు, స్నేహము గలిగియే సంచరించును. పరిజనులు పద్మావతినొక్కతెను బాన్పుపై వదలిపోయి నందుకు విచారించినది. పరేంగితజ్ఞానముతోఁ బద్మావతిని గాఁగలింపఁ గోరి పరుండును. ప్రియునిచే నిద్రావస్థయందుఁగూడ స్మరింపఁబడు నంతగాఁ బ్రేమింపఁబడినందుకు దన జీవితము ధన్యమైనదని తలఁచి, యాతని దీనస్థితికి దుఃఖించినది. వత్సరాజు వియోగమునకై పడిన తాపమునకు మితిలేదు.

వత్సరాజు:— రాజు నాటకమునఁ జతుర్థాంకారంభమున రంగస్థలముమీఁదికి మొట్టమొదట వచ్చినను నతని వ్యక్తిగత విశేషములు మొదటి మూఁడంకములందుఁ గూడ వ్యాపించియే యున్నవి. ఇది భాసుని పాత్రపోషణ విధానమందలి విశేషము. ప్రథమాంకమున బ్రహ్మచారి వర్ణించిన వాసవదత్తా మరణవార్తకై రాజుపడిన పరితాపమునుబట్టియు, నాతనికి వాసవదత్తపైగల యనురాగాది కారణములం బట్టియు నాతఁడెట్టికరుణార్ద్ర హృదయుఁడో తెలియఁగలదు. అందుచేతనే ప్రథమాంకమునఁ దాపసి, గ్రామమునకు నూతనాగంతుకుఁడైన బ్రహ్మచారియుఁ గూడ నాతని ప్రశంసించుటచే రాజు మిక్కిలి గుణవంతుఁడని తెల్పినది. ఈ విధముగా రాజు పరోక్షముననే యాతని సుగుణములు సామాజికులకుఁ బరిచయము చేయఁబడుచున్నవి. అందుచే నీతని సుగుణములవలన నందఱు వశ్యులగుచున్నారు. ఈవిధముగ గవి ప్రథమాంకమున నాయకుని గుణముల ద్యోతకముచేసి, ద్వితీయాంకమున నాతని బాహ్యాకార సౌందర్యములతో పరిచయమును గూర్చుచున్నాఁడు. పద్మావతి వత్సరాజును ప్రేమించుట కాతని సుగుణములే కారణము. వానిని బ్రహ్మచారివలనఁ బ్రథమాంకమున వినినది కదా! తర్వాత రాజు బహు సౌందర్యశాలి యని వాసవదత్తవలనఁ బద్మావతికిని, మనకుఁగూడఁ దెల్పుచున్నాఁడు కవి. అంతగాఁ బ్రేమించిన వాసవదత్త మరణించిన వెను

వెంటనే రాజు పద్మావతిని దానై ప్రేమించి వివాహమాడునంత కలంకితుఁడు గాఁడు. మగధరాజే యామెను నాలని కర్పించుటచే రాజు నిర్లోపి యగుచున్నాఁడు.

తృతీయాంకమునఁ జేటికియాలవమున రాజు సౌందర్య మనన్యసామాన్యమని వర్ణింపఁబడినది. అతఁడు 'శరచాప విహీనుఁడైన సాక్షాత్తు మన్మథుఁడే'. రాజు మూర్తిన్నమును సరోరవముగఁ బ్రేమించినను, మరణించిన వాసవదత్తయందనే యధికానురాగము గలవాఁడు. ఆమె వీణయు, సంగీత విద్యాభ్యాసము నతని మనస్సు నంటియే యుండును. ఆమెగుణములు స్మరణకువచ్చి దుఃఖించును. ఒకప్పుడామె స్మరణమునఁ గల్గు సాత్వికభావమున నామె మరణించె ననుమాటయే మఱచిపోవును. రాజు వాసవదత్తకొఱకై దుఃఖించుచున్నపుడు పద్మావతిచేఁ గాంచఁబడఁగ, నామె హృదయమును గష్టపెట్ట నెంచనివాఁడై పుష్పరజము నేత్రమునఁ బడుటచేఁ గన్నీరు దొరలెనని యసత్యమునుగూడఁ బలుకును.

వాసవదత్తపై యధికానురాగమును, నామె మరణమునకై యధిక దుఃఖమును బొందినవాఁడైనను బద్మావతికిఁ దలనొప్పి వచ్చినదని తెలిసి, వాసవదత్తవలె నీమెగూడ దక్కదేమో యని యనేకవిధముల దిగులు చెందిన కోమలహృదయుఁడీతఁడు. నిద్రలోఁగూడ వాసవదత్తనే కలవరించునంతటి ప్రేమపూరిత మాతని హృదయము. ఈతఁడు రాజ్యభారమంతయు మంత్రులపైనుంచి భోగాయత్తపరుఁడైన ధీర లలితుఁడైన నాయకుఁడైనను, సమయము వచ్చినపుడు పరాక్రమమునుజూపు పౌరుషశాలి. వాసవదత్త బంధువులను పద్మావతి సమక్షముననే దర్శించి యుభయముల గౌరవములకుఁ బాత్రుఁడగును. పూర్వము దన మామ కనిష్టము గూర్చినను బిమ్మట వానిపై గౌరవాదరములఁజూపి తన పూర్వాచర్యలకుఁ బశ్చాత్తాపముచెందును. బందుగులు దనపైఁజూపిన ప్రేమకుఁ గృతజ్ఞతయు జూపును. చివఱకు యౌగంధరాయణుఁడు చేసిన మేలునకుఁగూడఁ గృతజ్ఞతఁ దెల్పినాఁడు. నాటకమున నితఁడు దక్షిణనాయకుఁడైనను గలుషిత హృదయుఁడైన ట్లెచ్చటను గన్పడఁడు. అతి దయాళువును కోమలమనస్కుఁడుగా గోచరించును.

యౌగంధరాయణుఁడు:— ఇతఁడు గొప్ప తంత్రజ్ఞుఁడు. రాజభక్తి యితని కపారము. స్వార్థత్యాగి. రాజునకు రాజ్యము సంపాదించిపెట్టుటకై యెట్టి కష్టములకైన నోర్చును. జ్యోతిష్కుల వాక్యముల ననుసరించి సమయానుగుణముగఁ బద్మావతిని రాజునకు వివాహము సేయుటకై పూనుకొనును. వాసవదత్త సజీవయై యుండఁగాఁ బద్మావతిని వత్సరాజునకిచ్చుటకు మగధరా జంగీకరింపమిచే లావాణకమున వాసవదత్త మరణించెనను వదంతి పుట్టించి పద్మావతీ వత్సరాజుల వివాహమును గూర్చెను. 'కష్టసుఖములు బండిచక్రములవంటి'వని యెంచి యోర్పు వహించి యుండెను. ఈతఁడు మాఱువేషమును ధరించి తదనుగుణముగా ప్రవర్తించుటలో నేర్పరి. తన స్వామికి రాజ్యసంపాదన కారకురాలగు పద్మావతిని గాంచఁగానే యతని కామెయందు గౌరవభావము గల్గినది. ఇతఁడవకాశమునకై వేచి యది వచ్చినవెంటనే సద్వినియోగము చేసికొను వివేకి, కనుకనే పద్మావతి యాచకుల నాహ్వానింపఁగానే తన కార్య నిర్వహణమునకు సిద్ధపడెను. గౌరవనీయులందుఁ బూజ్యభావమీతని కధికము. పరస్త్రీ వృత్తాంతమును వినుటయం దుపేక్షభావము కలవాఁడు గనుకనే 'వాసవదత్తయను భార్య వత్సరాజునకుఁ గలద'ని బ్రహ్మచారి చెప్పఁగానే 'ఉండవచ్చు' నని నిరాదరణతో ననును. దుఃఖములో మునిఁగిన రాజు ననునయించు నుద్వేగము నొందక రుమణ్వంతుని ప్రశ్రమకు జాలిచెందును. రాజునకు వాసవదత్త నుండి వియోగము గల్పించి కష్టపెట్టి నందుకు రాజును క్షమింపఁ బ్రార్థించుటచే, రాజోపకారి యైనను రాజు నందు భయభక్తులతో వర్తించుచుండె ననుట స్పష్టము. రాజభక్తి పరాయణుఁడు యౌగంధరాయణుఁడు.

కథాసంధానము:— కోల్పోయిన వత్సరాజ్యమును సంపాదించుటకై పుష్పక భద్రాముల యాదేశము ననుసరించి పద్మావతిని వత్సరాజునకు వివాహముచేసి పునః రాజ్యసంపాదనము చేయుటయే కదా యీనాటక కథ. వాసవదత్త బ్రతికియున్నంతకాలము వత్సరాజు పద్మావతిని వివాహమాడుటకాని, మగధరాజగు దర్శకుఁడు తన సోదరిని వత్సరాజునకిచ్చుట కాని సాధ్యముగాదు. కాన రాజు వేటకై వెడలినపుడు లావాణకమున నిప్పుపెట్టి యందులో వాసవదత్తా యౌగంధరాయణులు

దగ్ధమైరని వాదు పుట్టించి, వాసవదత్తాశీలపోషణార్థమై యామెను పద్మావతియొద్ద న్యాసముగానుంచి పద్మావతిని రాజునకు వివాహము చేయింపఁ బ్రథమాంకమందలి ప్రయత్నము నాటకమునకు ముఖసంధి యగుచున్నది ద్వితీయాంకమునఁ బద్మావతి వత్సరాజు గుణములచే నాకర్షింపఁబడి, యాతనిని వివాహమాడ నిశ్చయించుటయు, రాజును కార్యాంతరమున మగధదేశమునకు రాఁగనే దర్శకుఁడు పద్మావతిని వత్స రాజునకిచ్చి వివాహము చేయ నిశ్చయించుటలో యౌగంధరాయణుని ప్రయత్నము ఫలోన్ముఖ మగుచున్నది. కాన నిది నాటకమున ప్రతిముఖ సంధిగా పరిణమించినది. తృతీయాంకమున పద్మావతీ వత్సరాజుల వివాహము జరుగుటచే యౌగంధరాయణుని సంకల్పముతోఁ బాటు పుష్పక భద్రాదుల యాదేశములో సగము సిద్ధించినది గాన నిందు నాటకమునకు గర్భసంధి యేర్పడుచున్నది.

ఇఁక వత్సరాజునకు రాజ్యప్రాప్తియు, వాసవదత్త బయలు పడుటయు మిగిలిపోయినవి. ఈరెండును జరిగి కథ వెంటనే ముగింపునకుఁ జేరుటకుముందు సామాజికులకు నూత్నాభిరుచిని గల్గించుటకై చతుర్థ పంచమాంకములందలి కథ ప్రవేశ పెట్టఁబడినది. ఇందు కథాచమత్కారమే కాక, వత్సరాజుయొక్క వాసవదత్తా స్వప్న వృత్తాంతము చేత వాసవదత్త బ్రతికియున్నదను సూచన గలుగుచున్నది. ఇం దవమర్శసంధి యేర్పడుచున్నది. ప్రథమాంకముననే బ్రహ్మచారి వాక్యములందు 'ఆనెలఁత దగ్ధమునొందియు దగ్ధముకాదు సూ' యనుమాటలచేతనే వాసవదత్త మరణింపలేదనుభావము పతాకిస్థానము, లేక, 'విరోధభావ స్ఫురణము' (Tragic irony) చేఁ దోఁచుచున్నది. ఈ భావము వత్సరాజు స్వప్నమున వాసవదత్తను గాంచు వృత్తాంతమువలన బలపఱచఁబడినది. ఇఁక షష్ఠాంకారంభమున వాసవదత్త వీణయగు 'ఘోషవతి' బయలు పడుటవలన వాసవదత్తగూడఁ గనఁబడవచ్చునను భావము ద్యోతకమగు చున్నది. తర్వాత ప్రద్యోతనుని కంచుకి వత్సరాజు నోదార్చుమాటలగు 'దేవర వారిచేత ననుకంప్యమానయగు వాసవదత్త మృతినొందియు బ్రతికియే యున్నద'ను వానిచే నామె సజీవ యనుభావము ధ్వనించుచున్నది. మహాసేనుని దేవి తనధాదిమూలమున పంపినవాసవదత్తావత్సరాజుల చిత్ర

ఫలకములందు వాసవదత్త యాకారమునుబోలిన యావంతిక తనసన్నిధి నుండుటను పద్మావతి గుర్తించి, యాకుయే తుదకు వాసవదత్తగా నెఱుఁగఁబడినది. ఈవిధముగ వాసవదత్త సజీవయని క్రమక్రమముగా సూచింపఁబడి కథ సక్రమముగా ముగింపునకు వచ్చినదే కాని యాకస్మికముగా పరిసమాప్తము చెందలేదు. తర్వాత మహాసేనుని సాయమున వత్సదేశప్రాప్తియు పిమ్మట వాసవదత్తాసంయోగమును గలుగుటచే యౌగంధరాయణసంకల్పసిద్ధి గలిగి నిర్వహణ సంధితో నాటకకథ ముగింపునకు వచ్చినది.

నాటక మందలి గుణములు:—కథ నాటకము నరసవంతమ్మై,యభిరుచి ప్రేరకమైన యౌగంధ రాయణుని తంత్రమను ఘట్టమునుండి ప్రారంభించు చున్నది. ఈ ఘట్టమందలి సరస సంభాషణము సాధారణమైనది కాక ముఖ్యముగా కథా వ్యాప్తికిని పాత్రపోషణమునకుమాత్రమే చేయఁ బడినది. ఇందలి ప్రతి పాత్రయు కథావ్యాపారమున నేదో యొక ప్రయోజనము తోడనే ప్రవేశపెట్టఁబడినది. ప్రథమాంకమున బ్రహ్మచారి ప్రవేశించి పూర్వకథయగు లావాణకమున వాసవదత్తాదగ్ధ వృత్తాంత మంతయు వివరించును. ముఖ్యపాత్ర కాకున్నను బ్రహ్మచారి యొక్క లావాణక దగ్ధ కథా కథనము వలన ప్రేక్షకులకుఁ బూర్వకథతోడి పరిచయము గల్గుటయే కాక, వాసవదత్తావియోగమునకై రాజు పడిన విషాదమును బట్టి యతని కోమలహృదయము స్పష్టపడుచున్నది. ఇందుచే వాసవదత్త యెంత మనోహర పాత్రయో స్ఫురించుచున్నది. రాజామెకై పడిన దుఃఖమును బట్టి యాతని దయార్ద్ర హృదయమును పద్మావతి గ్రహించి, తన్మూలమున నామె రాజును ప్రేమించును. కాన బ్రహ్మచారి పాత్ర ప్రవేశమున నిన్ని పరమ ప్రయోజనములు సాధింపఁబడినవి. ఉత్తర రామచరిత్రమందలి ద్వితీయాంకారంభమున మైత్రేయీపాత్రప్రవేశ మిటువంటిదే.

ద్వితీయాంకమునఁ బద్మావతి కన్యావస్థయందలి విలాస చేష్టల తోడి నిశ్చింత జీవితము ప్రదర్శింపఁబడినది. పద్మావతి వాసవదత్త సోదరుని వివాహమాడునని యొక గాథను బ్రవేశపెట్టి కవి చమత్కారము చేసినాఁడు. ఇందలి సంభాషణ మెంతయో రమణీయముగ నుండి

శాకుంతల ప్రథమాంకమునఁ బ్రియంవదానసూయా శకుంతల సంభాషణమువలె రసవంతముగ నున్నది. మఱియు వత్సరాజు ద్వితీయ వివాహమున కంగీకరించు సందర్భమునఁ గవి లోకసామాన్యవిషయము నొకదానిని బ్రవేశపెట్టి వాసవదత్తచేత 'ప్రథమభార్యానిమిత్త మావిధముగా సంతాపించి యంతలోనే యుదాసీనుఁడైనాఁడుగదా' యని పలికించును.

సంస్కృతనాటకవాఙ్మయమున వర్ణనాశిల్పమందుఁ గాళిదా సెట్టి నేర్పరియో, రసపోషణమున భవభూతి యెట్టి దక్షుఁడో, పాత్రపోషణమున శూద్రకుఁ డెట్టి సమర్థుఁడో, నిపుణ సంభాషణ రచనమున విశాఖదత్తుఁ డెట్టి యమోఘుఁడో చమత్కార కథాకల్పనముతోడి రసమయసన్నివేశములఁ గూర్చుటలో భాసుఁ డట్టి ప్రతిభాశాలి. అసలీస్వప్నవాసవదత్తనాటకము కథారామణీయకమునకుఁ బ్రఖ్యాతమైనది. ఇందు రసోత్కృష్టతకంటెఁ, బాత్రపోషణవైచిత్రికంటెఁ, గథాచమత్కారమే యత్యధికము. ఈ విషయమునఁ గవి తన నాటకవస్తువును విమర్శించువానివలెఁ జతుర్థాంకమున రాజవిదూషకులు పద్మావతీ వాసవదత్తల శీలతారతమ్యమును విచారించినపిమ్మట పద్మావతినోట, 'కథాయోగము మిక్కిలి రమణీయముగ నున్నద'ని పలికించును. మఱియు బంచమాంకమున రాజు విదూషకునితో నిద్ర పోఁగొట్టుటకై యొక కథఁ జెప్పు''మని యడుగును. అదియునుగాక పద్మావతి తలనొప్పిఁ దీసివేయుటకై వాసవదత్త కథలుచెప్పుటకు వినియోగింపఁబడును. చమత్కారకథాశ్రవణము నిద్రను, తలనొప్పిని గూడ పోఁగొట్టునని కవియుద్దేశమై యుండనోపు.

పంచమాంకమునఁ బద్మావతీ శిరోభారనెపమున, నామెకై నియమింపఁబడినపాన్పుపై వత్సరాజు పరుండుటయు, నామెను జూచునిమిత్తమున వాసవదత్త యక్కడకు వచ్చి,తలనిండ ముసుఁగుపెట్టుకొని పరున్న రాజును బద్మావతిగాభావించి యతనిప్రక్కనే పరుండుటయు, రాజు స్వప్నమున వాసవదత్తను కలవరింపఁగా నామె విస్మయముచెంది లేచుటయు, రాజు దమ పూర్వ ప్రణయకలహ వృత్తాంతమును స్మరింపఁగ నామె యతని నోదార్చి యతనిహస్తమును స్పృశించి పరులు గనుగొందురను భయముతో నిష్క్రమించుటయు బహురమణీయముగఁ గవి

గూర్చినాఁడు. భ్రాంతిమూలకమైన యీ సన్నివేశమున విరహాగ్నిఁ గ్రాలు ప్రేయసీప్రియుల నేకశయ్యపైఁ దార్చి చమత్కారకల్పనముచేసి కవి సామాజికులకు వినోదముగూర్చినాఁడు. ఇది సంభావ్యముగఁగూడ నున్నది. నాటకమున నాయువు పట్టిదే. ఈ రసవత్సన్నివేశము నాశ్రయించియే నాటకమునకు స్వప్నవాసవదత్త మని పేరు పెట్టినాఁడు కవి. ఇందలి సంభాషణము బహు రసవంతముగా నున్నది. ఔచిత్యము, సభ్యత చెడకొట్టకుండ నిటువంటి మనోహరమైన శృంగారరసమయ సన్నివేశములఁ గూర్చుట బహుకష్టము ఆంధ్రవాఙ్మయమునందుఁ గళాపూర్ణోదయమున సుగాత్రీశాలీనుల శృంగారకథగూడ నిట్లు నిర్వహింపఁబడినది. షష్ఠాంకమున చిత్రపటముమూలమున నావంతికయే వాసవదత్త యని నిరూపింపఁబడుటకూడ నిటువంటి చమత్కారకల్పనమే.

దోషములు:— ఈ నాటకమునఁ బ్రధానరసము బాగుగఁ బోషింపఁబడ లేదు. ఇందు శృంగారరసము ప్రధాన మందుమా? పద్మావతీ వత్సరాజుల శృంగారకథకంటె వాసవదత్తావియోగమునకై రాజు పడిన పరితాపమే యెం దధికముగా వర్ణింపఁబడినది. అట్లని విప్రలంభ శృంగారము ప్రధానరస మందుమా? వాసవదత్త పునర్దర్శనాశ రాజునకు లేమిచే నట్లనజెల్లదు. ఈ రీతి రసవిషయమున నుత్తర రామచరిత్రమునకుఁ బట్టిన స్థితియే దీనికిని బట్టినదని నా భావము. కాని యుత్తర రామచరిత్రమునఁ గరుణరసమైనను పరిపూర్ణముగఁ బోషింపఁబడినది. ఈ నాటకమున నదియు లేదు. ప్రధానరస పోషణము ప్రతిమా నాటక మందువలె నిందును సమగ్రముకాదు.

ఈ నాటకమున మఱికొన్ని యనుచితములు గలవు. పంచమాంకమునఁ బద్మావతీశిరోవేదనవలన రాజు దోలాందోలనమానసుఁడై యామెను జూడవలయునని తలఁచినవాఁ డంత శీఘ్రముగ వసంతకుని వలన గథాప్రసంగముల వేడుక ననుభవింపఁగోరి ప్రధానవిషయమును మఱచి యెట్లు నిద్రచెందెను? మనస్సు కలఁతచెందినపుడు నిద్రపట్టదే. మఱియును బద్మావతీ క్షేమవార్తఁ దెలిసికొనఁగోరువాఁ డామె సంగతి విచారింపక శయ్యపై పరుండి నిద్రచెందుట సాధ్యమగునా? యను ప్రశ్నలు బయలుదేరును. కాని యిట్లు నిద్రచెందుట యసాధ్యమైనను

నసంభావ్యము గాదనిమాత్రము సమర్థింపఁదగును. మఱియు షష్ఠాంక మునఁ బద్మావతిని గాంచగానే రాజామె శిరోవేదనమునఁగాన్చి యాచా రార్థమైనఁగాడ నామె క్షేమసమాచారము విచారింపఁడు. ఇందుచే నామె శిరోవేదనకల్పనము తాత్కాలిక ప్రయోజనము మాత్రమే గల్గియున్నది.

ఇతరనాటకములతోఁ బోలికలు:—ఈనాటక పంచమాంకమందలి స్వప్నవృత్తాంత సన్నివేశమునే యాదర్శముగ గ్రహించి భవభూతి మహాకవి యుత్తరరామచరిత్ర నాటకమందు ఛాయాంకమగు తృతీయాంక మున, శ్రీరాముఁడు దండకారణ్యమున సీతావియోగమున దుఃఖించు చుండుటయు, సీతాదేవి భాగీరథీప్రసాదమున నితరులకుఁ గనఁబడకుండు నట్లు వరమునుగొని యటకువచ్చి రాముని విషాదావస్థను గాంచి, యతఁడు మూర్ఛ చెందినపుడు తన హస్తస్పర్శచే నతనికి స్పృహఁ దెప్పిం పఁగ, సీత బ్రతికియేయున్నదని శ్రీరాముఁడు భావించినట్లు చిత్రించినాఁడు. స్వప్నవాసవదత్తోత్తరరామ చరిత్ర నాటకద్వయమందు నాయకు లళీకభార్యామరణమునకై విలపించువారే. రెండురూపకములందు నాయ కులు దమప్రియురాండ్రఁ గాంచలేకున్నను, దమ దుఃఖమును మాత్రము వారు ప్రత్యక్షముగాఁ బ్రక్కనేయుండి చూచుచుండిరి. రెండునాటకము లందు నాయకు లజ్ఞానావస్థయందుఁ దమ ప్రియాహస్తస్పర్శలఁబొంది, వారి హస్తముల గ్రహింపఁబోయి విఫలమనోరథులయ్యు, వారినిగాంచి నట్లు భావించి, వారు సజీవులని తలపోయువారే. స్వప్నవాసవదత్తమున రాజు స్వప్నావస్థయం దుండుటచే వాసవదత్త యెదురుగ నున్నను జూడ లేకపోయినాఁడు. ఉత్తరరామచరిత్రమున శ్రీరాముఁడు మేల్కాంచి యున్నను భాగీరథీవరమాహాత్మ్యమున సీత యెదురుగ నున్నను గాంచలేక పోయెను. మఱియు స్వప్నవాసవదత్తనాటక చతుర్థాంకమున రాజు విదూషకునిచేఁ బ్రేరేపితుఁడై, మరణించిన తనప్రియురాలగు వాసవ దత్తపైఁ దనకుఁగల విశేషాదరమును దెలుపుచుండగా, నావంతికవేష ముననున్న వాసవదత్త పద్మావతితోడఁ బొదరింటిచాటుననుండి వినుచుఁ దనజన్మ సఫలమైనదని భావించినది. కాని, రాజావిషయ మెఱుఁగఁడు. అట్లే యుత్తరరామచరిత్ర తృతీయాంకమున శ్రీరామమూర్ఛ వృత్తాంత

ముతోఁ గలిపి రాముఁడు, వాసంతీప్రేరితుఁడై సీతాప్రమోదంతముల దెల్పుచుండగా, సీత భాగీరథీప్రసాదమున నితరుల కగోచరయై, యాతనివాక్యముల విని తనజన్మ ధన్యమైనదని భావించినది. ఈ రీతిగ స్వప్నవాసవదత్తనాటక చతుర్థ పంచమాంకములందలి విషయములను గలిపి, భవభూతి యుత్తరరామచరిత తృతీయాంకమున సదృశ సన్నివేశములఁగూర్చి భాసకవికి కృతజ్ఞుఁడైనాఁడని నా యభిప్రాయము. ఈ కథాసంధానములు స్వప్నవాసవదత్తమున నెక్కువ చమత్కారముగ, నుత్తరరామచరిత్రమున నెక్కువ హృదయసంచలనకరముగ నున్నవి.

స్వప్నవాసవదత్త నాటక పంచమాంకమున పద్మావతి శిరోభారపీడిత యని యెఱిఁగి,యామె క్షేమ మరయ వచ్చిన వత్సరాజామెకై నియమింపఁబడిన పాన్పుపై తలనిండ ముసుఁగిడి పరుండినపుడు, వాసవదత్త కూడ నామెను పరామర్శించుటకై యాపాన్పునుచేరి, యందు తలనిండ ముసుఁగిడి పరుండిన వత్సరాజును బద్మావతిగనే భావించి యతనిప్రక్కనే పరుండి, పిమ్మట యాథార్థ్యముఁ నెఱింగి, కొంతసంభాషణ జరిపి పరులు చూతురను భయమున నిష్క్రమించును. ఇట్టి సన్నివేశమునే భవభూతి మహాకవి మాలతీమాధవ నాటక సప్తమాంకమునఁ, గామందకి యుపాయమున నందుని మోసగించుటకై మకరందుఁడు మాలతీవేషమున శయ్యాగతుఁడై యుండఁగా, నతని ప్రియురాలైన మదయంతిక, తనసోదరుఁడైన నందుని నూత్నగర్భాధాన శయ్యాగృహంబునఁ దిరస్కరించినందుకై,నూత్నవధువును,దన వదినయునైన మాలతిని మందలింపఁదలచి, యాతనిశయ్యపైఁజేరి లవంగికతో నంద (మాయా) మాలతుల ధూర్త ప్రసంగంబులఁగూర్చి సంభాషించును. తర్వాతఁ దన్ను పులినోటినుండి రక్షించిన తనప్రియుఁడగు మకరందుని కళ్లారఁ జూడ లేనందుకు విచారపడుచు, నతని సుగుణముల మెచ్చుకొనుచు, నతనిపై తనకుఁగల యధికానురాగమును,దన పూర్వస్వప్నగతవృత్తాంత కథనమునఁ బ్రకటించును. ఇదంతయు మాలతీవేషధారుఁడైన మకరందుఁడు శయ్యపై ముసుఁగిడి పరుండి మేలుకొని వినుచుండును. బుద్ధిరక్షితయు లవంగికయు, మదయంతికను మకరందునిపైఁగల ప్రణయమును దెలుపుటకై పురియెక్కించుచుందురు. తన సోదరుఁడగు నందుని

వంచించుటకై మకరందుఁడే మాలతీవేషమును ధరించెనని యొంతమాత్రము మదయంతిక యెఱుఁగదు. అంత యుద్యానశ్రీయుఁగూడ నామె ననునయించి తెచ్చుటకై మదయంతిక పోఁబోవుచుండ మాలతీవేషధారుఁడైన మకరందుఁడు తనమొగముమీఁది ముసుఁగును తొలఁగించి యామెను పట్టుకొనఁగా నామె మొదట మాలతిగా భావించి, తర్వాత నతనిని తన ప్రియునిగా గుర్తించి యాశ్చర్య సంతోషములఁ బొందును. ఈరచన మందు కల్పన యెంతయో రమణీయముగ నున్నది. ఈ రెండుసంఘటనలందు నాయికలు తమ చెలుల పాన్పులను భావమున సమాంతికముగఁ జేరి, యందుఁ దమ ప్రియులు పరుండియుండుటను గనుగొందురు. స్వప్నవాసవదత్తమున వత్సరాజు స్వప్నగతుఁడు. మాలతీమాధవమున, మదయంతిక తన పూర్వ స్వప్నవృత్తాంత పూర్వాక ప్రణయ విషయమును, మాలతీవేషధారుఁడైన మకరందుని సమక్షమున నతఁడు మేల్కాంచియుండఁగనే వర్ణించును. మాలతి తన ప్రియసఖియే కదా యను విశ్వాసముచే మదయంతిక యట్లు నిర్భయముగఁ బ్రసంగించినది. స్వప్నవాసవదత్తనాటకమున నాయికా నాయకులు మాత్రమే యా సన్నివేశమున నుండిరి. ఉత్తరరామచరిత్ర, మాలతీమాధవములలో నాయిక సఖులుకూడ వెంటనుండి, నాయకుని యుత్తరరామచరిత్రమున, నుపనాయికయైన మదయంతికను మాలతీమాధవమున రెచ్చ పెట్టుదురు. స్వప్నవాసవదత్త సన్నివేశమున శృంగార కరుణ రసములు రెండును మిళితమైనవి. అందలి శృంగారభాగము మాలతీమాధవమున, మదయంతికా మకరందుల ప్రణయ వృత్తాంత సంఘటనమందును, కరుణభాగ ముత్తరరామచరిత్రమున నాయికా నాయకుల వియోగ వృత్తాంత సంఘటనమందు ననుకరింపఁబడి రమణీయముగఁ బోషింపఁబడినవి. విషయములను భాసుఁడు క్లుప్తముగా రచింపఁగ, భవభూతి తన నాటకములందు ప్రపంచించినాఁడు. ఈ రీతిగఁగూడ భవభూతి భాసమహాకవికిఁ గృతజ్ఞుఁడు.

భవభూతి యుత్తరరామ చరిత్రమున స్వప్నవాసవదత్తభాగము ననుకరించినట్లే దిఙ్నాగ, లేక ధీరనాగకవి గూడ తన కుందమాల నాటకమం దనుకరించినాఁడు. శ్రీరామపరిత్యక్తయైన సీత వాల్మీకిమహర్షిచే

నాశ్రమమునకుఁదీసికొనిపోఁబడుచున్నప్పుడు తాను సుఖప్రసవమునొందు నెడ భాగీరథికి నిత్యము నొక కుందమాల నర్పింతునని మ్రొక్కుకొనును. కుశలవ జననానంతరకాలమున నైమిశారణ్యమున శ్రీరాముఁ డశ్వమేధ యాగము చేయుచు వాల్మీకి నాహ్వానింప, నతడు సీతా లవకుశులతో గోమతీ తీరాశ్రమమున కేతెంచును. ఆ విషయ మెఱిఁగి శ్రీరాముఁడు లక్ష్మణునితో నచటికివచ్చి గోమతీనద్యవతరణమున తన సన్నిధికివచ్చిన యొక కుందమాలను గాంచి, యట్టి నిపుణమును విలక్షణము నైనకూర్పు సీతకుమాత్రమే తెలియుటవలన, సీత సజీవురాలనియు, నాసమీపముననే యామె యుండునని తలంచెను. ఈ సంఘటనను స్వప్నవాసవదత్తమున 'ఘోషవతి'యను వాసవదత్తవీణ దొరుకుటచే వాసవదత్తకూడ దొరుకు నని గ్రహింపఁబడినరీతి నున్నది. స్వప్నవాసవదత్తనాటక తిరువాన్కూరు ప్రతియందు పద్మావతి ధరించిన దివ్యతిలకమువలన, వాసవదత్త సజీవురా లని గ్రహింపఁబడును. దీని మూలగ్రంథమున దివ్యమాలచేఁగూడ నామె సజీవురాలని యూహింపఁబడును. ఈ విషయమే కుందమాలయం దనుకరింపఁబడినది. తర్వాత శ్రీరాముఁడు యజ్ఞధూమకలుషితనేత్రుఁడై ముఖ ప్రక్షాళనార్థ మా యాశ్రమసమీప సరోవరమునకువచ్చి, యంతకుఁబూర్వమే యా తీరమునకేతెంచి రాజహంస మిథునావలోకన వ్యగ్రురాలైయున్న సీత తజ్జల[illegible]న ప్రతిఫలింపగ చూచును. కాని వాల్మీకి వరప్రభావముచే నచటి స్త్రీ లెవరు పురుషుల కగోచరులగుటచే సీతను ప్రత్యక్షముగాఁ రాముఁడు చూడలేకపోయెను. పిమ్మట సీత ప్రక్కగా నడచి పోవుటచేనామె ప్రతిబింబముగూడ జలమునరాముఁడుగాంచ లేక మూర్ఛి తుఁడుగాఁగ,నామె తనహస్తస్పర్శచే నతనిని సచేతనునిగఁజేయును. రెండవ మారు నట్లే జరుగఁగ నామె పయిటకొంగుచే విసరి యాతనినిఁదేర్చును. మరల సీత తొలఁగిపోవుచుండ నామె యుత్తరీయమును రాముఁడు లాగి కొనఁగ, దాని నామె వదలివేయును. కడకు విదూషకుఁడు వచ్చి యదం తయు తిలోత్తమయను నచ్చర తన ప్రభావముచే సీతారూపముదాల్చి తన్ను పరీక్షించుటకై చేసిన ప్రయత్నమని తెల్పును. ఇట్టి కల్పనచే దిగ్నాగకవి గూడ భాసకవికి కృతజ్ఞుఁడైనాఁడు.

స్వప్నవాసవదత్తనాటకకథనే శ్రీహర్షుఁడు కొంతఱి నామసామ్యములతోడను, కొంత భేదముతోడను గ్రహించి 'ప్రియదర్శికా, రత్నావళు'లందుఁ జమత్కారముచేసెను. ఈ రెండునాటకములందు వాసవదత్తావత్సరాజులు వత్తురు. రత్నావళియందు యౌగంధరాయణుఁడు గూడవచ్చును. ఇందలి రత్నావళి, లేక సాగరిక స్వప్నవాసవదత్తమందలి పద్మావతి, రెండునాటకములందు నుపనాయికను వివాహమాడినవాఁడు మహారాజగునను జ్యోతిష్కులవాక్యముల ననుసరించియే యౌగంధరాయణుఁడు వారి వివాహప్రయత్నములఁ జేయును. కాని రత్నావళీ స్వప్నవాసవదత్తములందు కథ కొంత విపర్యస్తమైనది. స్వప్నవాసవదత్తమందు వాసవదత్త పద్మావతియొద్ద దాఁచఁబడును. రత్నావళియందు సాగరిక వాసవదత్తయొద్ద దాఁచఁబడును. 'రత్నావళీ' ప్రియదర్శికములందు సాగరికా ప్రియదర్శికలు వత్సరాజును గలిసికొని ప్రేమించి వాసవదత్త కసూయ గల్గింతురు. ఇందుమూలమున వాసవదత్త ఖండిత నాయిక, వత్సరాజు దక్షిణనాయకుఁడు నగుచున్నారు. మఱియు సాగరికా ప్రియదర్శికలు మారువేషమున వత్సరాజుతో సుఖింపఁ బ్రయత్నించి, మధ్యమధ్య వాసవదత్తచేఁ బట్టుకొనఁబడి, రాజును వారును గూడ దోషకారులగుటయు, నుపనాయికలు చెఱయం దుంపఁబడుటయును గల్గును. స్వప్నవాసవదత్తమం దీ విషాదకరవిషయము లేవియు లేవు. సర్వము ప్రశాంతముగ జరుగును. మఱియొకవిశేషము. స్వప్నవాసవదత్తమున వత్సరాజు వాసవదత్తపై గాఢానురాగముగల్గి యామె మరణానంతరము ద్వితీయభార్యపైకంటెఁ గూడ వాసవదత్తయందే యెక్కువప్రేమగల్గియుండును. దీనికి వ్యతిరేకముగఁ బ్రియదర్శికారత్నావళులందు వాసవదత్త సమక్షముననే యితరులపై నామెయందుకంటె నెక్కువప్రేమను జూపును. స్వప్నవాసవదత్తమందు కథ ప్రసన్నముగను, పాత్రలు ప్రశాంతచిత్తులుగనుండిరి. ప్రియదర్శికారత్నావళులందంతర్నాట కైంద్రజాలాది చమత్కారము లెన్నియున్నను నవి కృత్రిమములై, పాత్రలు కలుషితహృదయులు కావలసివచ్చినవి.

ఈ కథనే వస్తువుగాగ్రహించి మాఉరాజను కవి తాపసవత్సరాజమను నాటకమును రచించెను. ఇందు వత్సరాజు వాసవదత్తా వియోగ

మున తాపసవేషమును ధరించి, తీర్థయాత్రలు సేవించుచుండి, పద్మావతీ వివాహానంతరమునఁగూడ వాసవదత్తను గాంచలేకపోవుటచే నదీతీరమున నాత్మహత్యఁజేసికొనఁబూనుటయు, నా నదీతీరముననే మఱియొకచెంత వాసవదత్తయు నాత్మహత్యఁ గావించుకొనఁ దలఁచుటయు, సంఘటింపఁ జేసి చివరకు వారిద్దరకు సమావేశముగల్పించి యుభయులు సుఖముగ నుండునట్లు రచింపఁబడినది. ఇందుఁ గొంత విషాదవృత్తాంతము గల్పింపఁబడినది. మఱియు శూద్రకకవి వాసవదత్తావత్సరాజుల కథను వీణావాసవదత్తమను నాటకముగ రచించినాఁడు. ఎట్లును స్వప్న వాసవదత్తమందలి ప్రశాంతతయును, జమత్కారమును నై యే నాటకము లందును గానరాదు.

భాసమహాకవి మార్గదర్శకుఁడైనది పై నాటకకర్తలకే కాదు. కవి సార్వభౌముఁడైన కాళిదాసు తన కృతులందు భాసునిభావములను శ్లోక పాదములను బట్టుకొనినాఁడు. శూద్రకుని మృచ్ఛకటికమునకు భాసుని చారుదత్తమును, భట్టనారాయణుని వేణీసంహారమున కీతని 'ఊరు భంగము'ను, విశాఖదత్తుని ముద్రారాక్షసమునకు ప్రతిజ్ఞా యౌగంధ రాయణ నాటకమును మార్గదర్శకములైనవని చెప్పవచ్చును. ఈవిధముగ ప్రఖ్యాతసంస్కృత నాటకకర్తలందఱకు భాసమహాకవి గురుపీఠమైనాఁడు. మొదట నిరూపించినట్లు మూలమున పచ్చిపచ్చిగానున్న వాసవదత్తా వత్సరాజుల కథయందు గొన్ని మార్పులుచేసి భాసమహాకవి యౌచిత్య రసపాత్రపోషణములను చేయుటలోఁ దన కళాప్రతిభలను ప్రదర్శించి నాఁడు. కథాకల్పనముచే రసమయ సన్నివేశములఁగూర్చి నాటకమును రంగోచితము గావించినాఁడు. నిపుణ సంభాషణముల రచించి రమణీయ మొనర్చినాఁడు. ఇట్టి నిరుపమాన నాటక కళానైపుణ్యమును బహు ప్రాచీనకాలముననే ప్రదర్శింపఁ గల్గినాఁడుగనుకనే కవిసార్వభౌముఁడైన కాళిదాసీతనిని స్తుతించినాఁడు. అందుచేతనే భాసుని కీర్తి చిరస్థాయిగా నున్నది.

# ముద్రారాక్షసము

విశాఖదత్తుని కాలము:— కవి కాలమును దెలిసికొనుటవలనఁ బ్రయోజన మేమనఁగ కావ్యమున తత్కాలిక సాంఘిక ప్రవృత్తులు ప్రతిబింబించును. ఆ కాలపు సంఘమునుండి కవి గ్రహించిన విశేషాంశములు, నా కాలపు సంఘమునకుఁ గవి యుపదేశించిన తత్త్వములు గూడ నాతని కావ్యమున ద్యోతకమగుచుండును. మఱియు నా కాలపు ప్రపంచమును దా నేదృష్టితోఁ జూచినది, యా కాలప్రవృత్తి దన ప్రకృతిపై నెట్టి ప్రభావమును నెఱపినదిగూడ బోధపడును. కవికాలము సందిగ్ధముగా నుండుచో నీ విషయములు దేలుట కష్టము. ఒక కవి కాలనిర్ణయమును చేయుట కాకవినిఁ గాని, యా కవినిఁ బోషించిన రాజును గాని దెల్పిన దేశచరిత్రయు, వారి యునికిని దెల్పు శాసనములును, నా కవిని వాని గ్రంథములను సూచించిన లక్షణ గ్రంథములును బాహ్య ప్రమాణములగుచున్నవి. కవియే తన గ్రంథమున సూచించిన రాజులు, లక్షణకర్తలు, పూర్వకవులు, ప్రసిద్ధపురుషులుగాని, ప్రసిద్ధ చారిత్రిక సంఘటనలుగాని యాంతరప్రమాణములగుచున్నవి. మఱియొక యాంతర ప్రమాణమగు భాషాశైలులు పై విధప్రమాణములకుఁ బ్రోద్బలముగ నుండగల్గునేకాని ప్రత్యేకముగా దీనినిబట్టి నిర్ధారణసేయఁబూనుట బహు ప్రమాదకరము. కాన నిది సాధారణముగఁ బ్రత్యేకప్రమాణముగ గ్రహింపఁబడదు.

విశాఖదత్తుని కాలనిర్ణయము సేయుటకు ముద్రారాక్షసమునఁగాని, యితరగ్రంథములందుగాని, పైవిధములైన ముఖ్యబాహ్యాంతర ప్రమాణము లేవియు గానరావు. ప్రస్తావననుబట్టి ముద్రారాక్షసనాటకకర్త యగు విశాఖదత్తుఁడు రాజ్యాధికారులగు దత్తవంశమునకుఁ జెందినవాఁడనియు, వీని తాతయగు వటేశ్వరదత్తుఁడు సామంతప్రభువనియు, నీ కవి తండ్రియగు భాస్కరదత్తుఁడు మహారాజపదవి నొందినవాఁడనియు, గొన్ని నాటకప్రతులలో నీ కవి "విశాఖదేవుఁ"డని యుండుటచే నీతఁడుత్కృష్టస్థాన మాక్రమించెననిమాత్ర మూహింపనగును. కాని యింకేమియు కవినిగూర్చి మనకుఁ దెలియదు. వీరి మువ్వుర పేర్లుగూడ చరిత్ర

యందుగాని, శాసనములందుగాని యెక్కడఁ గానరావు. ఇఁక నాటక భరతవాక్యమున కవి 'సర్వజగత్ప్రళయంబున నాదివరాహమూర్తి కొన గోర భూమిని ధరించి రక్షించినట్లుగా, మ్లేచ్ఛబాధితజగంబును రక్షించిన చంద్రగుప్తుఁడు ప్రోచుగాక' యని నుడివెను. ఇందు చంద్రగుప్తశబ్ద మునకు బదులుగాఁ గొన్నికొన్ని ప్రతులలో 'అవంతివర్మ, దంతివర్మ, రంతివర్మ' యని యనేకవిధములుగనున్నది. దీనినిబట్టి విమర్శకు లనేక విధముల గగనసౌధములఁ గట్టిరి. ధృవాపండితుఁడు 'అవంతివర్మ' యను పాఠమును గ్రహించి 'కనూజి' రాజగు నీతఁడు స్థానేశ్వరరాజు సాయమున క్రీ. శ. 565 ప్రాంతమున 'హూణు' లను మ్లేచ్ఛులను హిందూదేశమునుండి తఱిమివేసెననియు, గాన నవంతివర్మ కాలములో నున్న విశాఖదత్తుఁ డాకాలమువాఁడనియు, ముద్రారాక్షసము క్రీ. శ. 595 ప్రాంతమున రచింపఁబడెనని వాదించుచున్నాఁడు. 'చంద్రగుప్త' పాఠమునుగ్రహించి 'రే' పండితుఁడు, గుప్తవంశమునకుఁ జెందిన రెండవ చంద్రగుప్తుఁ డీతఁడనియు నితఁడు 'హూణు' లను జయించెననియు, గాన నితఁడు క్రీ. శ. 375–413 లో నుండెనని నిశ్చయించెను. 'తెలాంగు' పండితుఁడు 'చంద్రగుప్త' పాఠమునే గ్రహించి, హిందూదేశభూగోళ శాస్త్రము ననుసరించియు,బౌద్ధమతపర్యవసానస్థితి ననుసరించియు విశాఖ దత్తుఁడు క్రీ. శ. 8 వ శతాబ్దారంభమున నుండెఁదగునని యూహించెను. ప్రస్తావనయందలి చంద్రగ్రహణమునుబట్టి యీ నాటకము 2_12_860 నాటి చంద్రగ్రహణము సూచితమని యెంచి, విశాఖదత్తుఁ డాకాలపు వాఁడని 'కీత్తు' పండితునివాదము. 'విల్సన్' పండితుఁడు 'పఠానులు' మ్లేచ్ఛులనియెంచి వీరు దండెత్తివచ్చినకాలమునుబట్టి యీ నాటకము క్రీ. శ. 11 లేక 12 వ శతాబ్దమున రచింపఁబడినదని యెంచెను. ఇట్లు పలువురు దమకుఁ దోఁచినట్లు వాదించిరి. కాని యేదియూ సంతృప్తికరము గాను ప్రామాణికముగను లేదు. మ్లేచ్ఛులనఁగా హైందవ మతేతరు లందరు కావచ్చును. కాన వారు హూణులా, పఠానులా, మరియొకరా? మఱియు 'హూణులు' వివిధ శతాబ్దములలో ననేకపర్యాయములు - హిందూదేశముపై దండెత్తి వచ్చినట్లు గనుపించుచున్నది. కాన నీ విషయ మిదమిద్ధమని తేలుట యెట్లు? ప్రాచీనలక్షణ కర్త

లీనాటకముతోఁబాటే నాటకకావ్యములను బేర్కొనలేదు. క్రీ. శ. 10 వ శతాబ్దమునకుఁజెందిన దశరూపకకారుఁడు నభినవగుప్తాచార్యులు మొదలగు వారీనాటకమును దమగ్రంథములలోఁ బేర్కొనిరి. ఏవైన శాసనములు బయలుపడువఱకు నీ కవికాలము నిశ్చయముతోఁ జెప్ప వీలులేదు. విశాఖదత్తుఁడు ముద్రారాక్షసముతోఁబాటు దేవీచంద్రగుప్త మను నాటకమును రచించినట్లు నాట్యశాస్త్ర వ్యాఖ్యానమున నభినవ గుప్తాచార్యులు చెప్పిన శ్లోకములఁబట్టి దెలియుచున్నది. దేవీచంద్రగుప్త మున చంద్రగుప్తుఁడు 'ధ్రువాదేవి' వేషము ధరించి 'శక' రాజును వధించి నట్లు వర్ణింపఁబడినది. విశాఖదత్తుఁడు దనరాజుప్రీతికై దాను 'దేవీచంద్ర గుప్త' నాటకమును వ్రాసినట్లందు చెప్పుకొనెనని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు తెలుపుచున్నారు.

నాటకప్రాశస్త్యము:— సంస్కృతనాటక వాఙ్మయమున రెండు రూపకములు బహువిచిత్రముగా గనఁబడుచున్నవి. ప్రారంభముననే వాని కథావిషయము నాటకమున కర్హమైన వస్తువా యను సంశయ మునుగూడ గల్గించును. కాని యవి ప్రఖ్యాతనాటకము లగుటఁబట్టి నాటకోత్కృష్టత వస్తువునందుగాక కవియందుమాత్రమే యాధారపడి యుండునను రహస్యము నవి చాటుచున్నవి. అందు మొదటిది ముద్రా రాక్షసము, రెండవది ప్రబోధచంద్రోదయము. మొదటిది రాజనీతి శాస్త్రమును, రెండవది వేదాంతశాస్త్రమును వస్తువులుగాగలవి. సామా న్యముగా శాస్త్రవిషయములు సుకుమారబుద్ధుల నాకర్షింపవుకాన కావ్యవస్తువులుగా నుండఁదగవు. అట్లయ్యు నీ రెండునాటకములందు నాకవులు దమశేముషిని ప్రకటించి బహురామణీయకమును గూర్చిరి. ఈ రెండునాటకములందు గౌణముగ వీరరసము ప్రతిపాదింపఁబడినను సామాన్యముగా వీరరసప్రధాననాటకములందు గానవగు వథలే మాత్రము వీనియందు లేవు. ఇందు సైన్యములయుద్ధము ప్రధానముగాక బుద్ధిసమరమే ప్రధానమగును.

ముద్రారాక్షసనాటకమందలి కథావిషయము చిన్నదై క్లిష్టము లేకున్నను కథ బిగువుగల్గి నిర్వహణమువఱకు నడచినది కాని మధ్య త్రుంటువడలేదు. పలువిధములగు చాణక్యతంత్రములు పరస్పరసంబం

థము గల్గి చమత్కారముగాను, జయప్రదముగను కథను నిర్వాహణము నకుఁ దెచ్చినవి— ఇవన్నియు రాక్షస సంగ్రహమను ప్రధానలక్ష్యము నందు లగ్నమై యున్నవి. ఇందలి ప్రతి విషయము నభిరుచిని పుట్టించు చున్నది. దీనియందు ముఖ్య స్త్రీ పాత్రలు లేకపోయినను నాటకము రస వంతముగా నున్నదని పాశ్చాత్యపండితులు గూడ నంగీకరించిరి. ఇందలి పాత్రపోషణనైపుణ్యము సంస్తవనీయము. ఈవిధపునాటకము సంస్కృత వాఙ్మయమున నింకొకటి లేదు. ఇతర నాటకములవలె దీనియందు కథా సంధానము, పాత్రపోషణమును సక్రమముగను ప్రత్యక్షముగ నుండక నంతయు వక్రపద్ధతి నవలంబింపఁబడినది. అలంకారములలో వక్రోక్త్య లంకారమువలె నిదియొక నూత్నపద్ధతి. వక్రోక్తి కావ్యజీవనమని భావిం చినవా రుండిరికదా. అట్లే యీ నాటక ముత్కృష్టమైనదని మెచ్చినను దోషముండక పోవచ్చును. కౌటిల్యుని (రాజ) నీతిశాస్త్రమునకు లక్ష్య ముగా నుండున ట్లీనాటకమును విశాఖదత్తుఁడు రచించినాఁడు.

మూలకథ :- ముద్రారాక్షసమున చతురంగబల ముపయోగింప కయే బుద్ధిబలముచే శత్రువులు జయింపఁబడుదురు. ఇందు రాజ్యతంత్ర జ్ఞులగు నిరువురు మంత్రుల బుద్ధిబలములే డీకొనును. ఇది రాక్షసమంత్రి ముద్రాంకితమగు నంగుళీయకముచే శత్రువును జయించిన వృత్తాంతము గల నాటకమగుటచే ముద్రారాక్షస మనఁబడినది. ఈ కథ చారిత్రాత్మక మయ్యు దీనికి మూలము స్పష్టముగా గోచరింపదు. దశరూపకమున దీనిని కవి కథాసరిత్సాగరమునుండి గ్రహించెనని వ్రాసెను. బృహత్క థా పరివర్తన మనందగు కథాసరిత్సాగరమున మౌర్యచాణక్యపదములు గోచరించుచున్నవి కాని రాక్షసునిపేరు కనఁబడకపోవుటయేగాక యట్టి చర్యలొనర్చిన యింకొకనిపేరుగూడ కానరాదు. కథాసరిత్సాగరమున కథ యిట్లున్నది. దమ గురువగు 'వర్షుని' గురుదక్షిణకొఱకై యింద్ర దత్తవ్యాధులు వరరుచితోఁగూడ నప్పుడే మరణించిన ధార్మికుఁడగు నందరాజును జేరిరి. ఇంద్రదత్తు పరకాయ ప్రవేశముచేసి రాజును బ్రతి కించి గురుదక్షిణకై వ్యాధునికి ధనమిప్పించి పంపించెను. నందమంత్రి యగు 'శకటాలుఁడు' రాజు పునర్జీవితుఁడగుటకు శంకించి, వెదికించి యింద్రదత్తు శరీరమును కాల్పింపఁగ, నింద్రదత్తు రాజుశరీరముతోడనే

యుండవలసివచ్చెను. ఈ యోగానందుఁడు వరరుచిని మంత్రిగాఁజేసి శకటాలుని సపుత్రికునిగా కూపమున ద్రోసి, యొక మానవునకు వలయు భోజనమును మాత్రమిచ్చుచుండఁగా, దానిని మిగిలినవారి సమ్మతమున శకటాలుఁడుమాత్రము దినుచుండ, మిగిలినవారందఱు చచ్చిరి. కొంత కాలమునకు యోగానందుఁడు రాజ్యగర్వమునఁ గన్నుగానక దుర్వర్తనుఁడుకాఁగ, వరరుచి విసికి శకటాలుని వెలుపలికిఁ దీయించి మంత్రిగా జేసి, తా నరణ్యమునకుఁ దపమునకై పోయెను. శకటాలుఁడు యోగానందునిపై పగసాధింపనెంచి చాణక్యుని సాయమున రాజు నేడుదినములలోఁ జంపించెను. శకటాలుఁడు పూర్వరాజతనయుఁడగు చంద్రగుప్తుని రాజుఁగావించి చాణక్యుని మంత్రిగాఁచేసి తాను తపోవనమునకుఁ బోయెను. ఇది ముద్రారాక్షసనాటకమునకుఁ బూర్వపీఠిక కావచ్చును గాని, యీ నాటకమునకు మూలమగుటకు వీలులేదు. శకటాలుఁనితోఁ బాటు వక్రనాసాదులు నందునకు మంత్రులుగా నున్నట్లు పురాణములు సూచించుచున్నవి. కాని శకటాలుని తంత్రమునకు రాక్షసుని కుట్రలకు నేమియు సామ్యము లేదు.

మఱియొక మతము. క్షత్రియప్రభుత్వము నందులతో సమాప్తమగునని పురాణములలోఁ జెప్పఁబడినది. కలియుగ ప్రారంభమున నందులు రాజులు. వారిలో సర్వార్థసిద్ధి బలపరాక్రమశాలి. అతని మంత్రులైన వక్రనాసాదులలో బ్రాహ్మణుఁడైన రాక్షసుఁడు పరమ ప్రఖ్యాతుఁడు. రాజనీతియందు దక్షుఁడు. బలపరాక్రమశాలియైన యితనిని నందుఁడధికముఁగా గౌరవించెడివాఁడు. నందరాజునకు సునంద జ్యేష్ఠమహిషి. ద్వితీయభార్యయైన మురశూద్రకులజయైనను బహుసౌందర్యశాలియై రాజునకు బహుగౌరవపాత్రమైనది. నందరాజొకమాఱు భార్యల సన్నిధి నుండఁగ నొక ఋషి కాతిథ్యమిచ్చి, యతని పాదప్రక్షాళిత తోయమును రాణుల శిరసులపైఁ జిలుకఁగ నందు తొమ్మిది బిందువులు సునందమీఁద, నొక్కబిందువు మురమీఁద పడఁగ,ముర దానిని బహుగౌరవాదరములతో స్వీకరింప, ఋషి యందులకు మిక్కిలి సంతసించెను. మురసకల సద్గుణోపేతుఁడైన యొకతనయు మౌర్యు నను వానిని గాంచెను. సునంద యొక మాంసపుముద్దను ప్రసవింపఁగ రాక్షసామాత్యుఁడు దానిని తొమ్మిది

భాగములు చేసి తైలపాత్రియందుంచి జాగ్రత్తగా పరీక్షించు చుండఁగ నవశిశువులందుండి జనించి నవనందనులను పేరుతోఁ బెరుగుచుండిరి.

రాజు వార్ధక్యమున నవనందులకు రాజ్యమిచ్చి, మౌర్యు సేనాధ్యక్షునొనర్చి వనమునకేఁగెను. మౌర్యునకు పుత్రశతము గల్గెను. అందులోఁ చంద్రగుప్తుఁడు ప్రశస్తుఁడు. గుణములందు మౌర్యపుత్రులు నందులను మించిరి. అందుచే నందు లసూయచెంది మౌర్యుని సపుత్రకునిగా నొక భవనమునకుఁ బిలిచి వారిని బంధించిరి. ఆకాలమున సింహళరాజు నందరాజునొద్ద కొక విచిత్రి లాక్షాసింహము నొకబోనులోనుంచిపంపి, యాబోనుతలుపు తీయకయే యందలి భయంకర సింహము పాఱిపోవునట్లు చేయఁగలవాఁడు మేధావిగ పరిగణింపఁ బడునని సందేశమంపెను. నందులు బుద్ధిమాంద్యమున నిందలి చమత్కారమును గ్రహింపలేక పోయిరి. ప్రాణావశిష్టుడైన చంద్రగుప్తుఁడు తన్ను బ్రతికించుచో నాపనికిఁ బూను కొనెదనని చెప్పి, యొక యినుపచువ్వను గాల్చి సింహమును గ్రుచ్చగానే యందలి లక్క కరిగిపోయి సింహము మాయమయ్యెను. నందులు చంద్రిగుప్త నాశనమును గోరినను దమ నియమానుగుణముగ వానిని చెఱనుండి బైటికిఁ దీసి బ్రతుకనిచ్చిరి. చంద్రగుప్తుఁడు సకలరాజ లక్షణోపేతుఁడై ధైర్యసాహసవంతుఁడగుట నందుల కసూయాజనకమై వానిని గడతేర్ప వేచియుండిరి.

ఒకనాఁడు ధర్భాంకురముచే బాధితుఁడై కుపిత చాణక్యుఁడు దానిని దగ్ధముసేయుచుండఁగఁ గాంచి చంద్రిగుప్తుఁడు తన కాతఁడు సాయముచేయునని విశ్వసించి వానిని శరణువేడెను. విష్ణుగుప్త నామాంకితుఁడైన చాణక్యుఁడు జ్యోతిష శాస్త్రమందు, సుపానరచిత రాజనీతి యందు కోవిదుఁడు. ఇతఁడు చంద్రగుప్తునకు నందరాజ్య మిప్పించెదనని వాగ్దానము చేసెను. ఒకనాఁడు చాణక్యుఁడాకలితో భోజనశాలకుఁబోయి పెద్దలు గూర్చుండు పీటయందుఁ గూర్చుండఁగ, విధిప్రేరితులైన నందులు వానినొక పామరునిగ నెంచి వానిఁ గేశములుబట్టి గెంటించిరి. మంత్రులు వారించినను లాభము లేకపోయెను. అంత చాణక్యుఁడు కుపితుఁడై నంద

నాశనము గావించినఁగాని తనకేశములు ముడవనని ప్రతినపట్టి నగరు వెడలిపోయెను. దురదృష్టవంతులైన నందు లాతని కోపశాంతిసేయ యత్నింపరైరి.

చంద్రగుప్తుఁ డింక నందులఁగూర్చి నిర్భయుఁడై చాణక్యుని వెంబడించెను. చాణక్యుఁడు నందవధార్థమై కృత్రిమోపాయాన్వేషియై తనస్నేహితుఁడైన యిందుశర్మను క్షపణక వేషముధరింపఁజేసి రాక్షసుని వానియనుచరులను వంచించుటకై పంపి, మ్లేచ్ఛరాజైన పర్వతకుని కర్థ రాజ్యమిత్తునని యాశబెట్టి, కుసుమపురముపై దండెత్తునట్లు చేసెను. రాక్షసమంత్రి బలపరాక్రమములపై విశ్వసించి నందులు యుద్ధము చేసి పరాజయులై, మౌర్యుఁజంప ప్రయత్నించియు విఫలులై, చాణక్య క్రోధాగ్నిలో పర్వతుని సాయమున నందులందరు మరణించిరి. రాక్షసమంత్రి నిరాశచెంది, వృద్ధరాజైన సర్వార్థసిద్ధిని పాఱిపోవునట్లు చేసి, రాజనగరమును శత్రువులవశముచేసెను. రాక్షసప్రేరితమైన విషకన్యను చంద్రగుప్తునికి బదులుగా చాణక్యుఁ డర్ధరాజ్యమునకు యోగ్యుఁడైన పర్వతునిపై ప్రయోగించి, యతనిని జంపించి, యీవార్త యతని పుత్రుఁడైన మలయకేతువునకుఁ జేరునట్లుజేసి, బెదిరించి యతఁడు పాఱిపోవునట్లు చేసెను.

రాజనగరము తన వశమందున్నను నది నందమిత్రి పూర్ణమగుట వెంచి స్వీకరింప చాణక్యుఁడు తొందరపడలేదు. రాక్షసుఁ డీయవకాశమును దీసికొని దారువర్మాదుల సాయమునఁ జంద్రగుప్తు వధింప ప్రయత్నింపగా, చాణక్యుఁడు వానినెల్లగుర్తించి యాప్రయత్నములను విఫలము చేసెను. పర్వతక సోదరుఁడైన వైరోచకుని తనసోదరుని రాజ్యభాగమిచ్చు మిషచే నిల్పి చాణక్యుఁడు,నగరప్రవేశము సేయునపుడు వానిని దారువర్మ దారుణ కృత్యములకుఁ బలియొనర్చి యాబెడద వాపుకొనెను. వానప్రస్థుఁడైన సర్వార్థసిద్ధిని మాయోపాయమున కౌటిల్యుండు వధించెను. ఈ వార్తవిని రాక్షసుఁడు నిరుత్సాహపడి పర్వతపుత్రుఁడైనమలయకేతువును నతని పితృవధప్రతీకారము చేయుమని ప్రేరేచి, నగరజనులు చంద్రగుప్త శత్రువులనియు, వారతనికిఁ సాయపడి కౌటిల్యు ద్వేషింతురని దెల్పి, తాను సర్వవిధముల నతనికి సాయమొనర్తునని వాగ్దానముచేసి, మ్లేచ్ఛసైన్యమునకు నాయకుఁడై మౌర్యుని మీఁది దాడి వెడల సిద్ధుఁడయ్యెను.

అనుశ్రుతములగు వదంతులనుబట్టి రాక్షసుఁడు కుసుమపురమునఁ చందనదాసు గృహప్రాంతమున నుండెడివాఁడనియు, నీతని పూర్వ నామము 'సుబుద్ధిశర్మ' యనియు, నొకనాఁడు నందమహారాజున కొక క్లిష్టసమస్యరాఁగా దానిని సుబుద్ధిశర్మకుఁ దెల్పినవెంటనే యాతఁడు దానిని సమర్థింపఁగ రాజతనిని ప్రధానమంత్రి నొనర్చెననియు, పిమ్మట నతఁడు రాక్షసుఁడని పిలువఁబడుచుండెననియు జీవానందసరస్వతి దెలుపుచున్నాఁడు. భాగవతాదిపురాణములందు నందరాక్షసాదిపదములుగూడఁ గోచరమగుచున్నవి. ఇట్టి పరిస్థితులలోఁ గొందఱు రాక్షసపాత్రము కవి సృష్టియని యెంతురు. కాని కవిసృష్టియే యైనచో నమాత్యున కంత వికారనామమును గవి కల్పించునాయని సందేహము. సిద్ధార్థకుఁడుఁ నిపుణకుఁడు మొదలగు భావద్యోతకములగు నామముల గ్రహించును గాని క్రూరభావసూచకమైన రాక్షసుఁడను వికారనామమును కవి స్వీకరింపఁడు గాన రాక్షసనామాంకితుఁడు చారిత్రికపురుషుఁడై యుండవలెనని ధ్రువాపండితుని వాదము. దీనినే కాళే,కుళకర్ణి పండితు లంధానుకరణము సేయుచున్నారు. కాని యుద్ధమునందు తంత్రమునందు మంత్రి రాక్షసుఁడు రాక్షసునివంటి వాఁడగుటచే కవియే యీ నామమును భావద్యోతకమగునట్లు పెట్టియుండుటయు నసంభావ్యముకాదు. ఇదియే యసంభావ్యమగుచో నే సద్బ్రాహ్మణుఁడైనను దన పుత్రునకు రాక్షసుఁడనియు, పిశాచియనియు శైశవముననే నామకరణము సేయునా? కవియే యాతని నామసార్థక్యమును భంగ్యంతరేణ సమర్థించుచున్నాఁడు. తృతీయాంకమునందలి కృతక కలహమున చంద్రగుప్తుఁడు 'రాక్షసమంత్రినేల పరాక్రమించి నిగ్రహింపలేద'ని చాణక్యునిపై దోషారోపణపూర్వకముగాఁ బ్రశ్నింపగాఁ, గౌటిల్యుఁడు 'వాఁడు రాక్షసుఁడే పరాక్రమించితిమేని మన బలంబులఁ గొన్నిటిని చంపునని ప్రత్యుత్తరమిచ్చి యాతని రాక్షసత్వమును సమర్థించును. ఇంతమాత్రనుచే రాక్షసుఁడు చారిత్రకపురుషుఁడు గాఁడని నేను వాదింపను. కాని రాక్షసుని యునికి చరిత్రలోఁ గనుపించకపోవుచో నీ పాత్ర కవికల్పితమగుటయు సుసంభావ్యమే. ఇందలి ప్రధానకథ చారిత్రిక విషయములనుండి గ్రహింపఁబడియుండవచ్చును. నందచక్రవర్తి చాణక్యప్రేరణమున వధింపఁబడుటయు, రాక్ష

సుఁడు సర్వార్థసిద్ధిని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టుటయు, చాణక్యుఁడు సర్వార్థసిద్ధిని జంపించి చంద్రగుప్తుని రాజుచేయుటయు, రాక్షసుఁడు పర్వతకుని చంపించుటయు, చివరకు రాక్షసచంద్రగుప్తుల మైత్రిని చాణక్యుఁడు గూర్చుటయు చారిత్రాత్మకములై యుండవచ్చును. మిగిలిన యుభయమంత్రుల రహస్యచారుల వ్యాపారములు, రాక్షసుఁడు దన భార్యను చందనదాసు నింట దాఁచుట, చందనదాసునకు మరణశిక్ష విధించుట, యంగుళీయక విషయము, శకటదాసుని మరణదండనము, వాని రక్షణమును, నగలమ్ముట, రాక్షసుఁడు ముద్రచే సాధింపఁబడుట, చాణక్య చంద్రగుప్తుల కృతక కలహము, మలయకేతువు రాక్షసుని మంత్రి పదమునుండి తొలగించుట మొదలైన వన్నియు కవికల్పితములు గావచ్చును.

నాటక కథాసంగ్రహము:— ప్రథమాంకమున చాణక్యుఁడు నందులపైఁ దనకుఁ గల ద్వేషమును బ్రకటించి, తానే చంద్రగుప్తునకు మంత్రిగా నుండుట కిచ్ఛగింపక, రాక్షసుని శక్తి సామర్థ్యములకుఁ బూర్తిగా సంతృప్తి చెంది, యతనిని తన రాజునకు మంత్రి చేయ నిశ్చయించెను. అంతఁ దన చారుఁడైన నిపుణకుఁడు ప్రవేశించి, బౌద్ధ సన్యాసియైన జీవసిద్ధియు – యథార్థమునకుఁ దన భృత్యుఁడు –, రాక్షస లేఖకుఁడైన శకటదాసును, రాక్షస కుటుంబమును దన యింట రక్షించుచున్న చందనదాసుఁడను, రత్నాల వర్తకుఁడును రాజశత్రువు లని తెల్పి, తాను యమపటములను జూపుచుండగాఁ జూచుటకై బైటకుఁ బోవుచున్న రాక్షసమంత్రి పుత్రుని వెనుకకు లాగుచున్న రాక్షస పత్ని చేతినుండి జారిపోయిన రాక్షస నామాంకితమైన యంగుళీయకమును దాను గ్రహించితినని చెప్పి, దానిని చాణక్యున కీయఁగనే దాని మూలమున రాక్షసుని సాధింప నిశ్చయించును. చాణక్యుఁడొక లేఖను వ్రాసి, దానిని శకటదాసు స్వహస్తమున రచియింపించి, దానికి రాక్షసుని ముద్ర వేయును. తర్వాత శకటదాసు రాజద్రోహి యని బంధింపఁబడి, చాణక్యచారుఁడైన సిద్ధార్థకునిచే నతఁడు రక్షింపఁబడినట్లు చేసి యిద్దరు రాక్షసమంత్రిని చేరుటకుఁ బోవుదురు. జీవసిద్ధికూడ రాజద్రోహి యను మిషచే దేశమునుండి బహిష్కరింపఁబడి రాక్షసుని చేరుటకు

అనుశ్రుతములగు వదంతులనుబట్టి రాక్షసుఁడు కుసుమపురమునఁ జందనదాసు గృహప్రాంతమున నుండెడివాఁడనియు, నీతని పూర్వ నామము 'సుబుద్ధిశర్మ' యనియు, నొకనాఁడు నందమహారాజున కొక క్లిష్టసమస్యరాఁగా దానిని సుబుద్ధిశర్మకుఁ జెప్పినవెంటనే యాతఁడు దానిని సమర్థింపఁగ రాజతనిని ప్రధానమంత్రి నొనర్చెననియు, పిమ్మట నతఁడు రాక్షసుఁడని పిలువఁబడుచుండెననియు జీవానందసరస్వతి దెలుపు చున్నాఁడు. భాగవతాదిపురాణములందు నందరాక్షసాదిపదములుగూడ గోచరమగుచున్నవి. ఇట్టి పరిస్థితులలోఁ గొందఱు రాక్షసపాత్రము కవి సృష్టియని యెంతురు. కాని కవిసృష్టియే యైనచో నమాత్యున కంత వికారనామమును గవి కల్పించునాయని సందేహము. సిద్ధార్థకుఁడుఁ నిపుణకుఁడు మొదలగు భావద్యోతకములగు నామముల గ్రహించును గాని క్రూరభావసూచకమైన రాక్షసుఁడను వికారనామమును కవి స్వీకరింపఁడు గాన రాక్షసనామాంకితుఁడు చారిత్రికపురుషుఁడై యుండవలెనని ధ్రువాపండితుని వాదము. దీనినే కాళే,కులకర్ణి పండితు లంధానుకరణము సేయుచున్నారు. కాని యుద్ధమునందు తంత్రమునందు మంత్రిరాక్షసుఁడు రాక్షసునివంటి వాఁడగుటచే కవియే యీ నామమును భావద్యోతక మగునట్లు పెట్టియుండుటయు నసంభావ్యముకాదు. ఇదియే యసంభావ్య మగుచో నే సద్బ్రాహ్మణుఁడైనను దన పుత్రునకు రాక్షసుఁడనియు, పిశాచియనియు శైశవముననే నామకరణము సేయునా? కవియే యాతని నామసార్థక్యమును భంగ్యంతరేణ సమర్థించుచున్నాఁడు. తృతీయాంకము నందలి కృతక కలహమున చంద్రగుప్తుఁడు 'రాక్షసమంత్రినేల పరాక్ర మించి నిగ్రహింపలేద'ని చాణక్యునిపై దోషారోపణపూర్వకముగాఁ బ్రశ్నింపఁగాఁ, గౌటిల్యుఁడు 'వాఁడు రాక్షసుఁడే' పరాక్రమించితిమేని మన బలంబులఁ గొన్నిటిని చంపునని ప్రత్యుత్తరమిచ్చి యాతని రాక్ష సత్వమును సమర్థించును. ఇంతమాత్రముచే రాక్షసుఁడు చారిత్రకపురు షుఁడు గాఁడని నేను వాదింపను. కాని రాక్షసుని యునికి చరిత్రలోఁ గనుపించకపోవుచో నీ పాత్ర కవికల్పితమగుటయు సుసంభావ్యమే. ఇందలి ప్రధానకథ చారిత్రిక విషయములనుండి గ్రహింపఁబడియుండ వచ్చును. నందచక్రవర్తి చాణక్య ప్రేరణమున వధింపఁబడుటయు, రాక్ష

సుఁడు సర్వార్థసిద్ధిని సింహాసనమునఁ గూర్చుండఁబెట్టుటయు, చాణక్యుఁడు సర్వార్థసిద్ధిని జంపించి చంద్రగుప్తుని రాజుచేయుటయు, రాక్షసుఁడు పర్వతకుని చంపించుటయు, చివరకు రాక్షసచంద్రగుప్తుల మైత్రిని చాణక్యుఁడు గూర్చుటయు చారిత్రాత్మకములై యుండవచ్చును. మిగిలిన యుభయమంత్రుల రహస్యచారుల వ్యాపారములు, రాక్షసుఁడు దన భార్యను చందనదాసు నింట దాఁచుట, చందనదాసునకు మరణశిక్ష విధించుట, యంగుళీయక విషయము, శకటదాసుని మరణదండనము, వాని రక్షణమును, నగలమ్ముట, రాక్షసుఁడు ముద్రచే సాధింపఁబడుట, చాణక్య చంద్రగుప్తుల కృతక కలహము, మలయకేతువు రాక్షసుని మంత్రి పదమునుండి తొలగించుట మొదలైన వన్నియు కవికల్పితములు గావచ్చును.

నాటక కథాసంగ్రహము:— ప్రథమాంకమున చాణక్యుఁడు నందులపైఁ దనకుఁ గల ద్వేషమును బ్రకటించి, తానే చంద్రగుప్తునకు మంత్రిగా నుండుట కిచ్చగింపక, రాక్షసుని శక్తి సామర్థ్యములకుఁ బూర్తిగా సంతృప్తి చెంది, యతనిని తన రాజునకు మంత్రి చేయ నిశ్చయించెను. అంతఁ దన చారుఁడైన నిపుణకుఁడు ప్రవేశించి, బౌద్ధ సన్యాసి యైన జీవసిద్ధియు — యథార్థమునకుఁ దన భృత్యుఁడు —, రాక్షస లేఖకుఁడైన శకటదాసును, రాక్షస కుటుంబమును దన యింట రక్షించుచున్న చందనదాసుఁడను, రత్నాల వర్తకుఁడును రాజశత్రువు లని తెల్పి, తాను యమపటములను జూపుచుండగాఁ జూచుటకై బైటకుఁ బోవుచున్న రాక్షసమంత్రి పుత్రుని వెనుకకు లాగుచున్న రాక్షస పత్ని చేతినుండి జారిపోయిన రాక్షస నామాంకితమైన యంగుళీయకమును దాను గ్రహించితినని చెప్పి, దానిని చాణక్యున కీయఁగనే దాని మూలమున రాక్షసుని సాధింప నిశ్చయించును. చాణక్యుఁడొక లేఖను వ్రాసి, దానిని శకటదాసు స్వహస్తమున రచియింపించి, దానికి రాక్షసుని ముద్ర వేయును. తర్వాత శకటదాసు రాజద్రోహి యని బంధింపఁబడి, చాణక్యచారుఁడైన సిద్ధార్థకునిచే నతఁడు రక్షింపఁబడినట్లు చేసి యిద్దరు రాక్షసమంత్రిని చేరుటకుఁ బోవుదురు. జీవసిద్ధికూడ రాజద్రోహి యను మిషచే దేశమునుండి బహిష్కరింపఁబడి రాక్షసుని చేరుటకు

బోవును. చందనదాసు రాక్షసుని కుటుంబమును రక్షించుచున్నందులకై చెఱయం దుంచఁబడెను. కడకు భాగురాయణాదు లన్యామిషలచే దేశమును వదలిపోయిరని చాణక్యుఁడు తెలిసికొని, తన తంత్రము సానుకూలమైనందులకు లో సంతోషించును. ఈవిధముగా చాణక్య చారులందఱు రాక్షసునిఁ గొలుచుటకై పోయిరి.

ద్వితీయాంకమున రాక్షసుఁడు ప్రతి తంత్రములఁ బన్నును. పాములవాని వేషమును ధరించిన విరాధగుప్తుఁడను రాక్షస చారుఁడు మంత్రితో నతని ప్రయత్నములన్నియు విఫలములైన విధమును వర్ణించును. జీవసిద్ధి దేశమునుండి వెడలఁగొట్టఁబడె ననియు, శకటచందన దాసులు వధింపఁబడ నున్నారని విరాధగుప్తుఁడు రాక్షస మంత్రితోఁ దెల్పుచుండగా, సిద్ధార్థకుఁడు శకటదాసుని తీసికొని రాక్షసుని యొద్దకు వచ్చును. మిత్రప్రాణములను సిద్ధార్థకుఁడు రక్షించెనని యెఱిఁగి, తన మేన ధరించినట్టియు, మలయకేతువు తనకు కానుకగ నొసంగిన యాభరణము నతనికి బహుమాన మొసంగఁగ, సిద్ధార్థకుఁడు దానినొక పెట్టెలో పెట్టి రాక్షసుని ముద్రవేసి, దొరికినదనిచెప్పి యా యంగుళీయకమును రాక్షసుని కిచ్చివేసి, యతని కొలువుననే యుండెను. పిమ్మట చంద్రగుప్తుఁడు చాణక్యుని చేష్టలకు విసికి యతని ద్వేషింప నారంభించె ననియు విరాధగుప్తుఁడు రాక్షసునికిఁ దెల్పెను. అంత చాణక్య వేగుల వాండ్రు కొన్ని (పర్వతకుని) నగలను విక్రయించుటకై రాక్షసుని యొద్దకు రాఁగ శకటదాసుని పంపి వానిని కొనునట్లు చేయును.

తృతీయాంకమున చాణక్య చంద్రగుప్తుల కపట కలహము వసంతోత్సవ నిరాకరణమునకై రాజు చాణక్యుని నిందించి కలహింపఁగ, చాణక్యుఁడు మంత్రిత్వమును వదలుకొని పోవును. ఇదంతయు యథార్థమని తలఁచి రాక్షసుఁడు మోసపోవును.

చతుర్థాంకమందు భాగురాయణుఁడు రాక్షస మలయకేతువులకు భేదతంత్రమును పన్నును. రాజును స్వతంత్రముగ తాను సేవింతును గాని రాక్షసుని ద్వారా కాదనియు, రాక్షసుఁడు చాణక్యునకు విరోధి గాని చంద్రగుప్తునకుఁ గాదనియు, చాణక్యుఁ డడ్డులేనిచో రాక్షసుఁడు

చంద్రగుప్తుఁ జేరునని విషబీజము చల్లగనే మలయకేతువు నిర్విణ్ణుఁడగును. పిమ్మట నతఁడు చాణక్య చంద్రగుప్తుల కలహమును దెల్పు చారునితో రాక్షసుఁడు మాట్లాడుచుండ, వెనుకనుండి విని మంత్రిని ననుమానించి తనకుఁ గల్గిన పూర్వాభిప్రాయమును దృఢపఱచుకొనెను. రాక్షసునితో మలయకేతువు సంభాషించు సమయమున, చంద్రగుప్తునిపై దాడి వెడలుట కిష్టము లేనట్లు రాజు ప్రవర్తించెను. అంత జీవసిద్ధి రాక్షసుని కలిసికొనినపుడు తన్ను దండయాత్రకై సుదినమును దెల్పుమనఁగ జీవసిద్ధి వికారముగ మాట్లాడును.

పంచమాంకారంభమున జీవసిద్ధి ప్రవేశించి, నగరమునుండిపోవు వారి కధికారముద్రనిచ్చు పదవియందున్న భాగురాయణుని సమీపించి, పర్వతేశ్వరుని వధలోఁ దన్నుపయోగించుకొనిన రాక్షసునకుఁ దాను భయపడుచున్నానని తెల్పి, నగరునుండి పోవుటకు ముద్ర నడుగును. ఈమాటలన్నియు వెనుకనుండి మలయకేతువు విని మండిపడును. పర్వతకుని చాణక్యుఁడే చంపెనని నిశ్చయించిన మలయకేతువునకు భాగురాయణుఁడు, రాక్షసకృత్యమును తాత్కాలికముగ సమర్థించి చెప్పి సంతృప్తి పఱచి ప్రతీకారము చేయ మానిపించెను. అంత ముద్ర లేకుండ నగరు నుండి పాఱిపోఁదలఁచుకొనిన సిద్ధార్థకుఁడు పట్టుబడి, కొట్టబడినవాఁడై (ప్రథమాంకమున శకటదాసహస్తలిఖిత చాణక్య) లేఖతో రాక్షసునివద్ద నుండి చంద్రగుప్తు నొద్దకు బోవుచుండెనని చెప్పుచు, మలయకేతువు రాక్షసునకిచ్చిన నగను, శకటదాసుని రక్షించి తెచ్చిన సిద్ధార్థకుని కివ్వఁగ దాని నొక పెట్టెయందు పెట్టి రాక్షసముద్రచే ముద్రించినదానిని, చంక నుండి జారవిడిచి, కొంత వాగ్రూపమైన వార్త నిట్లు 'సహాయమునకై వచ్చిన రాజులు మలయకేతువును జంపి యతని యాస్తిని గ్రహింతురనియు, చంద్రగుప్తుడు చాణక్యుని మంత్రిపదవినుండి తీసివేసి తన్ను నియమింపవలయునని రాక్షసుఁడు గోరినట్లు' తెల్పును. పిమ్మట మలయకేతువు రాక్షసమంత్రిని కలిసికొనఁగ, రాజును యుద్ధయాత్రకు బయలు దేరుమని మంత్రి చెప్పి, సహాయమునకు వచ్చిన రాజులందఱు నతనిచుట్టు నుందురని తెల్పును. అంత సిద్ధార్థక సందేశమును సమర్థింపుమని మలయకేతువు మంత్రి నడుగఁగా నిశ్చేష్టుఁడై, వైరుల కృటయని చెప్పఁగల్గియు,

ముద్రయు శకటదాస హస్తాక్షరముల లేఖను గాదనలేక, శకటుని శంకింప లేకపోయెను. దీనికిఁదోడు ద్వితీయాంకమున చాణక్యాచారుల యొద్దనుండి కొనిన పర్వతుని నగలను ధరించికొనివచ్చిన రాక్షసునిఁ జూచి మలయకేతువుసందేహము దృఢపడెను. కోపోద్రిక్తుఁడై మలయకేతువు తన సహాయమునకై వచ్చిన రాజుల నందఱను జంప నానతిచ్చి, రాక్షసుని క్షమింపఁగ,నతఁడు చివఱకుఁ జేయునదేదియు లేక చందనదాస రక్షణార్థము కుసుమపురమునకు రహస్యముగఁ బోవును.

షష్ఠాంకమున రాక్షసుఁడు పాటలీపుత్ర జీర్ణోద్యానమునఁ దన ప్రయత్నములు విఫలమొందుటకై పరితపించుచుండగ, చాణక్యచారుఁ డొకఁ డచట చందనదాసవధకైఁ యాత్మవధ గావించుకొను మిత్రునికై తా నురిపోసికొని చావసిద్ధముగా నుండుటను గాంచి, యతనితో తన్నెఱింగించుకొని, చందనదాసరక్షణార్థము శస్త్రపరిత్యాగముగూడ చేసి బయలుదేరును.

పంచమాంకమున చందనదాసు వధ్యస్థానమునకుం గొనిపోఁబడఁగ, భార్యా పుత్రాదులు విలపించుచుందురు. అంత రాక్షసుఁడు రక్షింప నచ్చటకు వచ్చును. పిమ్మట చాణక్యచంద్రగుప్తు లచ్చట కరుగుదెంచి రాక్షసుఁడు చంద్రగుప్త మంత్రిత్వ మంగీకరించినఁ గాని చందనదాసు బ్రతుకడని తెల్పఁబడగనే, విధిలేక మిత్రప్రాణరక్షణార్థమై యందుల కంగీకరించును. మలయకేతువు బంధితుఁడై తీసికొనిరాఁగ రాక్షసుఁడు వాని రాజ్యము వానికిచ్చి క్షమించును. చందనదాసు బహూకరింపఁబడును. చాణక్యుఁడు కేశబంధమొనర్చికొనును.

ఇందలి కథ యుభయమంత్రుల యనేక తంత్రములతోఁ గూడుకొని యుండుటచేఁ గళాపూర్ణోదయ కథవలె నతిక్లిష్టమై యుండి, చాణక్యతంత్రమువలె దుర్గ్రాహ్యముగ నున్నది. ప్రతిజ్ఞా పరిపూర్తికై పర్వతేశ్వరుని సాయమున చాణక్యుఁడు నందుల నందఱిని సంహరించి, చంద్రగుప్తునిపై వాత్సల్యముచే నాతనిని రాజ్యమున కభిషిక్తుని జేసెను. చంద్రగుప్త రాజ్యమును సురక్షితముగఁ జేయుటకై నందుల మంత్రియైన రాక్షసుని చంద్రగుప్తునకు మంత్రిగాఁ జేయఁ బ్రయత్నించుటే యీ నాటకమందలి ప్రధాన కథ. రాక్షసుఁడు నందులపై నపారమైన భక్తి

గల వాఁడగుటచే నందవంశనిర్మూలము గావించిన చాణక్యునితోఁ బాటు చంద్రగుప్తునిగూడ సంహరింప విశ్వప్రయత్నము సేయుచు, పర్వతకుఁడు విషకన్యచేఁ జంపఁబడగా నాతని తనయుడఁగు మలయకేతువు నాశ్రయించి, తన్మూలమున కార్యము సాధింపఁ దలఁచెను. అందుచే రాక్షసుఁడు చంద్రగుప్తున కెట్లు మంత్రియగును? బలపరాక్రమశాలియు, మహామేధావియు, తంత్రజ్ఞుఁడు నగు రాక్షసమంత్రి యంత తేలికగా జయింపఁబడగలఁడా? ఎంతయో కష్టపడి చాణక్యుఁడు రాక్షసుని జయించి నను నతఁడు గర్భశత్రువైన చంద్రగుప్తునియందు విశ్వాసముతో మంత్రిగా శరించి రాజునకు హానిసేయక యుండఁగలఁడా? నందుల మీఁది భక్తిచేఁ జంద్రగుప్తుని మంత్రియైన తర్వాత రాజునకు ద్రోహము సేయఁడా? నీతిశాస్త్రదక్షుఁడైన చాణక్యుఁడు 'శత్రుశేషం ఋణశేష మగ్నిశేషం న శేషయేత్' తను స్వల్పవిషయము నెఱుఁగఁడా? ఈ ప్రశ్నల కన్నింటికి సమాధాన ముభయమంత్రి శీలపరిశీలనమే యిచ్చును. వీరిద్దరి శీలవిమర్శనమే ముద్రారాక్షస నాటకవిమర్శన మంతయు.

పాత్రపోషణము:—ఈనాటకమునపరస్పరభిన్నశీలముగల కొన్నిజంటల పాత్రలఁ బ్రవేశపెట్టి వారిమూలమున కథాసంధానము రమణీయముగ విశాఖదత్తకవి యొనరించినాఁడు. వీరివివిధచర్యలన్నియు రాక్షససంగ్రహ మను నొక పరమలక్ష్యమునం దేకాగ్రత వహించియున్నవి. ఈ నాటక మున రాక్షస చాణక్యులు, చంద్రగుప్త మలయకేతువులు, చందన దాసేందుశర్మలు, భాగురాయణ సిద్ధార్థకులు ముఖ్యులు. ముద్రారాక్షస నాటకమును సుసర్ల యనంతరావుగారు, పాలెపు గోపాలంగారు, తిరుపతి వేంకటేశ్వరకవులు నాంధ్రీకరించిరి. అందులో తిరుపతి వేంకటకవుల తెలుఁగుచేత స్వతంత్రరచనవలె నడచి, మిగిలినవా రిద్దరి భాషాంతరీ కరణముకన్న మేలుగనుండుటచే ప్రస్తుతము వారి యాంధ్రీకరణమే గ్రహించి యందుండియే యుదాహరణముల నిత్తును.

రాక్షసుఁడు:— ఈతఁడు నాటకమున ప్రతినాయకుడు మహా మేధావియైన మంత్రి, బ్రాహ్మణ కుటుంబి, ప్రౌఢవయస్కుఁడైన యనుభవశాలి. ధిషణావైభవమున నన్వీక్షకియం దప్రతిముఁడు. మహా

తంత్రజ్ఞుఁడు. ఈతని శత్రువగు చాణక్యుఁడే యితని గుణములకుఁ దనలో మెచ్చుకొని సంతోషించును.

చాణ:—(రాక్షసునిఁ జూచి, సంతోషముతోఁ దనలో) ఈతఁడే మహాత్ముఁడగు నమాత్య రాక్షసుఁడు. ఈసూక్ష్మబుద్ధి,

తే॥ గీ॥ మిగుల జాగ్రత్తగా నుండఁదగిన గొప్ప। పన్నుగడ లెన్నియేనియు పన్ని యీ
మహానుభావుఁడుగాదె యాయాసపెట్టె। మౌర్యసైన్యంబుఁ జాణక్యమతియుఁగూడ॥ అం.7.

ఇంతేకాక యితఁడు శస్త్రోపజీవి. మహాబలపరాక్రమ సంపన్నుఁడు. నంద మహారాజీతని యుద్ధమునకుఁ బురికొల్పుకీతిని బట్టి రాజున కీతనిపై నెట్టి గొప్ప యభిప్రాయము గలదో విశదమగును.

ఉ॥ 'జలదవినీలమైన గజసంతతి మాపఁగ నీవ పోవుమా
జలధితరంగజాల మనఁజాలుతురంగము నీవ మాపు మా
బలమును నీవ కూల్పు' మని పల్కురు రాక్షసులున్నయట్లు నా
కలఘు దయాస్వభావమున నానతి యిచ్చిన వాఁడవయ్యయో॥ అం. 2

కృత్రిమకలహాంకమున చంద్రగుప్తుఁడు చాణక్యునితో రాక్షసుని పరాక్రమించి యేల నిగ్రహింపలేదని యడుగఁగా 'నతఁడు రాక్షసుఁడే. పరాక్రమించితిమేని మన బలంబులఁ గొన్నింటిని జంపు' ననియుపదేశము సేయును చాణక్యుఁడు. శత్రువులే యితని పరాక్రమమునుగూర్చి యిట్టి యోగ్యతాపత్రము లిచ్చుచుండ నింకేమి కావలయును. ఈతఁడు స్వార్థరహితుఁడు, స్వామిభక్తి యితని కపారము. తన స్వామియైన నంద మహారాజు సకుటుంబముగా నశించినను నాతనిపై భక్తిచే నాతనిశత్రువులఁ జంపి స్వర్గమందున్న రాజు నానంద పెట్టఁబ్రయత్నించును.

సీ॥ అంతరించినను నందాన్వవాయంబునఁ బూజ్యభావము లేకపోయికాదు
అన్యరాజుల మంత్రినై యధికైశ్వర్య లాభంబుగాంచఁ దలంచికాదు,
అరిరాజులు వధింతురని భీతి నీ పాడుజీవంబుపైఁ దీపిఁజెందికాదు,
కడచిపోయిన దానికంటె నెక్కువ పేరు గౌరవంబు లభింప గోరికాదు,
గీ॥ శత్రువులనెల్ల జంపిన స్వర్గమేగి
యున్న యొడయండు ముదమొందు నన్నయాశ
చేత నొరులకు దాస్యంబు సేయుచుండె
రాక్షసామాత్యుఁడును నత్యపేక్షఁ దవిలి. అం. 2

ఈతని స్వామిభక్తికి శత్రువులు గూడ ముక్కుపై వ్రేలు వేసి కొని యాశ్చర్య చకితులైరి. చాణక్యుఁడే యితని నిట్లు ప్రశంసించును, "మంత్రీ, రాక్షసా, మంచిది సెబాసు శ్రోత్రియుఁడా సెబాసు, మంత్రి బృహస్పతీ బాగు.

ఉ॥ కొందఱు ద్రవ్యకాంక్ష మెయిఁగొల్తురు రాజుల ద్రవ్యమున్నచో
గొందఱు రాజులాపదలఁ గూరిననాఁడు భవిష్యదాశచే
నుందురు వీడకుండ; నిటు లుర్వికిఁ బాసిన రాజులందు నీ
చందము భక్తిఁ జూపఁగల సాధులు మాత్రము దుర్లభుల్గదా॥ అం. 1

ఇట్టి స్వామిభక్తిపరాయణుఁడు కృతజ్ఞుఁడునుగనుకనే తాను స్వల్పకాలము కొలిచిన మలయకేతువు చివరకు బద్ధుఁడై రాక్షసుని దయకుఁ బాత్రుఁడు కాఁగ వానిని క్షమించి వదలివేయును. ఇట్టి సుగుణములు గలవాఁడగుటచేతనే యీతనిని చంద్రగుప్తునకు మంత్రిగాఁ జేయ సంగ్రహించుటకై చాణక్యుఁడు విశ్వప్రయత్నము సేయును. ఇట్టి సత్పురుష లక్షణోపేతుఁ డగుటచేతనే చంద్రగుప్తుని మంత్రియైన పిమ్మటకూడ నాతనికి ద్రోహము సేయఁడని చాణక్యునకు గొప్ప విశ్వాసము. లేకయున్న చాణక్యుడంతవాఁ డీ ప్రయత్నముచేయునా? రాక్షసుని తత్త్వమును బూర్తిగా నెఱింగిన సూక్ష్మబుద్ధి చాణక్యుఁడు గదా. కాన రాక్షససంగ్రహార్థము కౌటిల్యుఁడు చతురుపాయముల వినియోగించును. రాక్షసుఁడు గొప్ప స్వామిభక్తుఁడగుటచే సామదాన ములు చాణక్యునకుఁ గార్యకారులు గావు. దండోపాయ ముపయోగించు చో, రాక్షసుఁ డసహాయ శూరుఁడగుటచే శత్రుబలమును నాశనము చేయును, లేదా తాను చచ్చును, గాని పట్టువడఁడు.

గీ॥ వేరమువహించి యతనిఁ జంపితిమయేని పిదప దొరకునే యంత తెల్విగలమంత్రి? ।
వదల దావ్యధయును భీవద్వర్గములతు వనకరింబోలెఁ బట్టంగవలయుఁగాన ॥ అం 8

చదరంగమున రాజునువలె శత్రువును జంపకుండ జీవముతోఁబట్టి యీతని యాట కట్టించవలెను. కాన రాక్షససంగ్రహార్థము చాణ క్యుఁడు భేదోపాయ ముపయోగించి బుద్ధిబలముచే నతని జయింప

మైనది. మఱియు రాక్షసుని శత్రునాశనోపాయములు చాణక్యుని బుద్ధి ప్రభావముచే వ్యర్థమగుటేగాక యాతని మిత్రవధోపాయములుగ గూడ పరిణమించినవి.

ఇంతవఱకు చాణక్యుఁడు సేయవలసినపనులలో మొదటిదగు చంద్రగుప్తుని, శత్రువుల కుతంత్రములనుండి రక్షించుటయందు సఫలీకృతుఁడయ్యెను. ఇంక రెండవదియగు రాక్షస సంగ్రహామునందు పూర్వభాగ మాతని సైన్యనాశనముచేసి, మలయకేతురాక్షసులకు భేదము గల్పించి, మలయకేతువు రాక్షసుని త్యజించునట్లు చేయుట. ఉత్తరార్థమున రాక్షసుని సందిగ్ధావస్థలోఁ బెట్టి చంద్రగుప్తు నమాత్యపదమును స్వీకరించునట్లు చేయును. ఈవిధమగు తన పరాజయమునకుఁ రాక్షసుఁడే యెంతవఱకు కారకుఁడో విచారింతము.

ఈతని కృతజ్ఞతాపూర్వకదుఃఖమే యితని పరాజయమునకు కొంత కారణమైనది. నందవంశ నాశన మితని మనస్సును గ్రుంచివేయఁగ కృతజ్ఞతాపూర్వక ఋణ మొకవైపునను, విచార మొకవంకను వేధించుచుండ నాతని కాలోచనాశక్తి యెట్లు ప్రసరించును? భాగురాయణాదుల కౌటిల్య మతఁ డెట్లు గుర్తింపఁగలఁడు.

రాక్ష :—(కన్నీరు తెచ్చుకొని) అక్కటా! యెంతకష్ట మెంతకష్టము !

చ॥ నయమును విక్రమంబు సుగుణంబులు గల్గియు నేఁడు యాదవా
న్వయమునుఁ బోలి దైవగతి నందకులంబు వినాశమొంద ఱే అం. 2
యియు బవలుం బ్రశోకమున నీగతి బ్రుంగుమనంబుతోడ న
య్యయో యిటుసేయబూనితిఁ బ్రయత్నముభిత్తిక లేనిఁ వ్రాఁతకున్॥అం2.

దుఃఖమును దాఁచుకొను మనోనిగ్రహ మీతనికి లేకపోయినది. కావున శత్రుకృత ప్రతీకారమునకు సర్వవిధములఁ బ్రయత్నించుచు శత్రుపక్షమును త్యజించినవారినెల్ల నీతఁడు గ్రహించెను గాని వారి త్రికరణశుద్ధిని పరీక్షించ లేదు. ఇందుచే యథార్థమైన శత్రువు లెవరో గుర్తింపలేకపోయినాఁడు. చివరకు శత్రుచేష్టితములచేఁ బ్రాణమిత్రుఁడైన శకటదాసుని గూడ ననుమానింపలేకపోయెను. మఱియు నితఁడు జీవసిద్ధ్యాదులకుఁ దన రహస్యము లన్నియుఁ దెలిపివేయుటచే గూఢవ్యాద

నెంచెను. అందుచే 'నాచేతనే రాక్షసుఁడు జయింపఁ బడవలయు' నని నిశ్చయించి చతురుపాయములలో భేదోపాయమును బ్రయోగించెను. కాని రాక్షసుఁడు తంత్రముచేనైనను చేలికగ వశ్యుఁడు కాఁజాలఁడు.

రాజ్యతంత్రశక్తియందు రాక్షసుఁడు చాణక్యునకుఁ దీసిపోవు వాఁడు కాఁడుగదా! ద్వితీయాంకప్రారంభమున విరాధగుప్తుఁ డేమను చున్నాఁడో చూడు. 'చాణక్యమతిపరిగృహీతుఁడగు చంద్రగుప్తునిం జూచిన రాక్షసుని ప్రయత్నమంతయు విఫలమైనదని తలంచెదను. మఱి, రాక్షసమతిపరిగృహీతుఁడగు మలయకేతుని గనుఁగొన్నఁ చంద్రగుప్తుని రాజ్యము పోయినట్లే యూహింపవలసియున్నది.

కదలకుండఁ జాణక్యుండుకట్టెఁ దెల్వి । త్రాళ్లచేఁ జంద్రగుప్త సామ్రాజ్యలక్ష్మిఁ
నీవలకు దానిలాగఁగా నెంచుచుండె రాక్షసుండు నుపాయకరములచేత ॥ అం. 2.

ఈవిధముగా నందరాజ్యలక్ష్మిని చెరియొకవైపు నుభయ మంత్రులు లాగుచు (Tug of war చేయుచు) న్నారు. రాక్షసుఁడు చంద్రగుప్త వధకై విషకన్యను బ్రయోగించియు, శిల్పులగు దారువర్మ బర్బర కుల సింహద్వారయంత్రతోరణముల నిర్మింపఁజేసియు, వైద్యుఁడగు నభయదత్తుని విషమునిచ్చునట్లును, ప్రమోదకుని పక్కలువేయుచు సమయమును గనిపెట్టి కార్యసాధనము చేయుటకును, భీభత్సకాదుల రాచయింటిగోడల సొరంగములం దుంచియు ననేకవిధముల చంద్రగుప్త సంచారభూములందంతటను రహస్యచారులనుంచెను. వీరిని ధనాదులతోఁ బోషించుటకై శకటదాసుని కుసుమపురముననే నియమించి బహు జాగ్రత్తగా వారివృత్తాంతములను దెలిసికొనుటకు విరాధగుప్తాది చారుల మారువేషములతో నుండ నియోగించెను. ఇట్లు తంత్రలోపమేమియుఁ జేయలేదు. ఈవిధముగ చంద్రగుప్తుఁడు హంతకుల మధ్యనుండుటచే నొకరి చేతఁగాకపోయినను మఱియొకరిచేతనైన తప్పక వధింపఁబడుట నిశ్చయ మని రాక్షసుఁడు దలఁచుట సమంజసమేకదా. ఇదంతయు సులభ సాధ్యము కాదుకదా. కాని చాణక్యుఁడు వీనియన్నింటికిఁ బ్రతీకారము సేయఁగల సూక్ష్మబుద్ధి యయ్యెను. అందుచే చంద్రగుప్తవధ యసాధ్య

మైనది. మఱియు రాక్షసుని శత్రునాశనోపాయములు చాణక్యుని బుద్ధి ప్రభావముచే వ్యర్థమగుటయే గాక యాతని మిత్రవధోపాయములుగ కూడ పరిణమించినవి.

ఇంతవఱకు చాణక్యుఁడు సేయవలసినపనులలో మొదటిదగు చంద్రగుప్తుని, శత్రువుల కుతంత్రములనుండి రక్షించుటయందు సఫలీకృతుఁడయ్యెను. ఇంక రెండవదియగు రాక్షస సంగ్రహమునందు పూర్వభాగ మాతని సైన్యనాశనముచేసి, మలయకేతురాక్షసులకు భేదము గల్పించి, మలయకేతువు రాక్షసుని త్యజించునట్లు చేయుట. ఉత్తరార్థమున రాక్షసుని సందిగ్ధావస్థలోఁ బెట్టి చంద్రగుప్తు నమాత్యపదమును స్వీకరించునట్లు చేయును. ఈవిధమగు తన పరాజయమునకుఁ రాక్షసుఁడే యెంతవఱకు కారకుఁడో విచారింతము.

ఈతని కృతజ్ఞతాపూర్వకదుఃఖమే యితని పరాజయమునకు కొంత కారణమైనది. నందవంశ నాశన మితని మనస్సును గ్రుంచివేయఁగ కృతజ్ఞతాపూర్వక ఋణ మొకవైపునను, విచార మొకవంకను వేధించుచుండ నాతని కాలోచనాశక్తి యెట్లు ప్రసరించును? భాగురాయణాదుల కౌటిల్య మతఁ డెట్లు గుర్తింపఁగలఁడు.

రాక్ష :—(కన్నీరు తెచ్చుకొని) అక్కటా! యెంతకష్ట మెంతకష్టము !

చ॥ నయమును విక్రమంబు సుగుణంబులు గల్గియు నేఁడు యాదవా
న్వయముఁనుఁ బోలి దైవగతి నందకులంబు వినాశమొందఁ జే అం. 2
యియు బవలుం బ్రశోకమున నీగతి గ్రుంగుమనంబుతోడ న
య్యరయోటుసేయబూనితిఁ బ్రయత్నముభి త్తిక లేనిప్రాఁతకున్॥ అం2.

దుఃఖమును దాఁచుకొను మనోనిగ్రహ మీతనికి లేకపోయినది. కావున శత్రుకృత ప్రతీకారమునకు సర్వవిధములఁ బ్రయత్నించుచు శత్రుపక్షమును త్యజించినవారినెల్ల నీతఁడు గ్రహించెను గాని వారి త్రికరణశుద్ధిని పరీక్షించ లేదు. ఇందుచే యథార్థమైన శత్రువు లెవరో గుర్తింపలేకపోయినాఁడు. చివరకు శత్రుచేష్టితములచేఁ బ్రాణమిత్రుఁడైన శకటదాసుని గూడ ననుమానింపలేకపోయెను. మఱియు నితఁడు జీవసిద్ధ్యాదులకుఁ దన రహస్యము లన్నియుఁ దెలిపివేయుటచే గూఢహృదయ

యుండుగూడ కాండనియుఁ దెలియుచున్నది. సూక్ష్మదృష్టి సాహిత్యాది దన లోపములను, నాత్మశక్తి దౌర్బల్యమును గుర్తింపలేక మానవప్రయత్నముకన్న దైవచేష్టితమే యెక్కువ ప్రాబల్యమని విశ్వసించును. విధి ప్రతికూలించినపుడు ధైర్యహీనుఁడగును. జీవసిద్ధిగూడ చాణక్యచారుఁడని గ్రహింపగానే 'అక్కటా, శత్రువులు నాగుండెకాయఁగూడ దీసికొనిరి కదా' యని నిర్విణ్ణుఁడగును. మలయకేతువుచేఁ ద్యజింపఁబడి యేమిచేయుటకుఁ దోఁచక దైవప్రాతికూల్యమునకు విచారించి దన దురదృష్టమున కిట్లు చింతిల్లును. మఱియు నితఁడు ధైర్యహీనుఁ డైనప్పుడు స్త్రీవలె కన్నీరోడ్చును. షష్ఠాంకమున నొంటరిగా జీర్ణోద్యానమును దొంగవలె బ్రవేశించి

రాక్షః—(కన్నీరోడ్చుచు) అహో, ఎంతకష్ట మెంతకష్టము.

సీ॥ ఆశ్రయంబెడఁబాసియడరులంజెవితానరాలచ్ఛియిఁతర గోత్రంబుఁజేరెఁ

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

గీ॥ శిరములేని శరీరంబుకరణి నుంటి, నా సదుద్యోగమెల్లఁ జాణక్యనీతి
విహితమై యీవిధంబుగ వేఁబుపడియె నేమిసేయుదునిట్లుండెనీశ్వరాజ్ఞ॥

అం. 6.

రాక్షసపరిగ్రహణమునకై చాణక్యుఁ డతనిపైఁ జదరంగపు టెత్తుల బ్రయోగించుచున్నాఁడు. చాణక్యుఁడు రాక్షసుని బలపరాక్రమములను, తంత్రశక్తిని గుర్తించుటయేకాక, యాతని యుదారగుణములఁగూడఁ బూర్తిగ నెఱిఁగినవాఁ డగుటచే వానిమూలముననే మంత్రిని వంచించి కట్టివేయఁ దలఁచినాఁడు.

రాజనీతికిని సాంఘికనీతికిఁ బరమవైషమ్యము గలదు. అందుచే రాజతంత్రమందు సాంఘికనీతిని, సాంఘికప్రవర్తనమందు రాజనీతిని ప్రవేశపెట్టరాదు. అట్లు సేయుచో రసాభాసమగును. రాజతంత్రప్రయోగమునం దెట్టి సమర్థుఁడైనను వాని కంతరాత్మశుద్ధి (Scrupulous) పాపభీతియు, దైవభక్తి, స్వామిభక్తి, దయాకృతజ్ఞతలు, సత్యపరిపాలనము మొదలగు సాంఘిక సత్పురుషలక్షణము లెంతమాత్రము చూపినను పరాజితుఁడగును. ఒకవేళ నివియన్నియు నున్నను బాహ్యమున కెంత మాత్రము వీనిని ప్రదర్శింపరాని నిగ్రహముండవలెను, గాని పైకుబికి రా

రాదు. నటకీవానివలె కపటియుండు, కృతఘ్నుండు, నిర్భీతుండు, నసత్యాలాపియు, నంతస్సాక్షిశూన్యుండగు సాహసుండెట్టి పనినైయిన చేసి నిర్వహించును. ఒకవేళ సీమద్గుణములన్నియు హృదయమున లేకున్నను బాహ్యవ్యాపారమున నివియన్నియు నున్నవానివలె బహుజాగ్రత్తతోఁ జూపింపఁబడవలయును. ఇంతమాత్రమేకాక యొకానొక సందర్భమున హృదయములో దయ, కృతజ్ఞత మొదలగు మంచివైన గుణములు లేకపోయినను తత్సమయోచితగుణముగ నవి యున్నవానివలె నటింపవలయును. ఈవిధముగ కపటనాటకసూత్రధారి కావలయును రాజ్యతంత్రజ్ఞుఁడు. అట్టివాఁడే రాజ్యతంత్రమునందు జయము గొనును. లేనినాఁడు పరాజితుఁడగును. చాణక్యుఁడట్టి నటనలందు బహుానేర్పరి యగుటచేతనే జయమును పొందెను. రాక్షసుఁ డిట్టి వెఱుఁగమిచే పరాజితుఁడయ్యెను. కాన రాజ్యతంత్రమునందు కేవల ముపాయములు పన్నుటమాత్రము చాలదు. ఈ నటనగూడ నత్యవసరము. ఇట్లు నటించుట పాపముకాదా యందురా? అందుచేతనే మొదట పాపాదివిషయ సందేహముండరాదని ముందే తెల్పుట. రాజ్యధర్మము వేఱు, సాంఘికధర్మము వేఱు. కౌటిల్యుని రాజనీతిశాస్త్రసారవిషయమిది. కుటిలముగా నుండినను తప్పక విజయప్రాప్తికరమగును. ఈనాటక మాశాస్త్రమునకు లక్ష్యప్రాయము.

చాణక్యునియందు కృతజ్ఞతాది సుకుమారగుణములు చాల తక్కువ. అట్టి గుణములున్నను తన ప్రయత్నమునకుఁ బ్రతిబంధకములని గూడ నెంచి యట్టివానిని దూరముగ నుంచును. రాక్షసుఁడు దన సుకుమారగుణములు దన ప్రయత్నమునకుఁ బ్రతిభంగము లగునని గ్రహింపగలినంత యాత్మవిచక్షణగలవాఁడుకాఁడు. సద్గుణములకు వశ్యుడై పోవుటయేకాక వానియందు తన్మయము చెంది యుద్రిక్తుఁడగును. సత్పురుషులందు దుర్గుణముల శంకించు నేర్పును లేదు. సత్పురుషలక్షణము గాంచగనే 'యాత్మవత్సర్వభూతాని' గనుక, యుద్రిక్తుఁడై దానిలో మునిఁగిపోయి తన యానందమును గృతజ్ఞతను జూపునేకాని, నిగ్రహించుకొనలేఁడు. అధికోద్రేకి. బాహుపరాక్రమముచూపునవసరమునఁగూడ తన్మయుఁడైఁ మహావీరుఁడుగాన శీఘ్రప్రతీకారమొనర్చి కార్యమును సాధించును. కాని తంత్రమునందు తొందరపడిన కార్యము చెడును.

తొందర లేని దీర్ఘాలోచనయే తంత్రమున కార్యకారి యగును. ఆవేశమున తన్మయుఁడుగాక పరిశాంతుఁడైనపుడే సర్వము తథ్యమిథ్యాభేదముతో స్పష్టపడును.

మిత్రుఁడైన శకటదాసుని శూలారోపణమునుండి రక్షించి తెచ్చిన చాణక్యభటుఁడగు సిద్ధార్థకునికిఁ గృతజ్ఞతఁ జూపువాఁడై, మలయకేతువు బహుమానమైన నగను పారితోషిక మిచ్చుటయేకాక యాతనికిఁ దన కొలువున నుద్యోగమిచ్చుటయు నతని ననుమానింపకుండుటయు రాక్షసునితొందరనుఁదూరదృష్టిరాహిత్యమును దెల్పును. మిత్రరక్షణోపకారానందమున తన్మయుఁడై వెనుకముందు లాలోచింపక తొందరపడితన యొద్దయున్న నగయెట్టిదో కూడవిచారింపక రాక్షసుఁడుపారితోషికమిచ్చినాఁడు సిద్ధార్థకునికి. ఇది యుపకారమునకుఁ గృతజ్ఞతఁ జూపుట సత్పురుషలక్షణమే. సందేహాము లేదు. వేణీసంహారనాటకమందు ద్రౌపది నపహసించిన భానుమతికి వాగ్బాణములచేఁ బ్రతివచన మిచ్చిన చెలికత్తెకు భీముఁడుగూడ దనశరీరమునుండి తీసి నగల బహూకరించి తన కృతజ్ఞతానందముల వ్యక్తీకరించును. కాని వేణీసంహారము రాజకీయ తంత్రప్రతిపాదిత నాటకముకాదు. కనుక బాధ లేకపోయినది. రాక్షసుని కృతజ్ఞతాపూర్వకపారితోషికము రాజతంత్రదృష్టిలో నపాయకరమైనది. రాక్షసుని యీ సుకుమారగుణమును బూర్తిగా నెఱింగి, యిట్లగునని గుర్తించియే సూక్ష్మబుద్ధియగు చాణక్యుఁడీ తంత్రమును బ్రయోగించినాఁడు. రాక్షసుఁ డీవలలోఁబడి చిక్కిపోయినాఁడు. ఈ విధముగ రాక్షసుని యుదారగుణముగూడ నతని పరాజయమునకుఁ గారణమైనది. దన యంగుళీయకము సిద్ధార్థకునియొద్దకు వచ్చువిధానమెఱిఁగి, యతఁడానగల పెట్టె నంగుళీయకముచే ముద్రించుటయుఁగూడ చూచి రాక్షసుఁడున్న స్థితిలో చాణక్యుఁడున్నచో, రాక్షసప్రేరణమున చంద్రగుప్తునిఁ జంప వచ్చిన విషవైద్యునిగతి యేమయ్యెనో సిద్ధార్థకుని గతిగూడ నట్లయ్యెడిది. చాణక్యుఁ డమృతమునందు విషమును శంకించు కుటిలుఁడు. గోముఖవ్యాఘ్రము. రాక్షసుఁడు నల్లత్రాచును పూలమాలయని భ్రాంతి చెందును. పయోముఖవిషకుంభమునందలి పయస్సునుమాత్రమె గాంచి మోహపడి త్రాగి విషగ్రస్తుఁడై మోసపోవును.

రాక్షసుని చరిత్రమునందు లోకనీతి లేక గృహనీతి రాజనీతిగా పరిణమించి తన పరాజయమునకుఁ ముఖ్యకారణమైన విషయ మింకొకటి. రాక్షసుఁడు నందులవద్ద మంత్రిగా నున్నప్పుడు ముద్రాంగుళీయకమును వాఁడుచుండెడివాఁడు. నందవంశనాశన మైనపిదప దాని యావశ్యకతయు నతని కగపడ లేదు. ఈ సమయమున రాక్షస గృహిణి కుతూహ లార్థము రాక్షసు నంగుళీయక మడుగఁగనే యతఁడు దాని నిరుప యోగమును బట్టి యామె కిచ్చివేసెను. భార్యలు కుతూహలముతో నే వస్తువునైన నడిగినపుడు భర్తలు వారికోరికలఁ దీర్చుట లోకనీతి. అట్లు నెర వేర్చకుండుట దమ యరసికతఁ దెల్పును. మఱియు నాయంగుళీయక ముతో నా కాలమున నవుసరము లేకపోవుటచే నిశ్చింతతో మంత్రి యిచ్చి వేసినాఁడు. మంత్రిపదమున నుండుచో దానికి నిత్యము పనియుండునని యెంచి రాక్షసగృహిణి యడుగను నడుగదు. రాక్షసుఁ డందుల కంగీకరిం పను నంగీకరింపఁడు. రాజకీయముగా నాలోచించిననునీతనియవివేకమిందు కానము. దానిని భార్యకిచ్చిన కొలఁదికాలములో రాక్షసుఁ డా నగరమును విడిచిపెట్టును. తర్వాత నది దైవాధీనమున క్రమముగా సిద్ధార్థకుని మూల మున చాణక్యునికిఁ జేరి యట్లు పరిణమించినది. అభిజ్ఞాన శాకుంతలమున దుష్యంతుఁడు శకుంతలకు దన ముద్రాంగుళీయకము నిచ్చుటయు, నది తీర్థ మున స్నానముచేయుచుండగా పురుషహ స్తపుటాదిగలదగుటచే జారిపోవ మత్స్యము గబళింప, నది మత్స్యగాండ్ర వలలోబడి యంగుళీయకముదొరికి రాజును జేరినట్లు, రాక్షసుని యంగుళీయకమునకుఁగూడ సంభవించినది. కాన చాణక్యునికి రాక్షస ముద్రాంగుళీయ లబ్ధవిధాన మసంభావ్యముగఁ గనుపట్టదు. షేక్స్పియరు వ్రాసిన ఒథెల్లో నాటకమున డెస్డిమోన యొక్క చేతిరుమాలు ఎమిలియ మూలమున ఇయాగోకు దొరికి యామె పతనకారణమైనట్లుగ, నిదియు నాదృచ్ఛిక సంభవమై విధి ప్రేరణమున దారుణముగ పరిణమించెను. ఇదియొకటే ఈనాటకమునఁగల యాదృచ్ఛికసంఘటనము.

రాక్షసపరాజయమునకు మఱియొక కారణము [illegible]మైనది. రాక్షసుని ప్రయత్న మేదో చాణక్యునకుఁ [illegible] టనే యాతఁడు తత్ప్రతీకార మొనర్చినాఁడు. [illegible]

ప్రయత్నములు చాణక్యునకుఁ దెలిసినట్లు, చాణక్యుని ప్రయత్నలక్ష్యము రాక్షసునికిఁ దెలియలేదు. తెలిసినచో నతఁడు ప్రతీకారము చేసికొని యుండెడివాఁడే. చాణక్యుని ప్రయత్నలక్ష్యమును దెలిసికొనుట కది యంత సులభగ్రాహ్యముగాని, సామాన్య విషయముగాని కాకపోవుటచే సాధ్యము కాకపోయినది రాక్షసునకు. అది యపూర్వమైనది. సామాన్యముగా శత్రువులు పరస్పర నాశనమునకై ప్రయత్నింతురు. అట్లేయని చాణక్య చంద్రగుప్తులు తన్ను చంపుటకుఁగాని, జయించుటకుఁగాని ప్రయత్నింతురని రాక్షసుఁడు దలఁచినాఁడు. కాన సైన్యమును సన్నద్ధ పఱచినాఁడు. తాను మహావీరుఁడు గదాయని యాత్మవిశ్వాసముతో జయము నిశ్చయమని దలఁచినాఁడు. కాని చాణక్యుని ప్రయత్నము వేఱైనది. అతని ప్రయత్న మపూర్వమైనది. ఏదేశకాలములందు నిట్టి ప్రయత్నము జరిగియుండదని నావిశ్వాసము. సుగుణవంతుఁడైన గర్భశత్రువునందుఁగూడ విశ్వాసముంచి ధర్మముతోఁ బ్రవర్తించుట భారతీయుల తత్త్వమేమో! శత్రుశేషము, నగ్నిశేషము, ఋణశేష ముండరాదని గదా నీతిశాస్త్రము. నీతిశాస్త్రవేత్తయైన చాణక్యుఁడే ప్రాణశత్రువైన రాక్షసుని చంద్రగుప్తునకు మంత్రిగాఁజేయఁగోరుననుట రాక్షసుని యూహకుఁగూడ నతీతమైనది. ఊహించుటకు సాధ్యము కానంత యపూర్వమైనది. దానినిగూర్చి యనుమానించుటకుఁగూడ రాక్షసున కవకాశము లేకపోయినది. అందుచేతనే షష్ఠాంకమున మలయకేతు తిరస్కారానంతరము కుసుమపురోద్యానమున నిట్లు విచారించును.

శా॥ ఏరీతిం బగవారితోఁ గలయునో! యీరాక్షసుండన్వయాం
కూరంబేనియు లేక చన్న నృపులం గొల్వం బ్రయత్నించువాఁ
డౌరా! మ్లేచ్ఛున కింతపాటియును లేదయ్యె న్వివేకంబు, నే
వారిం దూఱిన నేమి దైవహతు లబ్ధంగిం బ్రవర్తింపరే॥ అం 6

ఇప్పటికైనను రాక్షసుఁడు పగవారిచేతులలోఁ బడియైనఁ జచ్చుంగాని చంద్రగుప్తునితో సైతము సంధిసేయఁడు. కాదు కాదు. నా కసత్యసంధుఁడన్న యపకీర్తియైనను మంచిదికాని, శత్రువులకు లోఁబడె ననుమాట మంచిదికాదు.

ఇట్లు చాణక్యతంత్రమును గ్రహింపలేక రాక్షసుఁడు మోసపోయినాఁడు.

తనకిష్టము లేక పోయినను, దా ననుమానింపలేకుండినను శత్రువుల మంత్రియగుట కంగీకరింపఁజేసి తన్ను పూర్తిగ పరాజితునిఁ జేసినదికూడ తన యుదారగుణమే. తనమంచిగుణములే తన మతమునకు విరుద్ధముగాఁ జేయించెను. రాక్షసుఁడు పాటలీపుత్రము వదలి పోవునపుడు తన కుటుంబమును చందనదాసునింట దాఁచుటచే నావృత్తాంతము బైటపడి రాజద్రోహమునకుఁగాను చందనదాసు వధింపఁబడ బోవుచుండఁగా, దన కొఱకై వధింపఁబడబోవు చందనదాసునందు కృతఘ్నుఁడు గాకుండుటకై చంద్రగుప్తమంత్రిత్వమున కంగీకరించును. రాక్షసుని కృతజ్ఞత నెఱింగియే చాణక్యుఁడు చందనదాసుని బంధించి వధ్యస్థానమునకుఁగొనిపోయెను. దీనిని సర్వము చాణక్యుఁడు ప్రారంభముననే గ్రహించెను. కనుకనే ప్రథమాంకాంతమున,

గీ॥ రాక్షసామాత్యునకుఁ గీఁడురా నితండు ప్రాణములువాయుటకు సిద్ధపడినయట్లు
వీనియాపద నాతండు విన్నపిదప, బ్రాణములువాయకుండఁగ బ్రతుకగలఁడె॥ అం 1

అని నిశ్చయించినాఁడు. ఈతఁడు ప్రతివానిని సులభముగా నమ్మి పరాజయమును దెచ్చికొనుటలో సిద్ధార్థకునివృత్తాంతమేకాక జీవసిద్ధివృత్తాంతము మొట్టమొదటిది. తర్వాత పర్వతకుని నగలనమ్ము వర్తకుల నమ్మికొనుట మఱియొకటి ఆ నగల ధరించి మలయకేతువు దగ్గరకుఁబోఁక పూర్వమే తన్ననుమానించిన యతఁడు నగలతో రాక్షసద్రోహమును నిశ్చయించెను. రాజ్యతంత్ర విషయములకు మానవలక్షణములకుఁ గల్గిన సంఘర్షణమే యాతని జీవితచరిత్రలో విపరీత పర్యవసానము. గొప్పరాజ్యతంత్రజ్ఞుఁడయ్యు, నసహాయశూరుడయ్యు పరాజితుఁడగుట కితని యపార సుకుమార మానవలక్షణములే కారణము. చివర కిట్లు దలపోయును.

ఉ॥ నందుల ప్రేమవాయదు మనంబున; భృత్యుఁడనైతి విద్విష
ద్బృందము సేయుమాయలకుఁ; బెంచినచెట్లనె ద్రుంచినాఁడ నే
మందు, ధరిఁతుఁ గత్తిఁ జెలిప్రాణము నిల్పుటకై; వశత్వముం
జెందక యుండరాదు విధిసేతలకుం విధికైన నక్కటా॥ అం॰7

దీనికిఁదోడు వివిధవిషయము సంగ్రహణమునకై వివిధ వేషములతోఁ బంపిన చారులను కార్యబాహుళ్యముచే గుర్తింపలేక తానుమఱచిపోవుట మఱియొక లోపము. ద్వితీయాంకమున పాములవాని వేషమునఁ బంపఁబడిన విరాధగుప్తుని రాక్షసుఁడు మఱచిపోయి గుర్తింప లేకపోయినాఁడు. మఱియు చతుర్థాంకమున కరభకుని కుసుమపురవృత్తాంతముల గ్రహింపఁ బంచి, వాఁడు తిరిగి రాగ వాని నేప్రయోజనమున బంపెనో విస్మరించును. ఈవిషయమున చాణక్యుఁడిట్టివాఁడు గాఁడు. ప్రథమాంకమున యమ పటదర్శకరూపమున వెడలిన చారుఁడగు నిపుణకుని చూచిన వెంటనేచాణక్యుఁడు దనలో ఇతఁడు ప్రకృతిచిత్త పరిజ్ఞానమునకై పంపిన నిపుణకుఁడా యని వెంటనే గుర్తించును. సమర్థుఁడైన మంత్రికిట్టి ధారణమత్యవసరము.

దీనికి సాయముగ రాక్షసుఁడు దీర్ఘాలోచనము చేసిన వెంటనే శిరోవేదనపొందు సుకుమారి. చతుర్థాంకారంభమున పాటలీపుత్రము నుండి కరభకుఁడు రాగనే యతనితో ద్వారపాలకుఁడు నెమ్మదిగా మాట్లాడుమని చెప్పి, మంత్రి దీర్ఘాలోచనముచే రాత్రంతయు నిద్రలేక పోవుటచే శిరోవేదనమును భరించుచుండెనని తెల్పును. ఇంతకంటె నెక్కువ దీర్ఘాలోచనలతోఁడి తంత్రముల బన్నుచున్నను చాణక్యునకు శిరోవేదన లేదు. ఇది రాక్షసుని దౌర్బల్యము. ఇతఁడు విధికర్మలైన శకునాదులందు నమ్మకము గలవాఁడై జ్యోతిష్కుల సంప్రదించును. ఇతని కదృష్ట దురదృష్టములం దున్నంత విశ్వాసము మానవప్రయత్నమునందు లేదు.

గీ॥ జయముఁగొను మందబుద్ధి మంత్రియు నదృష్టవంతుఁడైన జిగీషుఁ జేపట్టెనేని;
కాని నిర్భాగ్యుఁగొల్చువాఁడైన నిపుణ మంత్రియునుగూలుఁ గూలుప్రమంబుభాతి॥ అం.7.

చాణక్యునివలె శత్రువుల గొప్పగుణముల మెచ్చుకొనుబుద్ధిశాలియే కాని యితఁడీవిషయమున చాణక్యునంత నిష్కల్మష హృదయుఁడు గాఁడు. చాణక్యుని యాధిక్యత కతఁడసూయఁజెందును.

రాక్ష:— (తనలో) వీఁడు దురాత్ముఁడు. కాఁడు కాఁడు చాణక్యుఁడు మహాత్ముఁడే.

గీ॥ రత్నముల కునికిపట్టంబురాశియైన యట్టు లీబ్రాహ్మణుండాటపట్టు సర్వ
శాస్త్రముల, కట్టివాఁడు మత్సరులమైన మాకు మాత్రము కాఁడయ్యె మంచివాఁడు॥ అం.7

ఈతని హృదయము కవుల హృదయమువలె రసభావబంధుర మైనది. రసమయ సన్నివేశమున రసావేశమును జక్కఁగ ననుభవించును. షష్ఠాంకమునం దుద్యానవనమునను, ద్వితీయాంకప్రారంభపద్యములు దీనికి తార్కాణములు. ఇంతవాఁడు గూడ రాజైన మలయకేతువునందు భయభక్తులతో సంచరించును.

చ॥ నృపతులభీతి సేవకుల కెప్పుడు తప్పదు గాని సేవకుల్ ......అం.5.

ఈవిధముగ సమాజవిరుద్ధ ధర్మములగు రాజ్యతంత్రజ్ఞత, కృతజ్ఞత, పరాక్రమము, బాహుబలము నీతనియందు కలసిపోయి యున్నవి. చాణక్యునియం దివి వేఱువేఱుగానున్నవి. ఇట్టి సచ్ఛీలుఁడగు ప్రతినాయకుఁడైన రాక్షసుఁ డనేక విధముల షేక్స్పియరు విషాదనాయక(tragic hero) లక్షణములు గల్గియున్నాఁడు. ఇందు నాయకుని వధకు బదులుగా పరాజయము జరుగును.

శత్రుసంహారమునకై తా నొనర్చిన మహాప్రయత్నము లన్నియు చాణక్యబుద్ధిప్రభావముచే వృథయై శత్రువుల కపకారము సేయకుండుటయేకాక, యటువిశేషించి తనమిత్రులునశించిశత్రువుల కుపకారములుగ పరిణమించుటకు రాక్షసుఁ డెంతో విచారపడి దనప్రయత్నము మానక చాణక్యచంద్రగుప్తులకుభేదమునుగల్పించుటకై స్తనకలశుఁడనువైతాళికుని ప్రయోగించెను. దీనిని వెంటనే గ్రహించి చాణక్యుఁడు చంద్రగుప్తునితోఁ గృత్రిమకలహమునకుఁ బూనుకొని రాక్షసునకుఁ దన తంత్రముపై నధిక విశ్వాసము గల్గించుటకును, వైతాళికప్రేరణఫలితమే యను భ్రాంతి పుట్టించుటకు, రాజుతోఁ గలహము నటించును. ఇది కౌటిల్యుని రాజ్యనీతి శాస్త్రవిషయమందలి మఱియొకవిచిత్రరహస్యపద్ధతి. కౌటిల్యుఁ డూహించి నట్లే చాణక్యచంద్రగుప్తుల విరోధము సత్యమనియు, నది దనప్రయత్న పర్యవసానమే యనియు భ్రాంతి చెంది, దానిని దన విజయసూచకముగా గ్రహించి రాక్షసుఁడు సంపూర్ణవిశ్వాసముతో నుండి దనలోఁదాను పాలు ద్రాగుచుండెను. ఇంతలోఁ దన వెనుక మలయకేతు భాగురాయణులు గావించుచుండు కుట్రను శంకింపలేకపోయెను. ఎందుకనఁగా రాక్షసుఁడు నందులనువలె మలయకేతువు నధికభక్తితో సేవించెను. ద్వితీయాంకమున మలయకేతువు పంపిన నగలను కంచుకి రాక్షసున

శర్పించినపు డతనితో నమాత్యుఁడు మలయకేతువునుగూర్చి 'నీగుణము లందలి పక్షపాతముచే నందమహారాజు గుణములన్నియు మఱచిపోతి' నని కబురంపును. తన శత్రువునకు శత్రువు తనకు మిత్రుఁడని రాక్షసుఁడు భావించెనే కాని, మలయకేతువుయథార్థగుణము నీతఁడు గుర్తింపలేకపోయెను. ఇట్టివిషయములందు రాక్షసునిది లోపమని యంగీకరింపకతప్పదు. ఇట్టి పరిస్థితులలో రాక్షసుఁడు స్వసైన్యముగ చంద్రగుప్తునిపై దండెత్తిపోయినచోఁ దనకు సంపూర్ణ విజయము చేకూరగలదను దృఢవిశ్వాసముతో నుండెను. అందుచేతనే చతుర్థాంకమున మలయకేతువుతో నా రాజకీయపరిస్థితులను గూర్చి వాదించి యతనికి నచ్చచెప్పును. శత్రు పరిస్థితులను, దనచాకచక్యమును, పౌరుల భక్తిని, దన సైన్యసమృద్ధిని, మలయకేతు నాయకత్వమును విమర్శించి తనకు విజయము నిశ్చయమని దృఢవిశ్వాసముతో నుండెను.

సీ॥ అభియోక్తయఁట చతురంగసైన్యంబుల యభివృద్ధిగలపర్వతాత్మజుండు
భక్తిమంతంబఁట పౌరమండలమెల్ల నందభూపాలకాన్వయమునందు
దొలఁగింపఁబడెనట ధూర్తాగ్రగణియైన చాణక్యు డధికారసరళినుండి
నడిపించువాఁడట నవనవోన్మేష ధీరప్రజ్ఞగల మంత్రి రాక్షసుండు

(సిగ్గునటించి) గీ॥ క్రొత్త భూపాలుఁడంట మహార్యుండయారె
కోర్కెపొడముటయే యొక్క కొదవగాని
సాధ్యసాధనమున కిఁక జంకనేల?
మలయకేతునృపాల! సంపద్విశాల! అం. 4

ఇవన్నియు యథార్థములని భ్రాంతిచెంది గగన సౌధముల నిర్మించెనేకాని యవి యవిమూలకములనియు, దా నైంద్రజాల గతుఁడని మాత్రము గ్రహింప లేక పద్మవ్యూహమున జిక్కుపడిన యభిమన్యుని వలె రాక్షసుఁడు మోసపోయెను.

ఇట్టి సంపూర్ణవిశ్వాసమునం దున్న రాక్షసుఁ డొక్కమారుగ శత్రువిషపైరితులగు భాగురాయణ, సిద్ధార్థక, జీవసిద్ధుల దుశ్చేష్టితముల వలన మలయకేతువు సమక్షమునఁ దాను పరమ ద్రోహిగా పరిగణింపఁబడినపు డతని హృదయము చెదిరిపోయినది. కూటలేఖనుగాంచి

నపుడు తాను విశేషానుభవము గలవాఁడు గనుక మలయకేతువుతో 'కుమారా, ఇది శత్రువుల ప్రయోగ'మని నచ్చచెప్పఁజూచెను. మలయకేతువు దనకు బహుమానముగా నిచ్చిన నగను సిద్ధార్థకుని కివ్వఁబడిన నగగా గుర్తింపబడినపుడు, సిద్ధార్థకుని కృతఘ్నత్వమును గుర్తించెను. ముద్రికను జూచినపుడు 'కుమారా' ధూర్తు లసత్యముద్రికలు గల్పింపఁ గలరని యుపదేశించెను. కాని శకటదాసు హస్తాక్షరములును లేఖాక్షరములు తుల్యములుగా నున్నపుడు రాక్షసున కింక ధైర్యముపోయి దన్ను సమర్థించుకొనుటయు రాజున కుపదేశింపఁ బ్రయత్నించుటయు మానివేసి, శకటదాసు మిత్రద్రోహముచేయునాయని భ్రాంతిచెంది యతనిని శంకింపలేకపోయెను. 'జూలియస్ సీజరు'నాటకమున 'కాసియస్, కాస్కా'మొదలైన ద్రోహులు 'సీజరు' ను కత్తులతోఁ బొడుచునపుడు 'సీజరు' ఆత్మసంరక్షణార్థము ప్రయత్నించెను. కాని దన పుత్రతుల్యుఁడగు 'బ్రూటస్'కూడ పొడువఁగానే యాత్మరక్షణ మానివేసినట్లు, తన ప్రాణమిత్రుఁడైన శకటదాసు ద్రోహముచేసెనని గ్రహింపఁగానే యాత్మసమర్థన మానివేసెను రాక్షసుఁడు. తాను వర్తకులవద్ద కొని ధరించిన నగలు పర్వతకునివని గుర్తింపఁబడినపుడుఁ శత్రుప్రయోగచాతుర్యమునకుఁ దానే యాశ్చర్యపడెను. తా నిప్పుడు గొప్ప సందిగ్ధావస్థలో నుండెను. శత్రువ్యూహమధ్యమునఁ జిక్కుకొనిపోయినాఁడు. పరమమిత్రులని దలఁచినవారు శత్రువులైరి. రాక్షసున కిపుడు కృతకకలహమున చంద్రగుప్తుఁడు దెల్పినట్లు 'నమ్మదగు భృత్యు లెవరో నమ్మదగనివారలెవరో యెఱుఁగకున్నాఁడు' అందుచే రాక్షసుఁడు దిగ్భ్రమచెంది యుక్కిరిబిక్కిరియై పోయినాఁడు.

రాక్ష:—(తనలో) ఆహా! శత్రుప్రయోగ మెంత చక్కగానున్నది? ఏలన

ఉ॥ 'ఉత్తరమేనెఱుంగ ననుటొప్పదు ముద్రి మదీయమాట' దు
ర్వృత్తయిచేసె మాశకటుఁ డీగతి నన్నుమగానిమాట, కిం
చిత్తును నమ్మరమ్మకచేసెను మౌర్యుఁడు సొమ్ములన్నఁ, బ్ర
త్యుత్తర మిచ్చుకంటె నిఁకదోషముఁజేసితినన్న యుత్తమా॥ అం.5

ఇఁక జీవసిద్ధిమూలమున విషకన్యచేఁ బర్వతకుఁడు చంపఁబడెననియు, క్షపణకుఁడుగూడ చాణక్యచారుఁడే యని గ్రహించినపుడు

రాక్షసుని హృదయము వికావికలైనది. 'అక్కటా. శత్రువులు నా గుండెకాయఁగూడఁ దీసికొనిరికదా' యని నిర్విణ్ణుఁడయ్యెను. చివరకు మలయకేతువు 'రాక్షసా, నేను విశ్వాసఘాతినగు రాక్షసుఁడ గానని' నిష్ఠూర్యమాడినపుడు రాక్షసుని హృదయము కుప్పిలిపోయినది. ఈ విధముగ సంపూర్ణవిజయమందు దృఢవిశ్వాసము గల్గియున్న రాక్షసున కీ పతన మాకస్మిక సంభవమగు నశనిపాతమువలె పరిణమించి యతని హృదయమును గ్రుంచివైచినది. దురదృష్టవంతుఁడఁ దానేమి చేయగలఁడని విధిని దూరునేకాని తనయవివేకము నెంతమాత్రము గుర్తింపలేకపోయెను. ఇతనిది సత్వగుణప్రధానమైన ఋషిహృదయమై పోయినది. తనస్థితిని తా నొకమాఱు సింహావలోకనము చేసికొనినాఁడతఁడు.

సీ॥ తపముసేయఁగఁ దపోవిపినమేగినను నంతర్వైరమడఁగునా దానిచేతఁ?
ప్రభువుల ననుసరింపదలంచినను రిపుల్ జీవింప నది యాఁడుసేఁతగాదె,
ధైర్యముదాల్చిచూతమటన్న నక్కటా! దైవసాహాయ్యంబుతలగిపోయె
జాణాక్య తంత్రంబు సాధింతునన్న నామతికి హెచ్చైపోయె నతనిబుద్ధి
గీ॥ ఖడ్గమును గేలఁబూని య క్కటికశత్రు
సైన్యమోపిన కొలఁదిగాఁ జంపి చత్తు
నందునా, నేఁ గృతఘ్నుఁడ నగుదు బద్ధుఁ
డైన చందనదాసు మోమరయకున్న॥ అం. 5

ఇప్పటికి శత్రుప్రయత్నములో సగము బోధపడినది రాక్షసునకు— రాక్షస మలయకేతువుల భేదము. కాని దీనిని చాల యాలస్యముగ గ్రహించుటచేఁ బ్రతీకారము చేయలేకపోయినాఁడు. ఇట్లే చాణక్యుఁడు 'రాక్షసుని చంద్రగుప్తమంత్రిగాఁ జేయుప్రయత్నము గూడ నీతఁడు గ్రహించలేదు. గ్రహించినచో దాని విషయమై కాపుదలగానుండి ప్రతిక్రియ గావించుటకై ప్రయత్నించెడివాఁడే. అతనిమనస్సు 'కృతఘ్నుఁడ నౌదు బద్ధుడగు చందనదాసు మోమరయకున్న' యని విచారించునే కాని, యతని బంధమోక్షణమును దన చంద్రగుప్తామాత్యపదాంగీకార్యమునకు నవినాభావసంబంధము గల్గియున్నదని గ్రహింపలేక

పోవును. అది గుర్తించినట్లయితే చందనదాసమోక్షమునకు స్వంతముగాకాక, మఱియొకమార్గమునఁ బ్రయత్నించి, ప్రతిక్రియ చేయనేర్చునుకదా. అందుచే చాణక్యుని ముఖ్యప్రయత్న మతని కర్థముగా లేదన్నమాటయేకద. తన ఖడ్గమునుమాత్రము నమ్మి చంద్రగుప్తుని బంధమోక్షణమునకుఁ బయలుదేరును. షష్ఠాంక ప్రారంభమున రాక్షసుఁడు జీర్ణకుసుమోద్యానమునఁ దాను వెలార్చిన భావములఁ బట్టియైనను చాణక్యుని ముఖ్యప్రయత్న మతనికిఁ దెలిసినట్లు గోచరింపదు. ఎంతవఱకు మలయకేతు నవివేకము, దన దురదృష్టము, చందనదాసుఁ జూచు నభిలాషమాత్రమే వ్యక్తీకరించును. చాణక్యతంత్రము రాక్షసున కేమాత్రము దెలియదని షష్ఠాంక ప్రవేశకమున సిద్ధార్థకుఁడు సమిద్ధార్థకునితోఁ బలుకువాక్యములగు 'బుద్ధిమంతుఁడగు రాక్షసామాత్యుఁడుగూడ దెలిసికోలేని చాణక్యనీతివిషయమును నీవు దెలిసికొనఁగోరుచున్నావ'ను దానిచే స్పష్టముకదా.

చందనదాస సంరక్షణాందోళన మానసుఁడై రాక్షసుఁడు జీర్ణోద్యానమును బ్రవేశించి, చాణక్యప్రేరితుఁడైన పురుషుని కపటోపాయమునఁ, దాను దేనిసాయమున జయము నిశ్చయమని యభిలషించెనో, దేనిమూలమున చందనదాస బంధమోక్షము సేయఁబూనుకొనెనో, దేనిఁజూచి చాణక్యాది శత్రువులుగూడ భయకంపితులైరో, దేని విద్యయందుఁ దా నసహాయశూరుఁ డనిపించునో, యాఖడ్గమునుండి వియోగమును బొందింపబడెను. ఇప్పటికైన నీతనికి చాణక్యుని ముఖ్యప్రయత్నమెట్టిదో తెలియ లేదు. రాక్షసుఁడు తనలో 'ఆహా చాణక్యనీతిమార్గ మెంత దుర్బోధముగానున్నది' యని జరిగినదాని కాశ్చర్యమగ్నుఁడగునేకాని ముందు జరుగఁబోవునది తనకెంతమాత్రము దెలియుట లేదు.

ఉ॥ కాలముకాదు కర్తికిది, ఘాతుకులన్ వధియించె ముందె;

… … … … … … … … … … … …

పాలిటికింక నే నొనురుపందగినట్టిది దేహనాశమే అం. ౬.

అని తానూహించు నేకాని శత్రుప్రయత్నము గుర్తింపనేరఁడు. అయితే ఖడ్గవిహీనుఁడై చందనదాసునొద్దకుఁబోయి రాక్షసుఁ డేమి చేయవలయునని? చాణక్య చంద్రగుప్తులతో సఖ్యము చేసికొనుటకా, కాదు. ఆ నీచభావము రాక్షసునికి లేదు. అది స్ఫురింపనైన లేదు. మఱియు నట్లు చేయఁజూచుట తనమతమునకు విరుద్ధమగుటయేకాక స్వర్గమందున్న నందరాజులకు ద్రోహమాచరించుట కదా. వారినిసంతృప్తి పఱచుటకే ప్రయత్నముచేసి దానికి విరుద్ధముగా నాచరించునా? అట్టి భావము దన మనస్సున లేదు. ఇంకేమనఁ దనకై తనకుటుంబమును రక్షించి ప్రాణముల గోల్పోవనున్న చందనదాసుని ప్రాణముల రక్షించుటకుఁగాను. ఆతనికి విధింపఁబడిన మరణదండనము దాను గ్రహించుటకు. అందుచేతనే షష్ఠాంకాంత్యపద్యమున 'నాపాలిటి కింక నే నొనరుపందగినట్టిది దేహనాశమే' యని నిశ్చయించి, సప్తమాంకమున చండాలురతో 'జందనదాసుని రక్షించి తనకంధరమునఁ దగుల్పుఁడు దారుణమృత్యుపాశము' అని నుడువును. ఇందుచే చాణక్యుని ప్రయత్న మతనికి దుర్బోధమని స్పష్టముకదా! చిట్టచివరకు చాణక్యుఁడు దనప్రయత్న తంత్రమంతయుఁ జెప్పి,

గీ॥ చంద్రగుప్తునకును నీకు సంధిచేసి యతని రాజ్యంబు భవదీయమతి విశేష
మాన్యముగఁ జేయఁదలఁచిన మామకీన వర్ణనీయ నయప్రభావమ్ము సుమ్ము॥ అం. 7.

అనిచెప్పిన పిమ్మటఁగాని రాక్షసునకు సర్వ మర్థముగా లేదు. ఇప్పటికిని ప్రార్థింపఁ బడియు రాక్షసుఁడు చంద్రగుప్తామాత్యపదవి నంగీకరింప లేదు. చాణక్యుఁడు నీవు 'శస్త్రగ్రహణము సేయకున్నఁ జందనదాసు బ్రతుకఁ' డని స్పష్టముగ రాక్షసునితోఁ జెప్పినపుడు గాని యాతని ప్రయత్నలక్ష్యము స్పష్టపడ లేదు. రాక్షసుఁడు మఱియొకమాఱు సందిగ్ధావస్థలో నున్నాఁడు.

'ఉ॥ నందుల ప్రేమ వాయదు మనంబున; భృత్యుఁడనైతి' అం. 7.

కాన గతిలేక మిత్రప్రాణరక్షణార్థమై యమాత్యపదవిని గ్రహించును. ఈవిధముగ రాక్షసునకు పతనమునుండి యుచ్ఛస్థితి వచ్చినది. ఇదియు నీతని పతనమువలె నాతని కాకస్మిక సంభవమును నపూర్వభావితమును గూడనైనది. హఠాత్సంభవ మగుటచేతను, నశంకితమగుటచేతను దన సూక్ష్మబుద్ధి రాహిత్యమున నతఁడు గ్రహింపలేమిచేతను,

దనకు విధి ప్రతికూలమనియు, దాను దురదృష్టవంతుఁడనియు దా నాశ్రయించిన రాజవివేకియనియు పరదోషారోపణము చేయును. సామాన్యునం దివి క్షంతవ్యములే యైనను రాజ్యతంత్రజ్ఞునం దీలోపము క్షమింపరానిదే.

ఈవిధముగా రాక్షసుఁడు చాణక్యుఁడు దలచినంత బృహస్పతియు సూక్ష్మబుద్ధియుగా యథార్థమునకు గోచరింపఁడు. రాజతంత్రమున విశేషానుభవము గల్గినవాఁడే యిట్లు ప్రవర్తించుట యేమి? మఱియు చాణక్యుని మతము ప్రకారము రాక్షసుఁడు చంద్రగుప్తునకు మంత్రియైన తర్వాత గూడ యథాప్రకారముగా నిట్టి రాజ్యతంత్ర దోషములఁ జేయుచుండినచో చాణక్యుని ప్రయత్నప్రయోజనమేమి? విశాఖదత్తకవి రాక్షసు నీరీతి పాత్రపోషణ సేయనేల యందురా! ఇద్దరుమంత్రులు సమానబుద్ధిమంతులైనచో జయ మెవ్వరికి జేకూరదు. అప్పుడు నాటకమంత రసవంతముగా నుండదు. మఱియు విజితుఁడగువాఁడు సర్వసామాన్యుఁడైనను విజయునకంత ఖ్యాతి యుండదు. మహాశక్తిసంపన్నుఁడగు రావణుని చంపుటచేతనేకదా రామునకంత ఖ్యాతి. అట్లే రాక్షసుని బృహస్పతియంతవానిని చేయవలసివచ్చినది. బృహస్పతితుల్యుని జయించుటచేతనే చాణక్యునకంత ప్రశస్తి గల్గినది. అందుచే రాక్షసునికి భాగురాయణ సిద్ధార్థక జీవసిద్ధ్యాదులు చంద్రగుప్త చాణక్యులకు వ్యక్తిగత బంధుగులుగాన వారిని నమ్మరాదను వివేకము లేకపోయినది. వారందఱును పూర్వనందరాజులందనురక్తులనియు, చాణక్యచంద్రగుప్తుల ద్వేషులమని చెప్పుమాటలు సహేతుకములని విశ్వసించి మోసపోయినాఁడు. వారు కేవలము సేవకావృత్తితో వచ్చినవారు కాదనియు, చంద్రగుప్త చాణక్యుల కాబాల్యస్నేహితులని గ్రహింపలేకపోయినాఁడు. చాణక్యుఁ డట్టివారినేకద యేరి తన చారులగా గ్రహించినది.

ఇట్టి మహామతి పరాజితుఁ డగుటకు చాణక్యుఁడెంతవఱకు కారకుఁడో కూడ విచారింతము.

చాణక్యుఁడు:— ఇతఁడు బ్రాహ్మణ బ్రహ్మచారి. రాక్షసుని కన్న వయసున చాల చిన్నవాఁడు. అట్లయ్యు 'సర్వశాస్త్రముల కాటపట్టని' రాక్షసుఁడే యీతనికి యోగ్యతాపత్రము నిచ్చుచున్నాఁడు

రాక్షసునివలె నితఁడు స్వార్థరహితుఁడు మాత్రమె కాక విరాగి. ఈతనిగృహ మెంత పేదదో కంచుకి వర్ణించును.

ఈతఁడు శత్రువుల సుగుణములసైతము మెచ్చుకొను మహా మతి. కాని యసూయాపరుఁడుమాత్రము గాఁడు. సుగుణవంతుఁడైన శత్రువునుగూడ శిరసా వహించును. అందుచేతనే రాక్షసుని 'మంత్రి బృహస్పతీ' యని మెచ్చుకొని, యతనికి నందరాజులపైఁగల కృతజ్ఞతను గొనియాడి, యతని పరాక్రమాతిశయమును భయముతో నామోదించి, పరాక్రమించి యతనిని జయించుచో మరణించునేమోయని దిగులుపొంది యట్టి మహామంత్రి పుట్టఁబోఁడని మక్కువపడి, యాతనిని చంద్రగుప్తునకు మంత్రిగాఁజేసి తాను దపమునకుఁ బోనిశ్చయించుకొనెను. కాని యత నిని సంగ్రహించుట సామ దాన దండోపాయములకు సాధ్యము కాదని యెంచి భేదోపాయ ముపయోగించినాఁడు చాణక్యుఁడు. 'ప్రాతచేతనే రాక్షసుఁడు జయింపఁబడవలెనని యెంచి యారీతిఁ జేయును. ఈతఁ డట్లే చందనదాసుని స్వార్థత్యాగమును, సత్యపరిపాలనమును గూడ హృదయ మున మెచ్చుకొనును.

చాణ:—(తనలో) సెబాసు చందనదాసా.

'గీ॥ పరుల సంరక్షణముసేయు కొఱకుకాదె

... ... ... ... ... శిబిచక్రవర్తి తప్ప'

ఈతఁడు దైవబలముకన్న పురుషకారమే గొప్పదనియు, సేనా బలముకన్న బుద్ధిబల మధికమని విశ్వసించువాఁడు.

'చ॥ ఉన్నది గద నందవంశమును నాశముచేసి యశంబుగొన్నయ

ట్టిది యగు నాదు ప్రజ్ఞ యొక్కటేయది సేనలకెల్ల నెక్కుడై' ....1

దీనికిఁ దోడీతని కాత్మవిశ్వాస మధికము.— 'ఏల యీయాలోచన నందవంశమడగింతునని యెల్లలోకమువారికిఁ దెలియునట్లు ప్రతిజ్ఞఁగావించి దుస్తరమైన యాప్రతిజ్ఞానదిదాటిన యేనిపుడు ప్రకాశీకృతమైన యీా యనర్థమును మాత్ర ముపశమింపఁజేయలేనా' (పుట 4.) అని రాక్ష సుడు మలయకేతువుతోఁ గలిసి తనపై దండెత్త వచ్చుచున్నాఁడని విని చాణక్యుఁ డిట్లు తలపోయును.

చాణక్యునియందున్న గొప్పగుణ మతిసూక్ష్మబుద్ధి, పరేంగిత జ్ఞానము. ఇదియే యతని విజయమునకు ముఖ్యకారణము. X-Ray యంత్రము మానవశరీరాంతరావయవముల స్పష్టముగఁ జూపఁగల్గినట్లే, చాణక్యుఁ డెవరినైన నాపాదమస్తక మొక్కమాఱు చూచెనా యాతని మనస్సునందున్న సకలభావము లాతనికి స్పష్టముగ, నిర్దుష్టముగ, గోచరించును. మానవుల మనస్సును గుర్తించుటకుఁ బ్రపంచమున నే యంత్రము లేదు. కాన నితఁడు X-ray యంత్రమునకన్న నధికశక్తిగల వాఁడని చెప్పవచ్చును. అందుచేత రాక్షసుని పరీక్షించిన వెంటనే యతనియందుఁగల పరాక్రమము, రాజ్యతంత్రజ్ఞత, కృతజ్ఞత, స్వామిభక్తి, మొదలైన గుణములన్నియు నితనికి స్పష్టముగ గోచరించి యాతనిని సాధించుటకై యాతని సుగుణములమీఁదనే తన కుతంత్రమంతయుఁ బ్రయోగించి తన కుపయోగించునట్లుగ చేసి యాతనిని సాధించినాఁడు. మలయకేతువును గాంచిన వెంటనే యతఁ డవివేకి, శుష్కవృద్ధుఁ డని శీఘ్రముగ గ్రహించి యాతఁడు రాక్షసునివలలోఁ బడియున్నను తేలికగ జయింపఁగల్గుదునని నిశ్చయించెను.

ఈతఁడు దన సూక్ష్మబుద్ధిచే రాక్షసుని ప్రయత్నము లన్నియు గ్రహించి వాని నన్నియు భగ్నముసేయుటయే కాక యవన్నియుఁ దన కుపయోగించునట్లు మార్చివేసినాఁడు. రాక్షసుఁడు చంద్రగుప్తునిపై ప్రయోగించిన విషకన్యను పర్వతేశ్వరునిపై ప్రయోగించి యర్ధరాజ్యమీయవలసిన పర్వతేశ్వరుని జంపి యా బెడదఁ వాపుకొనెను. తండ్రి దనచే వధింపఁబడెనని చాటింపించి మలయకేతువును గుసుమపురము నుండి తఱిమివేసి రాక్షసుఁ డతనిఁజేరునట్లు చేసెఁగాని, రాక్షస మలయకేతువులకు భేదము పుట్టించునపుడు రాక్షసుఁడే పర్వతకుని జంపించెనని జీవసిద్ధిచేత మలయకేతువు వినునట్లనిపించెను. ఇట్లొకకార్యమే యనేకవిధముల పరిణమింపఁజేసి, తన కనేకవిధముల సమయానుగుణముగ నుపయోగింపఁజేయఁగల సమర్థుఁడు. ఇట్లే రాక్షసప్రేరితుఁడగు దారువర్మ యను శిల్పి చంద్రగుప్తుని చంపుటకై తోరణమధ్యమున యంత్రమును నిల్పి, రాజద్వారము నలంకరింపఁగా, దృష్టిమాత్రముననే రాజశాసనమును ముందే యలంకరించినదానిని వెంటనే యనుమానించియు, నను

మానింపనివానివలె నటించి, దారువర్మ శిల్పసామర్థ్యమును శ్లాఘించి
నట్లు కృత్రిమసంతోషమును జూపి, యామసమయమున పర్వతేశ్వరు
భ్రాతయగు వైరోచకుని చంద్రగుప్తునివలె నలంకరించి, సోదరుని యర్ధ
రాజ్యమిచ్చు మిషచే నగరప్రవేశము చేయించి, దారువర్మ యంత్ర
తోరణముచే జంపింపఁజేసి, రహస్య ప్రకటనము వలన దారువర్మ బర్బర
కుల వధించును. ఈవిధముగా దాయాదినాశనమును శత్రుప్రయోగ భేద
మును చేయును. ఇట్లే విషవైద్యుని, శయ్యాగారమందలి ప్రమోదకుని
సొరంగమున దాగియున్న భీభత్సకాదులను మూలచ్ఛేదమొనర్చి రాక్షసుని
తంత్రమును భగ్నముచేసి చంద్రగుప్తుని కంటికి రెప్పవలె రక్షించెను.
ఇందుచే రాక్షసుఁడు చంద్రగుప్తుని వధించుటకుఁ జేసిన యుపాయములు
విఫలములైనవి.

ఇక మలయకేతు రాక్షసుల భేదమునకై, వేగులవాండ్రను
మాయారూపముల పురములోనికి రాజద్రోహుల నెఱుంగ పంపెను.
అట్టివారిలో నిపుణకుఁడు యమపటప్రదర్శన సాయమున రాక్షసుని
ముద్రాంగుళీయకమును దెచ్చి చందనదాసును, శకటదాసును రాజ
ద్రోహులని తెల్పును. తనమిత్రుఁడై బౌద్ధసన్న్యాసివేషమున నున్న
ఇందుశర్మను విషకన్యను ప్రేరేచెనను మిషపెట్టి కుసుమపురమునుండి
తఱిమివేసి, తిరిగి రాక్షసునే చేరి యచటి సమాచారమును గనిపెట్టుటకై
పంపెను. తనకు విశ్వాసపాత్రుఁడైనవాఁడును, పాపభీతియు, జంకుఁ
గొంకు, కృతజ్ఞత, మొదలైన వేమియు లేని ప్రత్యక్షపిశాచమువంటి
సిద్ధార్థకుని శకటదాసుని మైత్రి సంపాదించునట్లు చేసియుంచెను. చంద్ర
గుప్త సహాధ్యాయియగు భాగురాయుని మలయకేతువునకు మిత్రునిగా
నుంచెను. ఈతఁడు సమయముగనిపెట్టి మలయకేతువునకు రాక్షసుని పై
ద్వేషము గల్గునట్లు దుర్బోధచేయును. భద్రభటాదులకు సైన్యపాలికాధి
కారముల నిప్పించి యీతఁడు శత్రుకటకమును మిత్రభూయిష్టముగ
నొనర్చెను. రాక్షసుని ముద్రాంగుళీయకము దొరకగనే చాణక్యుఁడొక
కూటలేఖను రాక్షసుని లేఖకుఁడగు శకటదాసునిచే సిద్ధార్థకుని మూల
మున వ్రాయించి రాక్షసుని ముద్రవేసి సిద్ధముగ నుంచెను. శకట
దాసుని శూలారోపణ వేయునట్లు చేయించి, వానిని సిద్ధార్థకుఁడు

రక్షించి రాక్షసునియొద్దకుఁ గొనిపోవునట్లు తంత్రమును బన్నెను. చాణక్యుఁడు రాక్షసుని కృతజ్ఞత నెఱుంగుచుగాన నతఁడు సిద్ధార్థకునికిఁ బారితోషిక మిచ్చునని నిశ్చయించి యావిషయముఁగూడ విచిత్రముగ లేఖలో సూచించెను. లేఖ శకటుని హస్తాక్షరములతో నుండుటచేతను, రాక్షసుని ముద్రయుండుటను రాక్షసుఁడు దోషిగా గణింపబడక తప్పదు. రాక్షసుఁడు మలయకేతువున కిచ్చినపారితోషికము, వెనుక మలయకేతువు రాక్షసున కిచ్చిన బహుమానమగుటచే దోషము దృఢమగును.

రాక్షసుఁడే పర్వతకుని చంపెనను ననుమానము బలపఱచుటకై పర్వతకుని నగలను బ్రాహ్మణవేషధారులైన చారులకు చంద్రగుప్తునిచే దానముచేయించి, వారు వర్తకుల రూపమున వానిని రాక్షసున కమ్మునట్లుచేసి, యావగను ధరించి రాక్షసుఁడు మలయకేతువు సముఖమునకుఁ బోఁగ వానివలన నతఁడు దన పితృహంతకుఁడని నిశ్చయించును.

రాక్షసుఁడు చాణక్య చంద్రగుప్తులకు భేదము గల్పించుటకై వైతాలికుని మూలమునఁ బ్రయత్నించుచున్నాఁడని గ్రహించి, మంత్రిని ప్రమత్తుని జేసి, యతని తంత్రము సఫలమైనదని విశ్వసింపఁజేయుటకై, మలయకేతువు రాక్షసునిపై ననుమానించుటకునుండే మహాతంత్రవ్యూహ మొకటి చాణక్యుఁడు పన్నెను. రాక్షసుఁడు చంద్రగుప్త చాణక్యులమీఁద తంత్రముపై దంత్రముల పన్నుచుండెనుకదా! వీనిని ప్రతితంత్రములతో నెదుర్కొనుట యొకయెత్తు. ఆరీతి నొకమూల చాణక్యుఁడు సేయుచునే యుండెను. దీనికిఁ దోడు మఱియొక కుతంత్రమును కౌటిల్యుఁడు పన్నెను. పారావారము మహాతరంగములతోఁ మీఁద కుమికి వచ్చునపుడు మొండిగా దాని నెదుర్కొనజూచుచో నొకవేళ దాని ప్రాబల్యముచే నపకారము జరుగవచ్చును. కాని సమయోచితముగ నామహోద్దండతరంగమునకు వంగిపోయినచో, నపాయమునుండి తప్పుకొనబడిఁ యాతరంగము నిరపాయముగా దాటిపోవును. ఇది కౌటిల్యుని రాజనీతిశాస్త్రమునందలి యొక విచిత్రప్రయోగ విధానము. అదేవిధమున స్తనకలశుఁడను వైతాళికునిమూలమున రాక్షసుఁడుసేయు భేదతంత్రమునకుఁ బొల్పడిన వానివలెఁ జాణక్యుఁడు చంద్రగుప్తునితోఁ గృత్రిమకలహమును జేసి, మంత్రిత్వమును త్యజించి, యావార్త రాక్షసచారులకుఁ దెలియు

నట్లు సేయును. ఈ నటన నాటకములో నాటకమువంటిది. రాక్షసు డది విశ్వసించి మోసపోవును. మలయకేతువుగూడ రాక్షసుఁడు దనకుఁ జేయఁబోవు ద్రోహమున కనుగుణ్యముగ నీకృతకకలహము ననువదించు కొనును. దీనితోఁ జాణక్యుని తంత్రము పరమావధికి వచ్చినది. రాక్షసుఁడు బురదలోఁ గాలుజారిన యేనుఁగువలె నిరుకుకొని పోయినాఁడు.

చాణక్యుఁడు జయము పొందుటకుఁ జేసినది యీతని బుద్ధి సూక్ష్మతయు తంత్రమాహాత్మ్యమును మాత్రమేకాక, శత్రువుల బూకరించి డబాయించుట, కరుణ కృతజ్ఞతాది భావములు లేనిచోట్ల నున్నట్లును, నున్నచోట్ల లేనట్లును చూపుట మొదలగు నకిలీభావ ప్రకటనమూలమైన భావగోపనము మఱియొక ముఖ్యసాధనము. ఇది తృతీయాంకమున విచిత్రరూపము దాల్చినది. ప్రథమాంకమున చందనదాసుని శకటదాస జీవసిద్ధులు రాజద్రోహులని, శూలారోపణము విధించుటయు, దేశమునుండి తఱుమఁబడుటయు జ్ఞాపకము చేసి బెదరించి రాక్షసుని గృహజనమును దన స్వాధీనము చేయుమని గద్దించును. హృదయమున చందనదాసుని స్వార్థత్యాగమును మెచ్చుకొనియు బైట కతనిని దురాత్ముఁడా, రాజద్రోహమునకు ఫల మనుభవింతువులే, యని తిరస్కరించును. ఈతని ప్రతిభావమును ద్విముఖులఁ బరిణమించును. భాగురాయణభద్ర భటాదులు దన తంత్రము ననుసరించి పాఱిపోవుచుండుట నెఱిఁగి తన మనస్సున సంతోషించుచుండియు బైటికి కోప మభినయించును. ద్వితీయాంకమున దారువర్మ రాజద్వార మలంకరింపఁగ చాణక్యుఁడు చూచి యనుమానించియుఁ దన యనుమాన మితరులకుఁ దెలియకుండుటకును, దారువర్మను మెచ్చుకున్నట్లు నటించుటకు 'శిల్పివర, దారువర్మ, కొలఁది కాలములో నీకుఁ గల రాజభక్తికిఁ దగిన ఫల మనుభవింతువు గాక,' యని యతని సామర్థ్యమును శ్లాఘించెను. ఈ శ్లాఘ్యమునకు ఫల మతనిని జిత్రవధ గావించుటేనా? ఇట్లు ద్విరూపములఁ బ్రవర్తించుటచేఁ దన హృదయభావ మెవ్వరు గ్రహింపలేక శత్రువులు మోసపోయి పరాజితు లగుదురు. తన చుట్టు రాక్షసచారు లుండురని యతఁడు పూర్తిగ నెఱిఁగి యిట్లు ప్రవర్తించును. యథార్థ రాజతంత్రజ్ఞుఁ డిట్లే

పరివర్తింపవలయును. ఇందుచేతనే యతని ప్రయత్నము గూఢమై జయము గాంచెను. కౌటిల్యనీతిశాస్త్రమందలి మఱియొకవిధమైన వ్యూహమిది. ఈరీతి పరివర్తన చేతగాకయే రాక్షసుని తంత్ర మందఱకు దెలిసి యతఁడు పరాజితుఁ డగుట. ఈ కృత్రిమ నటనవలననే రాక్షసునకుఁ జాణక్యునిఁ తంత్రము, నతని ప్రయత్న సత్యము దెలియక యుక్కిరి బిక్కిరి యైపోయి, తనదగ్గర నున్నవారిలో యథార్థమిత్రు లెవరో శత్రువు లెవరో తెలియక దిగ్భ్రమ చెందెను. చాణక్యుని కృత్రిమ నటన తన జనులకే తెలియకపోయెడిది. ఇఁక శత్రువులు దెలిసికొన నెట్లు సాధ్యము. అట్టి కృత్రిమనాటక సూత్రధారుఁ డతఁడు. అందుచేతనే ముందుగాఁ దెలుపఁబడియుఁ జంద్రగుప్తుఁడు చాణక్యునితోఁ గృత్రిమకలహము జరుపుచు, చాణక్యుఁడు తిరిగి జుట్టు విప్పి నేలదన్ని ప్రతిజ్ఞఁ జేయబోవుట నభినయించుచుండఁగా రాజు నిజముగనే చాణక్యునకుఁ గోపము వచ్చెనని భయభ్రాంతుఁ డగును. మఱియుఁ జాణక్యుఁ డేపని చేసినను నితరులచేఁ జేయించినను నన్యమిషచే చేయించును. కూటలేఖను తానెంత జాగ్రత్తగా వ్రాసినను నక్షరములు స్ఫుటముగా నుండవను మిషచే శకటదాసుచే వ్రాయించును. నగలను సుగుణవంతులగు బ్రాహ్మణులకే యీయవలయునను మిషచే చారుల కిప్పించును. శకటదాసును రక్షించు మిషచే సిద్ధార్థకుని రాక్షసునియొద్ద కంపును. ఇందుచే చాణక్యుని స్వజనముగూడ నీతని తంత్రమును గ్రహించుకొనలేక పోయిరి. హిట్లరువలె రాక్షసుఁడు యోధుఁడుఁ తంత్రజ్ఞుఁడుగూడ. కాని చాణక్యుఁడు ఘటనాఘటన సామర్థ్యమందు చర్చిల్ వంటి వాఁడు.

ఇతఁడు దన్ను నమ్మిన భృత్యులపై యథార్థానురాగము గలవాఁడు, కాని యా యనురాగమును బైటికి రాక్షసునివలె నుద్రేకముతో వ్యక్తీకరింపఁడు. తన కుపకార మొనరించినవారికిఁ గూడ వెంటనే తొందరపడి బహుమానముల నివ్వఁడు. ఉపకార మొందిన కొంతకాలమునకు కార్యమంతయు నెఱవేరిన తర్వాతనేకాని వారిని బహూకరింపఁడు. ఇది రాజనీతి. అందుచేతనే రాక్షసామాత్యుని ముద్రాంగుళీయకమును దెచ్చిన నిపుణకుని, 'బిడ్డా! పొమ్ము కొలఁదికాలములోనే నీవు చేసిన

యీ పరిశ్రమమునకుఁ దగిన ఫల మనుభవింతువులే యని పంపివైచునే కాని రాక్షసునివలె విచారింపక యపాత్రదానము చేయఁడు. చాణక్యుఁడు నిపుణకుని కృతజ్ఞతను వెలువరించిన వాక్యములకు, దారువర్మ శిల్ప చాతుర్యమును మెచ్చుకొనుచు ననిన మాటలకుఁ దారతమ్య మెవరైన గ్రహింపఁగలరా? ఫలములఁబట్టి తప్ప. ఈతని ప్రవర్తన యంత గూఢమైనది. చాణక్యునకుఁ దన భృత్యులగు భాగురాయణ, సిద్ధార్థకాదులందు సత్యమైన దయ కలదు. లేకపోయినచో వారీతనిపై నింత భయభక్తి విశ్వాసములతోఁ బ్రవర్తింపఁజాలరు. చాణక్యునియాజ్ఞయన్న నతని భృత్యులకే కాక సమిద్ధార్థకాదులకుఁ గూడ భయము గొల్పుచుండెడిది. సిద్ధార్థకుఁడు 'ఈజీవలోకమున జీవింపఁదలఁచిన నాఁడెవ్వఁడును చాణక్యుని యానతి నన్యథా చేయలేఁడు' అని తెల్పును. చాణక్యుని భావములు సమయోచితముగ 'వజ్రాదపి కఠోరాణి, కుసుమాదపి కోమలాని' యనునట్లుండును.

ఈతని ప్రయత్నమున కడ్డు దగిలినచో నితఁ డెంతటి పాపమైనను జేయుటకు వెనుదీయఁడు. కృతఘ్నత, పాపము, క్రూరత్వము వీని నెంతమాత్రము పాటించఁడు. నందవంశ నాశనమునకు సాయపడిన పర్వతేశ్వరున కర్ధరాజ్య మీయవలసి వచ్చునని బుద్ధిపూర్వకముగ నతనిని విషకన్యచేఁ జంపి యతని తమ్ముఁడైన విరోచకుని యంత్రతోరణముచే జంపించెను. ఎట్టి సమయమందుఁ గూడ రాక్షసునివలె క్షుభితచిత్తుఁడగుట గాని, విస్మరించుట కాని, తొందరపడుట కాని యెఱుఁగఁడు. ఆలోచనయం దతిదీర్ఘముగా విచారించి, వెనుకముందు లాలోచించి, పొరపడిన మార్చుకొనుచు బహుజాగ్రత్తగా నుండును. ఈవిషయములన్నియు నతఁడు కృత్రిమ లేఖను వ్రాయు పద్ధతినిఁబట్టి స్పష్టపడఁగలవు. లేఖ యుత్తరార్ధమును మొదట వ్రాసి, తర్వాత పూర్వార్ధమును బూరించును. పిమ్మట రాజుల పేర్లు వ్రాయనెంచి, వానిని ముందుగ వ్రాయుట యుచితము గాదని యాయభిప్రాయమును మార్చుకొనును. మఱియు ప్రథమాంకమున తంత్రప్రారంభమున మలయకేతువును భాగురాయణునిచేఁ జెదరగొట్టించి పాఱిపోవునట్లు చేసియు జాణక్యుఁ డిట్లాలోచించును. 'మలయకేతువును నిగ్రహించినచోఁ బర్వతకునిఁ

జంపించెనని రాక్షసునకు వచ్చిన యపకీర్తి మాసిపోవునేమో యనియు సంశయించుచున్నాను. అది మాయుట నాకిష్టము లేదు' అని తన యభిప్రాయ తంత్రముల మార్చుకొనుచున్నాడు. ఇట్లతిజాగరూకుఁడు జాణక్యుఁడు. ఈతనికి కార్యసాధనమున నాత్మవిశ్వాసము మెండు.

'ఉ॥ ఊర్జిత దానశక్తి వయి యొక్కడనై చరియించుచు న్మద
స్ఫూర్జితమైన యాత్మబలమందొని పొంగెడునిన్ను బుద్ధిసం
తర్జితుఁజేసి, యేపిపెదదంతివిధంబునఁ గట్టిపైచి, మా
కర్జము దీర్చికొందుఁ బెఱకార్యములేల ముకాన్వయార్థమె.' అం 1

ఈ యాత్మవిశ్వాస మీతనిని గర్విష్ఠినిగా నొనర్చి యాత్మస్తవమునకుఁ బ్రేరేచినది.

'గీ॥ ఆవులించిన మృగరాజు నాననంబు' మొ॥ ... అం 1
'గీ॥ అలుకనిప్పనుండి వెలువడుపొగతీఁగ' మొ॥ అం 1
'గీ॥ నందవంశకాననమునకు దావాగ్ని' మొ॥ ... అ 1

'సీ॥ ముడిచెనెవ్వాఁడూపటంబునఘుజ్వాలాకరాళమైనదావాగ్ని' మొ॥అం7
'ఉ॥ క్రొంచెముకానియుల్క తొణకల్పడు వేగ్రిఖుల జుట్టువిప్పి' మొ॥—అం3
'సీ॥ ఆబద్ధచక్రంబులై మింట గద్దలుతెక్కలల్లార్చి పరిభ్రమింప' మొ॥—అం3

ఈగర్వము సహేతుకము సర్వమునైనదేకాని యుత్తరకుమారప్రజ్ఞలు గావు. ఈతఁ డన్నీచేసి యథార్థమును బల్కినాఁడు. ఈ యాత్మవిశ్వాసవికతనత్వములు దైవబలమునుగూడ ధిక్కరింపఁజేసిన వితనిని. కృతకకలహాంకమున నందవంశనాశనమును దైవమే యొనర్చెనని చంద్రగుప్తుఁడు పల్కగాఁ, జాణక్యుఁడు 'దైవముగావించె ననుకొనువారు విద్వాంసులేకా' రని తెల్పి తన యహంభావమును ప్రకటించినాఁడు.

ఇతఁడు శత్రువులదగ్గరకుఁ జారులుగాఁ పంపునపుడు సమర్థులైన వారిని, నమ్మకమైనవారినిగా నేఱి పంపు జాగరూకుఁడు. కేవలము ధనాశ కలవారినికాక రాజునకుగాని తనకుగాని యాబాలమిత్రులు, బంధుగులైనవారినే యేఱి పంపును. రాక్షసునియొద్దకుఁ బంపఁబడిన జీవసిద్ధియను బౌద్ధసన్యాసి, తన సహాధ్యాయియు నాబాల్యమిత్రుఁడు నగు నిందుశర్మ; శుక్రదండనీతియందును చతుష్షష్ట్యంగములుగల హోరాశాస్త్రము

నందుఁ బ్రవీణుఁడు. భాగురాయణుఁడు చంద్రగుప్తున కాబాల్యస్నేహితుఁడు. సిద్ధార్థకుఁడు పాపభీతి, యంతరాత్మ లేని చాణక్యప్రియుఁడు. వీరి ముగ్గురమీఁదనే చాణక్యుని తంత్రమంతయు ముఖ్యముగా నాధారపడి యున్నది. వీరు చాణక్యచంద్రగుప్తులకుఁ బరమాప్తులగుటచేఁ దమకు నియోగింపఁబడిన కార్యములను స్వకార్యములకంటె నధికశ్రద్ధాభక్తులై చేయుదురు. ఇఁక ఫలమన్ననో తమస్వామి జయమొందఁగ గొదువ లేదు కదా. మిగిలిన నిపుణకుఁడు మొదలైనవారు సార్థక నామధేయులు. ఈవిధముగ చాణక్యునిబుద్ధి యెంతదుర్గ్రాహ్యమో, యతనిభటు లంత గూఢప్రవర్తకులు. కౌటిల్యుఁడు పర్వతవిరోచకులఁ జంపిన యెంత కృతఘ్నుఁడో సిద్ధార్థక భాగురాయణులు దమ తాత్కాలిక స్వాములైన రాక్షసమలయకేతులను ద్రోహముసేయుటయం దంత పాపభీతిలేనివారు. చాణక్యుఁ డెంతజాగరూకుఁడో వీనిభటు లంత జాగరూకులు. స్వామిభృత్యు లిరువురు నిపుణకులు, నెంతమాత్రము తొందరపడనివారు. కాన వారికార్యము సంపూర్ణ విజయముగాంచినది.

ఇఁక రాక్షసమంత్రి యెట్టివాఁడో యతఁడు చేరఁదీసిన భటులు గూడ నట్టివారే. రాక్షసుఁడు దన స్వాములైన స్వర్గస్థులగు నందరాజుల శత్రుసంహారమునకై యెట్లు పాటుపడిన కృతజ్ఞుఁడో, యతని భటుఁడును మిత్త్రుఁడునగు చందనదాసు, మిత్రకుటుంబరక్షణార్థము దన ప్రాణధనంబులఁగూడ గోల్ప్వోసిద్ధపడిన స్వార్థత్యాగి. రాక్షసుఁ డెట్లు దూరదృష్టిలేక సిద్ధార్థకాదుల తొందరపడి నమ్మెనో, తనభటులగు దారువర్మాదులుకూడ తొందరపడి రాజశాసనమునకు ముందే రాజద్వారము నలంకరించి, చాణక్యసంశయమును బ్రేరేచి మోసపోయిరి. చంద్రగుప్తునిఁజంప నియోగింపఁబడిన బర్బరకుఁడుగూడ తొందరపడుటచే దారువర్మ యంత్రతోరణమునవలెఁ జచ్చెను. ఇందుచే రాక్షసుని తంత్రము విఫలమైనది.

రాక్షసునివలెఁగాక చాణక్యుఁడు దనరాజైన చంద్రగుప్తుని యందు నిర్లక్ష్యముతో సంచరించును. అతనిని 'వృషలా' యని సంబోధించును. మఱియు చాణక్యుని ప్రవర్తనమును సంభాషణములు నతి గూఢములు. గోడలకుఁ జెవులుండునని యాతఁ డెఱుఁగును. ప్రారంభ

మునసే 'భద్రభటప్రముఖులను గృతకృత్యులఁజేసితిగదా' యనును. ఎట్లు చేసెనో, యేమిచేసెనో తెలుపఁడు. సిద్ధార్థకునికి కూటలేఖనిచ్చి పంపి 'రాఁదగిన పరులందఱు వచ్చిన తరువాత నీ ప్రయోజనము నెఱవేర్పు' మని నుడివి చెవిలో రహస్యముగా నేదో చెప్పెను. ఈతని చర్య లన్నియు నిగూఢములే. భాగురాయణుఁ డీతని నీతివైచిత్ర్యమును మెచ్చుకొనుచు,

'సీ॥ అరయలక్ష్యోద్భేదమై మాటిమాటికి నధిగమాభావగమనమునగుచు
చిత్రచిత్రాకృతిఁ జెలగును నీతివిన్నీతి యెప్పుడు దైవనియతివోలె'

గీ॥ 'సరిగఁజాణక్యుఁడన బృహస్పతిసమానుఁ డతనియాలోచన మగాధమైన దందు
మునిగిపోవనివారలు ముజ్జగముల లేరు నిక్కము నిక్కములేరు లేరు॥' అం ౫

మఱియు రాక్షసుని తంత్రమునకు జాణక్యుని తంత్రమునకు బహు భేద మున్నది. రాక్షసుఁడు చంద్రగుప్తుని సంహరించుట కనేకుల వినియోగించెను. అందులో నెవరు దన కార్యమును నెఱవేర్పలేకపోయినను మఱియొకరు దానిని సాధింపవచ్చు నను నాశగలదు. చాణక్యుని తంత్ర మిట్టిదికాదు. అది యెక్కువప్రమాదమును గష్టము నైనది. చాణక్యచారు లొకరు చేయఁజాలనిది మఱియొకరు సేయ సాధ్యముగాదు. అందఱు దమ తమ కార్యములను సంతృప్తికరముగ నెఱవేర్చిననే కాని ప్రధానకార్యము నెఱవేరదు. వీరిలో నే యొక్కఁడు కొంచెము లోపము చేసినను తంత్రమంతయుఁ జెడి, రహస్యము బయలుపడి వారందరు సంహరింపఁబడుదురు. ఇది కత్తిమీఁద సామువంటిది. కాన చాణక్యచారు లందఱు దమ నియమితకార్యమందు చక్కఁగ శిక్షింపఁబడిరి. అందుచే వారు కృతకృత్యులైరి. రాక్షసుని వ్యూహములు ప్రత్యేకములగుటచే నొక్కొక్కటే బయలుపడగానే పూర్వశంకితుఁడైన చాణక్యుఁడు దన సూక్ష్మదృష్టిచే గ్రహించి వానిని క్రమముగా ముక్కలు ముక్కలుచేసి నిర్మూలముచేసినాఁడు. చాణక్యుని వ్యూహములు ప్రత్యేకములుగావు. అన్నివ్యూహములు గలసి యొక మహావ్యూహముగాఁ బరిణమించి, రాక్షసుఁడు నిశ్శంకితస్థితిలో నుండగా నన్నివ్యూహములు నొక్క మాఱుగా తలుపులు దెఱచుకొని, పడగలెత్తుకొనిన త్రాచుపాములవలె బుసలుకొట్టుచుఁ దనపై నాలుగుమూలలనుండి యొక్కమారు పడఁగ

తప్పించుకొనుటకుఁగాని, ఛేదించుటకుఁగాని తనకు సాధ్యముగాకపోయి
నది. అందుచే చాణక్యవ్యూహము మహాదారుణముగ పరిణమించినది.

ఇంక రాక్షస పరాజయమునకు మలయకేతు వెంతవఱకు కారణ
భూతుఁడో విచారింతము.

**మలయకేతువు:—** నందవంశనాశన ప్రతీకారార్థమె రాక్షసుఁడు
చాణక్య చంద్రగుప్త సంహారమునకుఁగా మలయకేతువు నాశ్రయించి
యాతనిపై నెంతగౌరవ విశ్వాసములు గలిగియుండినను, సమర్థుఁడగు
మంత్రియందు శత్రువగు చాణక్యున కున్నంతమాత్రపు గౌరవవిశ్వాస
ములుగూడ లేకపోవుటయేకాక, మలయకేతు వాతనిపై యనుమాన
ముతో నుండెను. ఆతనిగుణములం దీతనికి గౌరవము లేదు. లేదా
యాతని గుణముల నీతఁడు గుర్తింపలేని మందమతి.

గీ॥ 'మంత్రి పుంగవులెందు భూమండలాధిపతులముందఱ నొకరీతిఁబల్కుచుంద్రు,
అర్థమది తెల్లముగమాటలాడునపుడు మఱొకవిధముగ జరుగుసంభాషణంబు.' ॥అం.4.

ఈదుర్గుణమునకుఁదోడు మలయకేతువునకు స్వతంత్రాభిప్రాయ
ములు లేవు. కర్ణ శకున్యాదుల దుర్బోధలందు దుర్యోధనుఁ డెక్కువ
ప్రమాణము సూపినట్లుగ, భాగురాయణుని దుర్బోధలకు మలయ
కేతువు వశ్యుఁడైనాఁడు. వాని బోధనలందలి సత్యాసత్యముల విచా
రించుటకైన నీతఁడు ప్రయత్నింపలేదు. రాజ్యతంత్ర విషయమగు
చాణక్య చంద్రగుప్తుల కలహమునుగూర్చి మలయకేతువు రాక్షసు
నితో భిన్నాభిప్రాయుఁడై యతనితో కువాదము సేయును. ఇతనికి
మంత్రిపై రాజ్యనిర్వహణ తంత్రమందు గూడ విశ్వాసము తక్కువేయని
దీనివలనఁ దెలియుచున్నది. రాక్షసుని విశ్వాసమునుగూర్చి యితఁ
డవ్యవస్థితిలోనుండెను.

మల:- (తనలో) రాక్షసుని ప్రవర్తనముం గుఱించి పెక్కువికల్ప
ములు పుట్టుచుండుటచే నామది కేదియు నిశ్చయంబు దోఁచకున్నది.

ఉ॥ నందులమీఁదిగౌరవమున నందకులానుగతంబుగా మురా
నంద కులార్కుఁగా సచివనాయకవర్జితు నాశ్రయించునో
నందులమీఁదిభక్తిఁ జలనంబొలయించుక సత్యసంధతం
జెందునొ రాక్షసుండనుచుఁ జేతముకుమ్మరిసారె యయ్యెడుఁ॥ అం.5

ఈతఁడు రాక్షసుని మంత్రిత్వమునుండి తొలగించుటచే నీతనిపరిపూర్ణ సామర్థ్యము దెలుపుచున్నది. సాయపడవచ్చిన యైదుగురు రాజులఁ జంపించుటచే నీతని యవివేకము స్పష్టమగును. 'శేషం కోపేన పూరయేత్' ననట్లు చేతకాని కోపము, గర్వము నితని కధికము. చివరకు త్తరకుమారప్రజ్ఞ లధికమైనవి.

సీ॥ 'కొసరుఁ జాణక్యుఁడును నీవుగూడ మౌర్యుతోడ నేకీభవించి పోరాడరంటు
నిర్ణయంబు త్రివర్గము దుంపఁద్రెంపుకరణిగా నేను మీత్రివర్గమునడంతు!' అం. 8

వీని శీలమును రాక్షసుఁడు చివరకిట్లు క్రోడీకరించి చెప్పెను.

సీ॥ 'నిర్భాగ్యులొల్చు వాడైన నిపుణ మంత్రియునుగూలు'

ఈ విధముగ రాక్షసుని 'నవనవోన్మేషధీరప్రజ్ఞ' మలయకేతువు మూలమున బూడిదలోఁబోసిన పన్నీరువలె నగుటచే మంత్రి పరాజయ మందెను. పండితుని గుణముల గ్రహింపఁగల రా జుండినపుడే వాని గుణములు శోభించును; లేని యెడల వృథ. అట్లే యీ నాటకమున రాక్షసుఁడును, వేణీసంహారమున నశ్వత్థామయు నిష్ప్రయోజకులైరి. రాక్షసుని మహానుభావత్వము చాణక్యుఁడు గుర్తించి తా నుపయోగించుకొనినాఁడు. మఱియు మహాత్ముల గుణములు మహాత్ములకే గోచరించును గాని నీచుఁడైన మలయకేతువువంటివానికి గోచరింపవు. ఈతఁ డవివేకి యని చాణక్యుఁడు ప్రథమముననే గ్రహించి, రాక్షసుని వలలోఁబడి యున్నను నీతని తేలికగ జయింపవచ్చునని నిశ్చయించి యట్లు చేసెను. ఈతఁ డవివేకి కనుకనే తనతండ్రిని చంపినది చాణక్యుఁడని ప్రథమమున భాగురాయణుఁడు చెప్పగనే సత్యాన్వేషణముసేయక యతని దగ్గరనుండి పాఱిపోయెను. చివరకు జీవసిద్ధి, యతని తండ్రిని రాక్షసుఁడే చంపెనని భాగురాయణుని సమక్షమునఁ జెప్పగ నదే విశ్వసించెనుగాని భాగురాయణుని పూర్వవచనమును గూర్చి చర్చించి యతని ననుమానించలేదు. ఇఁక రాక్షసుని పరాజయమునకుఁ జంద్రగుప్తుఁ డెంతవఱకు కారణమయ్యెనో విచారింతము.

చంద్రగుప్తుఁడు:— ఈతఁడు చాణక్యునిపై నపారభక్తి విశ్వాసములు గలవాఁడు. చాణక్యుని శక్తిసామర్థ్యములఁ బూర్తిగా నెఱిఁగి, యతనియందు సంపూర్ణ కృతజ్ఞతఁగలవాఁడు. తనకు రాజ్యప్రదాత

యతఁడేయని దృఢముగ నమ్మెను. ఇతఁడు చాణక్యుని గురువుగా భావించెనేకాని కేవలామాత్యమాత్రునిగా స్వప్నమందైనఁ దలఁపలేదు. చాణక్యుఁడు నిండుసభలోఁ దన్నుఁ 'వృషలా' యని పిలచినను దాని నగౌరవసూచకముగ నతఁ డెన్నడు గ్రహింపలేదు. తన రాజరికము చాణక్యునొద్దఁ జూపకుండుటయెకాక, యాతని యాజ్ఞకు మారాడువాఁడైననుగాఁడు. ఈవిధముగా నతని శిక్షలోఁ బెరిగినవాఁడు. చాణక్యుని యాజ్ఞను బ్రశ్నించుటకుఁగాని, యాతని రహస్యములలోఁ బాల్గొనుటకుఁగాని యీతఁడు ప్రయత్నింపఁడు. చాణక్యుని వాక్య మీతనికి వేదప్రమాణము. కనుకనే నందవంశ నిర్మూలనానంతరముగూడ చాణక్యుఁడు తనమీఁద వాత్సల్యముచేతనే చంద్రగుప్తామాత్యశస్త్రమును గ్రహించుట.

మఱియు నితఁ డుచితానుచితముల నెఱిఁగిన వివేకి. స్వతస్సిద్ధముగా బుద్ధిశాలి. సమర్థుఁడు. చాణక్యానుశాసిత కృతకకలహారంభుఁడయ్యు గురువాక్య తిరస్కార మహాపాతకశంక కలుషిత హృదయుఁడితఁడు. గురు వాదేశించిన కపటకలహమును బహుసామర్థ్య చమత్కారములతో నిర్వహించిన సమర్థుఁడు. ఇదితని శిక్షాఫలితము. రాజ్యతంత్రవిషయమున రాక్షసునితో మలయకేతువు యథార్థముగ నతనితో భేదించి కువాదముసేయగ, చంద్రగుప్తుఁడు చాణక్యునితో నలీకవాదము సేయును. గురువులకు బహువినయపరుఁడు. చాణక్యాజ్ఞాపితుఁడై రాక్షసునకు నమస్కరించి యతని యాశీర్వచనమునకుఁ బాత్రుఁడగును. ఇతఁ డన్నివిధముల నదృష్టవంతుఁడు. ఈ విషయమునే రాక్షసుఁడు శ్లాఘీకరించి,

గీ॥ 'జయముగొనుమందబుద్ధి మంత్రియు నదృష్టవంతుడైన జిగీషుఁ జేపట్టినేని' అం. 7.

నూత్నమంత్రియైన రాక్షసుని గౌరవముచేతనే చాణక్యునిష్టముపై మలయకేతువును చంద్రగుప్తుడు క్షమించి వదలివేయును.

భాగురాయణుఁడు:— ఇతఁడు చంద్రగుప్తునకు సేనాపతి యగు సింహబలునకుఁ జినతమ్ముఁడు. చాణక్య ప్రేరితుఁడై మలయకేతువు నాశ్రయించి యతని నమ్మించి, యతనికి రాక్షసునికి భేదమును బుట్టించుటకై చాణక్యునిచేఁ బంపఁబడిన చారుఁడు. ఇతఁడు దనకార్యమును నిర్వహించుటలో బహుసమర్థుఁడు. చాణక్యుఁడే విషకన్యమూలమున పర్వ

తకునిఁ జంపెననియు, మలయకేతువునుగూడ నతఁడు చంపనున్నా డనియుఁ గాన చాణక్యునుండి పాఱిపొమ్మని మలయకేతువుతోఁ జెప్పి, ప్రాణదాతయను మిషచే నతనికి ప్రాణప్రియుఁడై సంచరించును. ఐనను నీతనికిఁ బాపభీతి లేకపోలేదు. మలయకేతువునకు ద్రోహ మాచరించుటలోఁ గొంచెము పాపమును శంకించును. 'ఇప్పగిది మనయందు దయఁ జూపించు కుమార మలయకేతువును మోసగించుట తగనిపనికదా, యని పంచమాంకమున దలఁచును. కాని తనగురువగు చాణక్యునకే తా నెక్కువ భక్తుఁడనియు, నాతని దాస్యమే పరిగణనీయమని భావించి సద్దుకొనును.

'మ॥ కులముంగీర్తియు సిగ్గుమానమును సంకోచంబు వోనాడి ..'అం.౫.

వేణీసంహారమున ద్రోణప్రవర్తనమును దుర్యోధనునకు కర్ణుఁడు దుర్వ్యాఖ్యానము చేసినట్లుగ, 'ఒథెల్లో'నాటకమున ఇయాగో, ఒథెల్లోకు దుర్బోధ చేసినట్లుగ, నీనాటకమున భాగురాయణుఁడు మలయకేతువునకు భద్రభటప్రభృతులవాక్యములను రాక్షసునిపై ద్వేషమును బ్రేరేచునట్లు వ్యాఖ్యానము సేయును. ఇది మలయకేతువు హృదయమున రాక్షసుని విషయమై విషబీజముగ నాటి క్రమముగ బ్రవర్ధమానమైనది. రాక్షసునకుఁ జంద్రగుప్తుఁడు వైరికాఁడు. చాణక్యుఁడుమాత్రమే వైరి యనియు, చంద్రగుప్తుఁడు చాణక్యుఁ బరిత్యజింపఁగనే రాక్షసుని మంత్రిగా పరిగ్రహించుననియు, దానికే రాక్షసుఁ డెదురు చూచుచుండెననియు, నంత మలయకేతువును శత్రువుల కప్పగించు ననియు సూచించెను.

విశ్వాసఘాతకుఁడుగ ప్రవర్తించుటయం దితఁడు కడునిపుణుఁడైన సమర్థుఁడు, కృత్రిముఁడును. మలయకేతువు వినున ట్లాతనితండ్రి మరణమును రాక్షసుఁడే కూర్చెనని జీవసిద్ధిచే నిపుణముగ ననిపించును. మఱియు రాక్షసుఁడు 'సిద్ధార్థకునకు బహుమానముగా నిచ్చిన నగను దుర్వ్యాఖ్యానము సేయును. పితృహంతకుఁడైన రాక్షసుని మలయకేతువు చంపునేమో యని భయపడి, తన గురువగు చాణక్యుని యాదేశము వృథకాకుండుటకై రాక్షసుని మలయకేతుకోపానలమునుండి రక్షింపనెంచి మలయకేతువుతో రాక్షసుని పూర్వప్రవర్తనమును రాజభక్తియదృష్టితో సమర్థించి నందరాజ్యప్రాప్తివఱకు నాతని చంపరాదని

హితోపదేశముజేసి రాక్షసుని కాపాడును. ఈ విషమపరిస్థితులలో నీతనికిఁ బ్రశంసనీయమగు యుక్తినైపుణ్యమును, సమయస్ఫూర్తియు గలదు.

కూటలేఖాదులమూలమున రాక్షసుఁడు మలయకేతు ద్రోహి యని నిర్ధారితముకాఁగ లేఖను వ్రాసిన శకటదాసుని గొనివచ్చుటకై మలయకేతు వానతియ్యగా భాగురాయణుఁడు తంత్రవిభేదమగునని వెంటనే భయపడి 'శకటదాసుఁడును రాక్షసునిముందర నా యుత్తరము దా వ్రాసినదని యొప్పుకొనఁడు. మరియొకని వ్రాసి తెప్పింపు' మని దురూపదేశము చేసి పెడమార్గమునఁ బెట్టును. మలయకేతుఁడును నమ్మి యట్లే చేయును. ఇట్లు కృత్రిమప్రవర్తనమందుకూడ నితఁడు బహునిపుణుఁడై చివరవఱకు సామర్థ్యముతోఁ గొనసాగించును. ఈ విషయముల నితఁడు గురువునకుఁ దగిన శిష్యుఁడు. ఈ విధముగా చాణక్యగురువు నందు భయభక్తులతో సంచరించినాఁడు. చాణక్యతంత్రమున నితఁడు బహుకష్టమైన గొప్పభాగము వహించినాఁడు. బహునిపుణునకు సూక్ష్మబుద్ధికిఁగాని యితరునికిది సాధ్యమగునట్టిదికాదు. ఏమాత్రము ప్రమాదము జరిగినను తంత్రము విభేదమై సమస్తము విపరీతముగ చాణక్యునికి పరాజయమును, రాక్షసునికి జయమును, దన మరణమునుగూడ జరుగును. ఈతని బాధ్యత కత్తిమీఁద సామువంటిది. రాక్షసపతన కారణమగు రాక్షసమలయకేతుభేదమంతయు నీతనిమీఁదనే యాధారపడి యున్నది. ఈతని సమయోచిత యుక్తు లనేక సంకటములనుండి దాటించి చాణక్యతంత్రమును జయప్రదము గావించినది. తనకార్యనిర్వహణమున బహుజాగరూకుఁడు. ఎప్పుడు నేమరియుండఁడు. కార్యసాధనదక్షుఁడితఁడు. స్వామిభక్తిపరాయణుఁడు భాగురాయణుఁడు.

సిద్ధార్థకుఁడు:— ఇతఁడు భాగురాయణునివలె చాణక్యునియందు భయభక్తులుగల చారుఁడు. కాని యితనికి పాపభీతియు, నంతరాత్మయు నావంతేని లేదు. సార్థకనామధేయుఁడు. చాణక్యప్రేరితుఁడై రాక్షసప్రాణస్నేహితుఁడును లేఖకుఁడు నగు శకటదాసునకు హితునివలె సంచరించి యతనికి ద్రోహము సేయువాఁడు. ఈతఁ డితరచారులవలెనె చాణక్యునిచే సుశిక్షితుఁడు. గుర్వాజ్ఞ నెఱవేర్చి, రాక్షసముద్రాంగుళీయక

మొక్కడ దొఱకినది ప్రాణభయమునఁ జందనదాసు నింటివద్ద పడినది దొఱికె నని పోలఁగునట్లు రాక్షసునితోఁ బొంకెను. రాక్షసుని యొద్ద నమ్మకమునకై కొంతకాలము సేవించియుండుటకును; నాతనికి నమ్మకము పుట్టించుటకును 'ఆ కౌటిల్య బ్రహ్మచారి కపకారముచేసి యటుపై బాటలీపుత్రమున గాపురము చేయుట కష్టమని దేవరకుఁ దెలిసిన విషయమే కనుక దేవపాద సేవ సేయుచు నిచ్చటనే యుండఁగోరెద' నని పరమసాహసమున బ్రార్థించి సమయోచితముగ నక్కవినయములు చూపఁగల్గిన ప్రవర్తనయందు నేర్పరి.

అసత్యమునుకూడ సత్యభ్రాంతిగల్గించునట్లు నటించుటలో గృత్రిమకలహసందర్భమున చాణక్యుఁ డెంత కుపితుఁడో సిద్ధార్థకుఁడుగూడ లేఖతోఁ బట్టుబడి యడుగఁబడగా బినకు దెలియదని యుత్తరమిచ్చి, దండింపఁబడిన తర్వాత సర్వము భాగురాయణాదులకుఁ జెప్పి పిమ్మట రాక్షసుఁ డడిగినపుడు 'సిగ్గువిడిచి దెబ్బ చూసినమాటచే నాలాగు చెప్పితి' నని పల్కి యసత్యమునుగూడ సత్యమునవలె నటించినాఁడు. రాక్షసుని గౌరవాదరములకుఁ బాత్రుఁడగునట్లు వినయముతోఁ బ్రవర్తించి, రాక్షసుని సమ్ముఖమునఁ జంకుఁగొంకు లేక పాపభీతి లేక యసత్యముగ లేని దోషారోపణముచేయుట కెంతటి మొండిధైర్య ముండవలయునో, యెంతటి గుండెకాయ యుండవలయునో యెంతటివాఁడు. ప్రత్యక్షపిశాచమువంటివాఁడు, సిగ్గుభయము లేదు; లేకపోయినను నున్నవానివలె నటించును. జీవసిద్ధిభాగురాయణులు రాక్షసమలయకేతువులకుఁ బరోక్షమున క్రమముగ నపకారము, ద్రోహము నాచరింపఁగ సిద్ధార్థకుఁడు ప్రత్యక్షముగ రాక్షసునకు ద్రోహముచేసి పూర్వకృతోపకారమునకుఁ గృతఘ్నుఁడై, మిత్రుఁడైన శకటదాసు గూడ రాక్షసునకు శత్రువను భ్రాంతిని గల్పించినాఁడు. ఇట్లు నటించుటకూడ బహుకష్టము. ప్రపంచమున నిట్టి వారు లేకపోలేదు కాని చాల యరుదు. పాశ్చాత్య నాటకములలో నిట్టివారు గనఁబడుదురు. 'ఒథెల్లో' నాటకమున 'ఇయాగో' యిట్టివాఁడు. మాక్బెత్తు నాటకములో మాక్బెత్తు, నతని భార్యయు నిట్టివారే.

ఇంత యాగడము చేసియుఁ జాలక షష్ఠాంకప్రవేశకమున సమిద్ధార్థకుని గూడ చందనదాసుని వధ్యస్థానమునకుఁ గొంపోవు ఘాతుకునిగా జేసి,

యట్లు సేయనిచో 'నీజీవలోకమున జీవింపఁదలఁచిన వాఁడెవఁడును చాణక్యుని యానతి కన్యథాచేయలేఁ' డని చెప్పి బెదిరించి, తాను చండాల వేషము ధరించి కటికవానిపని గూడ చేయ నిశ్చయించినాఁడు. వీఁడు ప్రత్యక్షరాక్షసునివంటివాఁడు. ఇట్టివాఁడుగూడ రాక్షసుఁడు 'బుద్ధిమంతుఁ' డని యోగ్యతాపత్రము నిచ్చును.

జీవసిద్ధి:—రాక్షస పరిగ్రహణమునకుఁ జాణక్య ప్రేరితుఁడై బౌద్ధ సన్యాసి వేషమున రాక్షసు నావహించిన మఱియొక శనిగ్రహ మితఁడు. బౌద్ధసన్యాసు లహింసాపరమధర్మమును పాటించువారుకదా! ఇతఁడు విషకన్యను సృష్టించి రాక్షసునకిచ్చి, యీవిషయమును జాణక్యునకుఁ దెలిపెను. పర్వతకుని విషకన్యమూలమునఁ జంపినది చాణక్యుఁడా, రాక్షసుఁడా, జీవసిద్ధియేనా యను విచికిత్స మలయకేతువునకుఁ గల్గించినది. వీని చేష్టను జాణక్యుఁ డనేక విధముల నుపయోగించుకొనినాఁడు. కుసుమపురమునుండి లేవగొట్టుటకు 'జీవసిద్ధి రాక్షసప్రేరణమున విషకన్యచే పర్వతేశ్వరుని చంపించె'నని దోషమారోపింపఁబడెను. మలయకేతువును వెళ్ళఁగొట్టుటకుఁ 'బర్వతేశ్వరుని విషకన్యచేచాణక్యుఁడే చంపించె' నని భాగురాయణునిచేఁ బ్రకటించును. రాక్షస మలయకేతు భేదసమయమున పర్వతుని రాక్షసుఁడే చంపించెననియుఁ, జాణక్యుఁడు విషకన్య ప్రేరైన నెఱుఁగఁ డనియు నితఁడే చెప్పి యింద్రజాలమువలె తథ్యమిథ్యా విచికిత్స కల్పించెను.

ఇతఁడు దన ధర్మమును బహుసామర్థ్యముతో నిర్వహించెను. పర్వతకుని రాక్షసుఁడే చంపించెనని దెలుపు సమయమున బహు సమయోచితములగు మాటలచేఁ దా నుడివినదంతయు సత్యమనుభావమునే కల్పించెను. బౌద్ధసన్యాసి వేషమునకుఁ దగినట్లు 'పాపము శాంతించుగాక రామరామ,' యని యుచ్చరింపఁజేసి పాత్రపోషణము గావింపఁ బడెను. రాక్షస మలయకేతు భేదఘట్టమున 'రాక్షసుని యొద్దనుండి బోవుచుంటివా' యని భాగురాయణునిచేఁ బ్రశ్నింపఁబడి 'రాక్షసుని పేరును పిశాచముపేరును వినఁబడనిచోటికిఁ బోవుచుంటి' నని నుడివి రాక్షస ద్రోహప్రకటనము చేయును.

చందనదాసు:— చాణక్యాచార్యులు దన గురువుపై నెట్టి దృఢభక్తి విశ్వాసములు గలవాఁడో, యీతఁడు దన స్వామియైన రాక్షసునియం దంత దృఢభక్తి విశ్వాసములు గలవాఁడు. కాని చాణక్యాచార్యులు నింద్యకర్మంబందు తన జీవితమును వినియోగించిరి. చందనదాసు పవిత్రకార్యమునకై దన జీవితమును ధారవోయ పాల్పడెను. ఈతని స్వార్థత్యాగము శత్రువులను గూడ ముక్కుపై వ్రేలు వేయించినది. రాక్షసకుటుంబము నీతఁడు దన స్వాధీనముచేయక రాజదండనమును భరించుటకు సిద్ధముగ నుండుటను గ్రహించి చాణక్యుఁడు దన హృదయములో మెచ్చుకొనుచు, 'సెబాసు చందనదాసా'

గీ॥ పరుల సంరక్షణముసేయుకొఱకుఁ గాదె వదలుచున్నావు స్వార్థలాభంబునీవు
ఇట్టిదుష్కరకార్యమింకెవఁడు సేయు వాఁడుభువిలోనశిబిచక్రవర్తితప్ప॥ అం. 1

అని కొండాడును. చందనదాసు దన స్వార్థత్యాగపూర్వకమైన రాజదండనమును బరమానందముతో నాహ్వానించునే కాని తనకష్టమునకుఁ గారకుఁడైన రాక్షసు నెంతమాత్రము దూరఁడు. రాక్షసునకుఁ దానాయుపకారము చేసినందులకుఁ దనజీవితము పవిత్రప్రయోజనమునకై ధారవోయ నున్నందులకుఁ దాను ధన్యుఁడయ్యెనని భావించును. 'నాచేసిన తప్పునకుఁగాక మిత్రకార్యమునకై నా ప్రాణములను గోల్పోవుచున్నాను. నాయదృష్టమే' యని యెంచును.

చందనదాసు వైశ్యుఁడైనను మూఢచిత్తుఁడుగాఁడు. చాణక్యుఁడు దన్నుఁబిలువనంపు టెఱిఁగి రాక్షసకుటుంబమును దన గృహమునుండి యెచటకో పంపివేసినాఁడు గనుక సూక్ష్మబుద్ధియని విదితము. కృత్రిముఁడగు చాణక్యునితో సంభాషించునపుడు తగురీతి నిపుణముగా మాట్లాడును. చాణక్యుని బెదిరింపు లితని స్వామిభక్తిని కదలింపఁజాలక పోయినవి. 'గడ్డిపరకలకు నిప్పుతో విరోధమెట్టిది.' మొదలగు వాక్చమత్కారముసేయఁ గలవాఁడు. చాణక్యచందనదాసుల సంభాషణ మెంతయు రసవంతము. తన తలమీఁద త్రాఁచుపామున్నను నిశ్చలచిత్తుఁడై స్వార్థత్యాగము చేసిన మహానుభావుఁడితఁడు.

వధ్యస్థానమున భార్యాపుత్రాదులు దనకై విలపించుచున్నను భార్యాపుత్రాదులఁ దగు రీతి సమాధాన పఱచి, వారికిఁ దగునుపదేశము

చేసి స్వధర్మాచరణాసక్తుఁడగును. చివరకు రాక్షసుఁడు వచ్చిన తర్వాత గూడ దన సాహస ప్రియత్నములు నిష్ఫలములైనందులకుఁ బరితపించును. ఈవిధముగ రాక్షసుని సాధుజీవనముకంటె నీతని పవిత్రజీవనముత్కృష్టముగఁ జేయఁబడినది. ఈతఁడు శిబి, జీమూతవాహనులతోఁ దుల్యుఁడైనవాఁడు. ఈతని పాత్రపోషణమున విశాఖదత్తుఁడు సంస్కృత పురాణకర్తలగు ఋషులతోఁ దుల్యుఁడగుచున్నాఁడు.

తృతీయాంకము – కపటకలహము:– వైతాళికుఁడగు స్తనకలశుని మూలమునఁ దానుపన్నిన చాణక్యచంద్రగుప్తుల భేదతంత్రి పర్యవసానమేయని రాక్షసునకు దృఢవిశ్వాసమును గల్పించుటకై యీకృత్రిమ కలహవ్యూహమును చాణక్యుఁడు పన్నెను. ఈకృత్రిమ కలహము కేవలము చాణక్యచంద్రగుప్తుల శుష్కకలహమే కాదు. ఇందు వక్రమార్గమున మలయకేతురాక్షసులకుఁ జరుగఁబోవు భేదమే సూచింపఁబడినది. ఈ రూపమున రాక్షసుని స్థితి వెక్కిరింపఁబడినది. రాక్షసుఁడు పడీపడఁబోవుచున్న యగాధకూపస్వరూప మిందు ప్రదర్శింపఁబడినది. చంద్రగుప్తుఁడు రాక్షసుని యోగ్యతను దెల్పుచు నతని తంత్రముచేఁ 'దన్నీతివంచితులైన మనము, నమ్మదగ భృత్యులెవ్వరో నమ్మదగని వారలెవ్వరో యెఱుఁగకున్నారమిపుడు'

అని చాణక్యునికిఁ దెల్పును. యథార్థమున కిది చంద్రగుప్తుని స్థితి కాదు, రాక్షసునిస్థితి. శత్రుస్థితి నాత్మారోపణము చేసికొనినాఁడు. రాక్షసుఁడీస్థితిలో నుండుటచేతనే కదా మోసపోయి పరాజితుఁడయ్యెను. కాని దానిని చివరకుఁగాని యెఱుఁగలేకపోయెను. తర్వాత చాణక్యుఁడు మంత్రిత్వమును త్యజించి రాక్షసుని దలంచి

గీ॥ ఏ జయించెదఁ జాణక్యునెడల భక్తి, శూన్యుఁడౌ చంద్రగుప్తుని సుఖముగ నని
తలఁచి నీచేయుదుష్టకృత్యంబులెల్ల, భవదనర్థంబునకె యిట్లు పరిణమించె.॥

యథార్థమునకుఁ జాణక్యునెడల భక్తిశూన్యుఁడైనవాఁడు చంద్రగుప్తుఁడుగాఁడు. రాక్షసమంత్రియెడ భక్తిశూన్యుఁడైనవాడు దుష్టకేతువు. అట్టివానిని సుఖముగ జయింపఁదలచి చాణక్యుఁడుచేయుమలయకృత్యములెల్ల రాక్షసుని యనర్థంబునకె (గ్రహించుటకె) యిట్లు పరిణమించెనని యన్యారోపణము. ఈకలహమున చంద్రగుప్తునకు నందరాజ్య

సంపాదనము చేసిపెట్టినది తన ప్రయత్నమేయని చాణక్యుఁడు చెప్పఁగా, రాజు దానిని తిరస్కరించి దైవమే దానికిఁగారణము గాని దాను గాదని నిరసించెను. అంతట చాణక్యుఁడు 'దైవమనిభావించువారు పండితులే కారని' సమాధానమిచ్చును. ఇది దైవబలమే ప్రాబల్యమని యెంచు రాక్షసుని మతమునుగూడ నాక్షేపించుచున్నది.

ఈ కలహమునకుఁ బ్రారంభమునఁ దన్ను దోడ్కొనిపోవుటకు వచ్చిన కంచుకివలనఁ బ్రతిషిద్ధకౌముదీమహోత్సవమును రాజే గ్రహించెనని విని, యతనితోఁ జాణక్యుఁడు మీరా సమయమున దుస్తంత్రములు పన్ని వృషలునకుఁ గోపమువచ్చినట్లుచేసితిరా? యని ప్రశ్నించును. ఇదియు రాక్షసమంత్రిపై మలయకేతువునకుఁ గోపమువచ్చునట్లు భాగురాయణాదులు చేసిన దుస్తంత్రములసూచించును. తర్వాత చాణక్యుఁడుకంచుకితో 'ఏమీ, రాజ పరిజనులకుఁ జాణక్యునిపై ద్వేషము' అనును. యథార్థమునకుఁ జంద్రగుప్త పరిజనములకుఁ జాణక్యునిపై ద్వేషము లేదు. కాని మలయకేతువునకుఁ దనకుఁ బరిజనముగనున్న భాగురాయణ సిద్ధార్థక జీవసిద్ధులే యాకాలమున రాక్షసునిమీఁద ద్వేషముగ నున్నారు. ఈరీతిగ రాక్షసుఁడు చతుర్థ పంచమాంకములందుండు స్థితి నాత్మారోపణము గావించుకొని వక్రమార్గమున నీకృత్రిమ కలహమునఁ జంద్రగుప్త చాణక్యులు రాక్షసుని హేళనచేయుటకై ప్రకటించిరి.

షష్ఠాంక ప్రవేశకము:— ఈప్రవేశకమున సిద్ధార్థక సమిద్ధార్థకుల సంభాషణరూపమున నాటకకథను, నందలి ముఖ్యపాత్రలగు రాక్షస చాణక్యుల శీలమును విమర్శించుచు నందలి గూఢములైన మర్మముల స్పష్టపఱచుచున్నాఁడు కవి. చాణక్యనీతివలన నక్రమముగా నడిచిననాటక కథను సమిద్ధార్థకుఁడు 'కుకవిచేసిన నాటకమునందువలె ముఖమునం దొకటియు, నిర్వహణమునం దింకొకటియు తటసించినదే' యని సామాజికులకు సామాన్యముగాఁ దోఁచు నభిప్రాయమును వ్యక్తీకరించు చున్నాఁడు అందులకు సిద్ధార్థకుఁడు 'బుద్ధిమంతుఁడగు రాక్షసుఁడుగూడఁ దెలిసికోలేని చాణక్యనీతి విషయమును నీవు దెలిసికొనఁ గోరుచున్నా'వని చెప్పి రాక్షసునకుఁ జాణక్యుని ముఖ్య ప్రయత్నము బోధముగా లేదను రహస్యమునుగూడ స్పష్టపఱచినాఁడు. చాణక్యుఁడు

సమిద్ధార్థకునిగూడ చండాలవేషమున చందనదాసును వధ్యస్థానమునకుఁ గొనిపో నియమించెనని, 'చాణక్యునికంటె ఘాతుకజనుఁ డీ లోకమున లేఁ' డని నుడివి, చాణక్యునిగూర్చి సామాన్యులకుఁగల్గు అభిప్రాయమును కవి దెల్పినాఁడు.

కథాసంధానము:— చంద్రగుప్తసామ్రాజ్యమును సుస్థిరముగా నిల్పుటకై రాక్షసుని చంద్రగుప్తునకు మంత్రిగాఁ జేయుటయే నాటక ముఖ్యకథ. దీనికి మలయకేతుసాయమున సేనతో దండెత్తి వచ్చు రాక్షసుని చాణక్యుఁడు బుద్ధిబలమున జయింపఁబూనుటయను బీజము, నట్టి రాక్షసునిపట్టి చంద్రగుప్తునకు మంత్రిగాఁ జేసి యాతని రాజ్యమును సుస్థిరముగ నిల్ప నాతఁడు నిశ్చయించుట యను నారంభములతోఁ గూడినది నాటకమున ముఖసంధియగుచున్నది. దీనికై వివిధచారులను బంపుట మొదలైన యనేకప్రయత్నములతోఁ గూడుకొని రాక్షసమంత్రి ప్రయోగముల విఘాత మొనర్చుటయు, రాక్షసుని భేదోపాయ పర్యవసానముగాఁ జాణక్య చంద్రగుప్తుల కపటకలహమును ప్రతిముఖ సంధియగుచున్నది. ప్రథమ తృతీయాంకములందుఁ దాఁబన్నిన వ్యూహములు సఫలీకృతములై చతుర్థాంకమున స్వరూపము దాల్చి, భాగురాయణుఁడు మలయకేతువునకు రాక్షసునిపై ద్వేషము పుట్టించునట్లు చేయుటయుఁ జాణక్య చంద్రగుప్తుల కలహము సత్యమని రాక్షసుఁడు విశ్వసించుటయు, చాణక్య తంత్రవ్యూహమున కుచ్ఛదశగాన నిది గర్భసంధియగుచున్నది. ఈ పరిస్థితులందుఁ జాణక్యునకు జయముగల్గునని యాతఁడును, దనకు జయముగల్గునని రాక్షసుఁడును సంపూర్ణవిశ్వాసములతో నుందురు. ఫలితము వెంటనే రాబోవు సన్నివేశమున స్థిరపడును. ఇంక పంచమాంకమున చాణక్యుని తంత్రము సంపూర్ణముగ జయముగాంచి, తానెంచినట్లు రాక్షస మలయకేతువులకు భేదము వాటిల్లి, రాక్షసుఁడు మలయకేతువుచేఁ దిరస్కరింపఁబడుటచే, రాక్షసుని పరాజయమును దన మనోరథమగు రాక్షస సంగ్రహమునకు మార్గము నేర్పడినదికాన నది యవమర్శసంధి యగుచున్నది. రాక్షసుని పతన మాకస్మికసంభవమగుటచేతను, చాణక్యతంత్రమువలనఁ దనకు శత్రువులెవరోఁ మిత్రులెవరో తెలియక దిగ్భ్రమచెందుటచేతను నద్భుతరసమిక్కడనుత్పాదింపఁబడినది.

సప్తమాంకమున చందనదాస రక్షణార్థ మరుగుదెంచిన రాక్షసుఁడు చాణక్యునిచేఁ బట్టుకొనబడుట నిర్వహణసంధి యగుచున్నది. సమస్త ప్రయత్నము లీ ముఖ్యవిషయముననే లగ్నమై యితర విషయములు లేకుండుటచే కథాసంధానము చక్కఁగ నేర్పడినది.

ముద్రారాక్షసము–నీతి:— విశ్వశ్రేయమునుగూర్చుటకై కావ్యమున నీతి వ్యంగ్యముగా కవి బోధింపవలెనని యాలంకారికుల యనుశాసనము. ముద్రారాక్షసమున చాణక్యుని చేష్టలన్నియు నసత్యవాక్కులు, ద్రోహములు, హత్యలు, కూటలేఖలు, కృత్రిమములు మొదలగువానితో నిండియుండుటయు, వీనిమూలమున కృతజ్ఞుఁడు, దయాపరుఁడు, సచ్ఛీలుఁడు నగు రాక్షసుఁడు జయింపబడుటయు పవిత్రశీలుఁడగు చందనదాసు వధింపఁబడఁబోవుటయు మొదలగునవి ప్రదర్శింపఁబడుటచే నీ నాటకము దుర్నీతిబోధకమనియు; గాన నసత్కావ్యమనియు నొక యాక్షేపము గలదు. ఈ నాటకము వీరశృంగారరసప్రధానములైన పౌరాణికములగు సామాన్య నాటకమువంటిది కాదు. ఇది రాజనీతిని ప్రకటించు రూపకముగాని సాంఘికనీతిని నిరూపించు నాటకము గాదు. రాజనీతికిని సాంఘికనీతికిని సర్వదేశకాలములందు భేదము గలదు. కాన రాజనీతిప్రతిపాదితనాటకమున సాంఘికనీతిబోధ లేదని దోషారోపణము సేయుట సరసముగా నుండదు. రాజనీతిని సాంఘికనీతిసూత్రములతో విచారింపరాదు. ఈ నాటకమును రాజనీతిసూత్రములతో సమన్వయించి దీని గుణాగుణముల విచారించుటమేలు. రాజనీతిదృష్టిలోఁగూడ నతినీచమైన నీతిపద్ధతు లీ నాటకమున మంత్రులచే నవలంబింపఁబడినవని విల్సన్ మొదలగు పాశ్చాత్యపండితులు నిర్దేశించి, తన్మూలమున నా కాలపు సాంఘికపరిస్థితు లతి నీచముగా నుండినవనికూడ నిర్ధారణచేసిరి. కాని సకలదేశకాలములందు శత్రువుల జయించుటకై సామ దాన భేదోపాయములఁ బ్రయోగించుటయు నఖిల నీచాతినీచపద్ధతుల నవలంబించుటయుగూడ మనము గనుగొనుచున్నాము. అద్యతనకాలమందుగూడ నంతకు హెచ్చుగా నున్నదేకాని తక్కువగా లేదు. ఒకరాజ్యతంత్రజ్ఞుఁడు మఱియొకనిని ఎక్కువతంత్రజ్ఞుఁడని మెచ్చుకొనుట యనఁగా నసత్యభాషణమున, కుమార్గావలంబమున

ద్రోహమునఁ దనకంటె నెక్కుడనై పుణ్యముగలవాఁడనియే భావము. కాన శత్రుమారణోపాయములఁబట్టి సాంఘికాచారముల నిర్ధారణ చేయుటకాని రాజనీతినిబట్టి సాంఘికనీతిని విచారించుటకాని సరసముగా నుండదు. అయితే కవి యిట్టివస్తువునేల గ్రహించి 'విశ్వశ్రేయఃకావ్య' మను సూత్రమునకు విరుద్ధముగా కావ్యము రచించనేల? యని పూర్వ పక్షములు గాఁబోలు. భారవి మొదటిరెండు సర్గలందును పంచతంత్రము నందును రాజనీతి బోధింపఁబడలేదా? అంతమాత్రమున దుర్నీతిబోధ కములయ్యెనా యవి? అవి శ్రవ్యకావ్యములు. ఇది దృశ్యకావ్య; మింతే భేదము. శ్రీరాముఁడు చెట్టుచాటునుండి వాలిని వధించుటయు, దపము సేయు శంబూకుని వధించుటయు దుర్నీతిబోధకమా? రాజనీతియా?

కావ్యమున నీతి వ్యంగ్యముగనుండునే కాని ప్రత్యక్షముగ నుండ రాదుగద. రామాయణాదికావ్యములలోఁగూడ భిన్నప్రకృతులుగల పాత్రలఁ బ్రవేశపెట్టి దుష్టపాత్రలతోఁ బోల్పఁబడి సత్పాత్రల సచ్ఛీలము మూలమున నీతి బోధింపఁబడినది. అట్లే యీ నాటకమున చాణక్య సిద్ధార్థకాది దుష్టపాత్రలతోఁ బోల్పఁబడి రాక్షసచందనదాసుల సచ్ఛీ లముల మూలమున నీతిబోధ జరుగుచునేయున్నది. రాక్షసుని యౌదార్య మును చందనదాసు స్వార్థత్యాగమును పురాణనాయకులతోఁ బోల్పఁ దగినవికదా! కాన వీరిమూలమున నీతిబోధ జరుగుచునేయున్నదని చెప్పవలయును. తెలాంగు, ధ్రువా, కాళే మొదలగు పండితులిందు దుర్నీతి లేదనియే వాదించుచున్నారు.

అయితే యీ నాటకమున సచ్ఛీలురగు రాక్షసచందనదాసులకు బరాజయకష్టములే సంభవించినవికదా! రామాయణాదికావ్యములలో సచ్ఛీలురకు ధర్మాత్ములకు జయమేగలిగినదిగాని పరాజయముగలుగ లేదు. 'ధర్మోజయతి' యను వాక్యమునకు ప్రతిబంధము జరిగిన దీనాట కమున కాన దుర్నీతిబోధకమని యందురా? ఈ నాటకమున రాక్షసుని యౌదార్యముకన్న సూక్ష్మముగ నాలోచించినఁ జాణక్యుని దృష్టి యౌదా ర్యతరమైనది. ఎట్లన శత్రువైనను గుణశాలిని శిరోభూషణముగా గ్రహించి నందరాజ్యమునఁ జంద్రగుప్తుఁడు శాశ్వతముగా నుండునట్లు చేసి వాని పాలనమున సకలప్రజలను రంజింపఁజేసి దా నరణ్యమునకుఁ

దపము సేయఁగ నేగుట శ్రేష్ఠతర విషయముకదా! పర్యవసానము మంచి దైనను నవలంబితమార్గములు దుష్టములైనవందురా! యజ్ఞమునుచేసి మోక్షమును బొందువాఁడు యజ్ఞమునకుఁ జేయు పశుహననము దుష్టమైనదేనా? దాన యజ్ఞకర్మ దుష్టక్రియయని చెప్పనగునా? నీచుఁడగు మలయకేతువునకు రాక్షసునివలన జయముగల్గినను రాక్షసునిదృష్టిలోఁ న్మృతించిన నందు లానందపడుదురేమో కాని భూప్రజకిప్పు డున్నంత సౌఖ్యముండదు. మఱియు మలయకేతువు కృతఘ్నుఁడగునే కాని కృతజ్ఞుఁడు కానేరఁడు. కాన రాక్షసునకు నంతసంతృప్తి గలుగదు. రాక్షసుని వంటి ప్రతిభాశాలికిఁ దగినరాజుగా నుండఁదగినవాఁడు చంద్రగుప్తుఁడు. వారిద్దరకు సఖ్యముగలుగుటకంటె వేఱు మేలులేదు. ఇఁక చందనదాసు కష్టములపాలైనను విషాదాంతముగ పరిగణింపకుండుటయేకాక దన మిత్రుఁడే కంటబడుటయు నంతయు సుఖపర్యవసానమగుటచే నిద్దరు సంతృప్తమనస్కులే. గోవ్యాఘ్రములవలె రాక్షస చందనదాసు లొకరిని మించిన స్వార్థత్యాగు లింకొకరు. రాక్షసకుటుంబరక్షణముచేసి చందన దాసు ప్రాణముల గోల్పోనుండఁగ, చందనదాస మిత్రప్రాణరక్షణార్థమై దనమతమునకు విరుద్ధముగా చంద్రగుప్తు సేవించుట కిష్టపడును. ఇదియంతయు సునీతి గాదా మానవదృష్టిలోను సాంఘికదృష్టిలోను గూడ. ఇట్టినీతి కావ్యమున గూఢముగ నంతర్వాహినిగ ప్రవహించుచునే యున్నది. మఱియు కావ్యప్రయోజనము 'వ్యవహారవిదే' యని గూడఁ దెలుపఁబడినది. కాన నిందు కృత్రిమములనుండి నరుఁడు జాగరూకత వహింపవలెనను లౌకికవ్యవహారమును బోధించుచున్నది. ఈ వ్యవహార మెఱుఁగక యెంతమంది యమాయకులు మోసగింపఁబడుటలేదు. కావ్యము మానవజీవితప్రతిపాదనము గాన నీ విషయములుగూడఁ దెలుపబడినవి. కాన నీ నాటకము దుర్నీతిబోధకమనుట తగదు.

నాయకుఁడు :—ఇక్కడ నాయక శబ్దము పారిభాషికము. నాటకమున నెవని కార్యమునం దారంభ ప్రయత్నాద్యవస్థ లుండునో, యెవనిపై నాటకకథ ముఖ్యముగానాధారపడియుండునో వాఁడే నాయకుఁడగును. ఆ నాయకుని చరిత్ర ముదాత్తమై యుండవలయును గాని యంతమాత్రమున నతఁడు ధీరోదాత్తుఁడు మాత్రమే కాని ధీరోద్ధతాది

యితరులు గారాదని యెంచరాదు. ఇతరులు మున్నుగుగూడ నాటకమున నాయకులు గాఁదగుదు. నాగానందమున జీమూతవాహనుఁడు ధీరశాంతుఁడైన నాయకుఁడు. స్వప్నవాసవదత్తమున వత్సరాజు ధీరలలితుఁడు. అట్లే వేణీసంహారమున భీముఁడు ధీరోద్ధతుఁడైన నాయకుఁడు. రామ దుష్యంతాదులు ధీరోదాత్తులు. మఱియు నాయకుఁడు రాజు మాత్రమే కావలయు నను నియమము లేదు. మృచ్ఛకటికమున చారుదత్తుఁడు బ్రాహ్మణుఁడు కాఁడా; అట్లే యీనాటకమున నాయకుఁడు చాణక్యుఁడు. కథయంతయు నీతనిపై నాధారపడి యున్నది; రాక్షసుని చంద్రగుప్తునకు మంత్రి చేయుట యను ప్రధానవిషయమున కారంభాది ప్రయత్నముల నొనర్చి సఫలీకృతుఁడైన వాఁడితఁడే. ఈతనిమీఁదనే నాటకకథాభిరుచి యంతయు నాధారపడియున్నది. కాన- నాయకుఁడు ధీరోద్ధతుఁడైన చాణక్యుఁ డగుచున్నాఁడు. ప్రతినాయకుఁడు రాక్షసుఁడు. కాని నాటకఫలమగు రాజ్యము ననుభవించువాఁడు చాణక్యుఁడు గాక రాజగు చంద్రగుప్తుఁడు గదా యను పూర్వపక్షము గలదు. కాని యిక్కడ రాజ్యానుభవమునకుఁ బ్రస్తుత కథకు సంబంధము లేదు. రాక్షస సంగ్రహణవిధానము నాటకవస్తువు. అందు చంద్రగుప్తున కేమియు జోక్యము లేదు. మఱియు చాణక్యుని చేతిలో కీలుబొమ్మ యితఁడు. స్వాతంత్ర్యహీనుఁడు. కాన నితఁడు నాయకుఁడు గాఁడు. ఒకవేళ నీతఁడు వాదమునకు నాయకుఁడగునని యెంచుచోఁ బ్రతినాయకుఁడెవఁడు? రాక్షసుఁడా? మలయకేతువా? చంద్రగుప్తుఁడు నాయకుఁ డగుచో మలయకేతువు ప్రతినాయకుఁడు గాదగును. అట్లగుచోఁ బ్రతినాయకుఁ డగు మలయకేతుపరాజయము కాదుగద యిక్కడ ప్రధానకార్యము. దానికైనను చంద్రగుప్తునకు జోక్యము లేదే. ఇది యిద్దరి మంత్రుల తంత్ర రూపమగు యుద్ధవిషయము. కాన నాయకుఁడు చాణక్యుఁ డగుచున్నాఁడు.

ప్రధానరసము :— చాణక్యుఁడు దన వైరులగు నందులకు మంత్రియుఁ బరమరాజభక్తుఁడునగు రాక్షసుని, మఱియు దన్ను దనరాజగు చంద్రగుప్తుని విరోధులుగా భావించి, మలయకేతువు సాయమున ససైన్యముతో దండెత్తి రానున్న రాక్షసుని, భేదోపాయమున జయింపఁ జూచుట

యీనాటకమందు ప్రధానవిషయము. కాన నుభయమంత్రుల పరస్పర జయాభిలాషకుఁ దమబద్ధవైరము కారణమై యాలంబన విభావమగుచున్నది. వీరి జయము చతురుపాయములలో దండోపాయముతోఁ గూడుకొనక కేవలము భేదోపాయముతోడనే కూడుకొని యుండుటచే సమర దృష్ట పటహ నిస్వనముకాక తంత్ర ముద్దీపన విభావ మగుచున్నది. దానికిఁ దగిన ట్లనుభావము శస్త్రముగాక 'బుద్ధిబల' మగుచున్నది. మఱియు నీభేదోపాయముగల చతురుపాయములును వైరమును సాధించుటయందే యుపయోగపడును గాన, చాణక్యరాక్షసులు వైరమును సాధించుకొనుటకై పరస్పరము భేద దండోపాయములఁ గ్రమముగా నుపయోగించి మహోత్సాహమునఁ బ్రయత్నము సేయుదురు కాన, నుత్సాహము వీరరసమునకే స్థాయీభావమగుచున్నది. కాన, నీనాటకమున ప్రధానరసము వీరమగుచున్నది. కాని రాజతంత్రవ్యూహములచే నద్భుతరస మక్కడక్కడ నాటకమున వ్యాపించి యుండుటచే ప్రధానరస మద్భుత మేమోయను భ్రాంతిని గొందఱకు గల్గించుచున్నది.

నాటకమున నద్భుతరసము ప్రధానమగుచో చమత్కార మాలంబన విభావమగును కాని వైరముకాదు. దీని కుద్దీపన విభావ మాశ్చర్యము గావలెఁగాని వైరసాధన కృత్యములగు చతురుపాయములుగావు. మఱి దీనికి విస్మయము స్థాయి కావలెను. కాని చాణక్యుని వైరసాధన ప్రయత్నమునఁ గొంత చమత్కారము లేకపోలేదు. అదియేదన ? శత్రువును మిత్రునిగాఁ జేసికొనఁ జూచు నపూర్వవిషయము. ఇది విస్మయ భాజనము గాన నద్భుతరసమనుట కవకాశ మిచ్చుచున్నది. కాని యిందలి యద్భుతము నాయకునిమీఁద నాధారపడిలేదు. మఱియు నది సర్వత్రా వ్యాపించియు లేదు. కాన నద్భుతము నాటకమున నంగముగ నున్నదనుటయు, వీరరస మంగియనుటయు మేలు.

కవిత్వము :—ఈ నాటకము సంస్కృతమున కటువైన శైలిలో వ్రాయఁబడినదని పలువురు పండితు లభిప్రాయపడుచున్నారు. భాష యెట్లున్నను భావములు మాత్రమున్నతములై వీరరసోచిత రసభావపూరితములైనవని నాయభిప్రాయము. ఇందులకుఁ గొన్ని యుదాహరణములు.

షష్ఠాంకమున రాక్షసుఁడు కుసుమపుర జీర్ణోద్యానమును బ్రవేశించి చేసిన యుద్యానవనవర్ణనమున సర్వవిధముల నాటక కథతో సమన్వయము గల్గి తత్కాలావస్థను స్ఫురింపఁ జేయుచున్నది.

సీ॥ 'అతిమహారంభ క్రియలచేత నంశంబురీతి సౌధము విపరీతమయ్యె.' "మొ. అం 6"

సప్తమాంకమున చాణక్యుని గర్వోద్ధత్యమెంతయు నుత్కృష్టముగా వర్ణితము.

సీ॥ 'ముడిచెనెవ్వఁడు పటంబుగ ఘనజ్వాలాకశాలియైన దవాగ్ని. మొ.' అం 7.

చాణక్యుని కోపమునతని రౌద్రోద్రేకవర్ణనము నతిరసవంతము ఇది కృతిప్రమకలహామునసే ...ట్లుండుట మఱియు గమణీయము.

సీ॥ ఆబద్ధ చక్రంబులై మింట గద్దలు అెక్కలల్లార్చి పరిభ్రమింప మొ. అం 8.

పాత్రల సంధిగ్ధావస్థయందు మానసిక ప్రవృత్తివర్ణనము సుందరముగఁ జేయబడినది. రాక్షసుఁడు మలయకేతువుచే దోషమారోపింపఁ బడినపుడు దనలో

ఉ॥ ఉత్తరమే నెఱుంగనను టొప్పదు ముద్ర మదీయమకాట మొ. అం 5.

మఱియొకమారు రాక్షసుఁడు చంద్రగుప్త మంత్రిత్వ మంగీకరించు నపుడు గూడ సందిగ్ధస్థితిలోనికిఁ దేఁబడి తనలో

ఉ॥ నందులప్రేమ వాయదు మనంబున, భృత్యుఁడనైతి విద్విష మొ అం.

మలయకేతువుచే తిరస్కృతుఁడై యేమియుఁ జేయునది లేక రాక్షసుఁడిట్లు విచారించును.

సీ॥ తపము సేయఁగఁ దపోవిపిన మేఁగినను,నంత రైర మడగునా దానిచేత 'అం. 5'

ఇందు మానవమానసిక ప్రవృత్తి చక్కగ వివరించి చూపినాఁడు కవి. ఈనాటకమున నన్యాపదేశముగ వ్రాయఁబడిన రెండుపద్యములు సందర్భమున కెంతయుఁ దగియున్నవి.అందు మొదటిది చాణక్యచారుఁడగు నిపుణకుఁడు 'చంద్రగుప్తున కనిష్టు లున్నారని చాణక్యునకుఁ దెలుపఁబంచిన పద్యము.

గీ॥ సరసిజాతంబు లవి మనోహరము లైన
జంద్రరూపంబుఁ జూడఁగాఁ జాల వెప్పుడు
బూర్ణమండలశాలియై బొలుచు చంద్రు
నకు విరుద్ధంబులుంటఁగాన మె జగమున॥

రెండవది రాక్షసుఁ డాయనకు విరాధగుప్తుఁడను రాక్షసునకుఁ బంపిన ప్రాకృతపద్యము.

కం॥ ఎందుఁగుసుమసముగము మకరందమెల్లఁ
గుశలమతి గ్రోలి తుమ్మెదల్ కొసకు దాని
గ్రక్కి యొకపట్టుగాఁగ నేర్పఱచుకొనుట
పరులకొఱకే కదా, తమ కొఱకుఁగాదు॥ 'అం. 2'

ఈవిధముగ కథకు రసమునకుఁ దగినట్లు కవిత్వము రమణీయము గను రసానందకరముగ నున్నది. ఈరీతి కవిత్వము కాళిదాస భవ భూతుల కవిత్వమువలె మృదుమధురముగను, రసావేశ పూరితముగను లేదని వాదించుట సమంజసము గాదు. ఎందుకన? పైవారి నాటకముల వలె నిందు శృంగార కరుణారసములు ప్రతిపాదింపఁబడలేదు. ఆ రసము నకుఁ దగు భావములందుగలవు. వీర రౌద్రరసములకుఁ దగు భావము లిందు గలవు. ఇందు ప్రతిపాదింపఁబడిన కరుణయు తత్సందర్భమునకుఁ దగియున్నది. కాని యీనాటకమున రమణీయమైన భావముగాని, రస వంతమైన పద్యముగాని యొక్కటైనను లేదను విల్సన్ పండితుని యభి ప్రాయము సరియైనది కాదేమోయని నే తలఁతును.

ప్రదర్శనార్హత:—నాటకమున రంగప్రదర్శనార్హత ముఖ్య ముగా గమనింపవలసిన విషయముగాన దానినిగూర్చి విచారింతము: ముద్రారాక్షసనాటకము నందరాజ మంత్రియగు రాక్షసుని చంద్ర గుప్తునకు మంత్రిగావించుటకై చాణక్యుఁడు చేయు ప్రయత్న మను రస వంతమైన ఘట్టముతో ప్రారంభించినది. చాణక్యుని సామర్థ్యమును ప్రదర్శించు వైఖరియో యన్నట్లతని రంగప్రవేశము వీర భయానక రసావేశపూరితమై రక్తికట్టించును. ఈతని ప్రారంభతంత్రాలోచన విష యము దీర్ఘముగా నుండినను, మధ్యమధ్య హేతువాదపూర్వక వివిధ భావపరంపరతోఁ గూడియుండుటచే షేక్స్పియరు నాటకము లందలి దీర్ఘస్వగతముల (Soliloquy) వలె నుండునేకాని, విసుఁగుపుట్టింపదు. ప్రథమాంకమున చాణక్యతంత్రాలోచనము, నిపుణకచారునిఘట్టము, సిద్ధార్థకకూటలేఖవిషయము, చందనదాస తిరస్కార మను నాల్గు రస

రసవంతమైన చిన్నచిన్న సన్నివేశములు గలవు. వీనియందలి యొక సంఘటన ముత్తరకార్యనిర్వహణమున కుపయోగించుచు కథారీతి ననుసరించి నూతనసన్నివేశము లుద్భవింపఁజేసి సామాజికుల కుత్సాహము నభిరుచియు గొల్పుచుండును. విశేషముగ నీనాటకమున మొదటి నుండి చివరవఱకు పాత్రల సంభాషణవైఖరి రమణీయమై, విలక్షణముతోఁ గూడికొనియున్నది. నాటకప్రదర్శనానుకూలత కిదియొక ముఖ్యలక్షణము. చాణక్యుఁడు శిష్యునితో సంభాషించురీతి యొకవిధము గను, చారుఁడైన నిపుణికునితో మాట్లాడువైఖరి మఱియొకతీరుగను, సిద్ధార్థకునితో వ్యవహరించుపద్ధతి యింకొకమాదిరిగను, చందనదాసుని పలుకరించుమార్గ మన్యముగ నున్నది. ఈ సన్నివేశములందు చాణక్యుని మానసికవ్యాపార మొకవిధముగను, గూఢవాగ్వ్యాపారము మఱి యొకరీతిగనుండి, భావాభినయ ప్రదర్శనము రమణీయముగను, చిత్రము గను చేయుట కవకాశ మొసఁగును. చాణక్యచందనదాసుల పరస్పర భావగర్భితసంభాషణము బహు రసవంతమై ప్రథమాంకము నంతయు రక్తిగట్టించినది. దీనియందలి చాణక్యుని యనునయ పూర్వకపు బెదరింపులు, వైశ్యుని నక్రవినయములు, నతనిరాక్షసభక్తి, చాణక్యుని హృదయము చందనదాసాభినందనము బహురసవంతమైన వివిధ భావాభినయ ప్రదర్శనమున కవకాశ మిచ్చుచున్నది.

ద్వితీయాంకమున ప్రతినాయక ప్రయత్నప్రదర్శనము గలదు. ఇందలి రాక్షసుని దీర్ఘస్వగతము కరుణరస భావపూరితము. రాక్షసవిరాధ గుప్తుల సన్నివేశము జాలిగొల్పును. కాని యిది వేణీసంహారనాటక మందలి దీర్ఘ యుద్ధకథనమువలె నెంతమాత్రము విసుగుగొల్పదు. రాక్షస ప్రయత్నభంగమును, శకటదాస వధను, విరాధగుప్తచారుఁడు దెల్పుచున్న సమయముననే శకటదాససిద్ధార్థక సన్నివేశము గూర్పఁబడి, యద్భుతముగొల్పును. ఇందలి భావాభినయము పాత్రపోషణమున కనువుగనున్నది. ఇఁక తృతీయాంక మంతర్నాటకప్రాయమై, కుహనాకలహ నటనము వివిధభావములను చేష్టలను ప్రదర్శించుటకు వీలుచేసినది. ఈ యంకమున కౌముదీమహోత్సవ నిషేధశ్రవణము, చాణక్యగృహసన్నివేశము, కపట కలహము లను మూఁడుఘట్టములున్నవి. కలహారంగము

మొదట బహు గౌరవాదరములతోను, మృదుసంభాషణముతో ప్రారంభించి క్రమముగా దూషణ తిరస్కార,కోప క్రోధ భావ ప్రకటనముతో పరిణమించును. అందుచే నిది సహజమై, బహు రసవంతమును, కపట మగుటచే విచిత్రముగనుండి పాత్రల వివిధ భావప్రదర్శన యోగ్యము గను, సామాజికుల కుత్సాహకరముగ నున్నది.

చతుర్థాంకమున రాక్షసుడు చారునితో - కుసుమపురసమాచార మరయు సన్నివేశము మధ్య భాగురాయణునిచే, రాక్షసునిపై కలుషిత హృదయుడుగా జేయబడు మలయకేతువు వెనుకనుండి ప్రవేశించి, రాక్షసు ననుమానించుఘట్ట మింకొకటి కలుపబడి, మిశ్రభావముల పేరేచినది పాత్రలకు. అంత సామాజికుల కుద్వేగము గల్గును. తర్వాత రాక్షస మలయకేతువుల సమావేశమును, రాక్షస క్షపణకుల సందర్శనము వివిధభావముల నుద్భవింపజేయును. పంచమాంకమున, సిద్ధార్థక క్షపణక సన్నివేశము, భాగురాయణ క్షపణక సమావేశము, కూట లేఖప్రదర్శనఘట్టము, మలయకేతు తిరస్కారరంగ మను నాలుగు నొకదాని నొకటిమించిన విచిత్రసన్నివేశములు. చాణక్యునితంత్రము బాహిరమగురంగము గాన నద్భుతముగనుండి పాత్రల వివిధ చిత్తవృత్తులు, రసభావోన్మేషమును, పాత్రోచితచేష్టలు నభినయించుట కవకాశముగల రమణీయ సన్నివేశములివి. షష్ఠాంకమున సిద్ధార్థక సమిద్ధార్థకరంగము పాత్రల భిన్నశీలముల ప్రకటించును. రాక్షసుని యుద్యానవన ప్రవేశ ఘట్టము కరుణరసభావముల కాకరము అతనిదీర్ఘ స్వగతము లతనిశీలమును స్పష్టపఱచును. రాక్షస విష్ణుదాసుల సన్నివేశము మఱియొక విచిత్రమై, రాక్షసుని యాతురత నుద్వేగమును పేరేచును. సప్తమాంకమున చందనదాసవధ ఘట్టము కరుణరసపూరితము. కడకు రాక్షస చాణక్యసమావేశ మద్భుతము రమణీయమునై బహువిధరసభావాభినయముల ప్రకటించుట కనువైనది. ఈ నాటకమున దూరప్రయాణ, యుద్ధచర్యాది విషయములు లేక రంగప్రదర్శనోచితమై యొప్పినది.

నాటకమున నసంభావ్యములు:— కవి మనల నొక యూహాప్రపంచమునకుఁ గొనిపోవును. అందు కవి నిర్దేశించు కొన్ని తత్త్వముల

నిశ్శంకముగా నంగీకరించినగాని కథ సాగదు. మఱియు కవి మూలకథ యందు సాధ్యములైన యసంభావ్య విషయములకంటె నసాధ్యములైన సంభావ్య విషయములనె గ్రహించి కవి దన వర్ణనా చమత్కారముచే నసాధ్యవిషయములు సుసంభావ్యములుగను మనకు నచ్చునట్లుగను మార్చును. అట్లయ్యు ప్రతియుత్తమ నాటకమం దక్కడక్కడ కొన్ని యసంభావ్యవిషయములు గోచరించును కథాసంధానమున కవి యశ్క్తుఁ దగులునుగాన వానికి గత్యంతరము లేకపోవుటచే సహింపవలయును. అట్టి వీనాటకమున.

1 శత్రువును దన రాజునకు మంత్రిగాఁ జేయఁజూచుట, రాజ తంత్రజ్ఞుఁడైన చాణక్యునివంటివానికిఁ దగనిది. మఱియు గర్వవిరోధి యగు మంత్రి శత్రువులకుఁగూడ త్రికరణశుద్ధిగా దాస్యమొనరించుననుట గూడ నట్లే యుండును.

2 చాణక్యుని కూటలేఖను సిద్ధార్థకుఁడు బైటబెట్ట మలయ కేతువు రాక్షసునిపై దోషారోపణము చేసినపుడు, మలయకేతువు బహుమానమైన నగ సిద్ధార్థకుని మూలమున శత్రురాజులకుఁ బంపబడు చుండె నని నేరమారోపింపఁబడినపుడు, రాక్షసుఁడు శకటదాసుని ప్రత్య క్షముగాఁ దెప్పింప మలయకేతువు బలవంతపెట్టిన సర్వము బయలు పడునుకదా !

3 మఱియు పర్వతకుని మరణమును భాగురాయణుఁ డొక విధముగను, జీవసిద్ధి మరియొక విధముగను చెప్పినపుడు, భాగురాయ ణుని మలయకేతు వంతమాత్రము ప్రశ్నింపకుండునా?

పతాకస్థానకము, లేక విరోధభావ స్ఫురణము-(Tragic irony):- నాటకరంగమున పాత్రలమాయకముగ పల్కిన మాటలవలనఁగాని, తటస్థమైన సంఘటనలవలనఁగాని విరోధభావము సామాజికులకు కథ ననుసరించి స్ఫురించినచో నది 'విరోధభావస్ఫురణమ'న బడును. దీని నాంగ్లమున (Tragic irony) అందురు. నాటకమున చమత్కారముగూర్పు టకై కవులు వీనిని ప్రయోగింతురు. ఇవి కవినైపుణ్యమును చాటును.

ఇది శ్లేష, ధ్వనిరూపములు నుండును. దీనిని నాటక లక్షణకర్తలు 'పతాకస్థానక' మనిరి.

1 ఈ నాటకమున ద్వితీయాంకమునందు రాక్షసుఁడు 'ఏను మిత్రుఁడగు చందనదాసు నింట గృహజనమునుంచి నగరము విడచి వచ్చుటమాత్ర మొక న్యాయమగు కార్యము జరిగిన' దని తలఁచును. అది ఏవిధముగ న్యాయమైనదో తాను వివరించుకొనును. కాని యథార్థమున కాకార్యమే తన పరాజయమునకు ముఖ్యకారణమైనది. కాన నిది సంఘటన రూపమగు విరోధభావస్ఫురణము.

2 రాక్షసుఁ డాయంకముననె 'శత్రురాజుల వృత్తాంతము లరయుటకును, తత్ప్రయత్న భేదము కొఱకును జీవసిద్ధి మున్నగు మిత్రుల నంపితిని గదా' యనును. యథార్థమునకు జీవసిద్ధి పరమశత్రువుగా పరిణమించును.

3 మలయకేతువు కంచుకితో రాక్షసునకు నగలను ధరించుటకై పంపఁగా నతఁడు, 'నీగుణములందలి పక్షపాతముచే నందమహారాజు గుణములన్నియు మఱచిపోయితి' నని మలయకేతువునకు కబురంపును. చిట్టచివరకు మలయకేతువును మహానీచునిగా రాక్షసుఁడు గ్రహించును.

4 చతుర్థాంకమున, రాక్షసుఁడు:—దురాత్ముఁడగు బ్రహ్మచారి చాణక్యుఁడు—

(దౌవారికుఁడు సమీపించి)— జయముఁ బొందుఁగాక—

రాక్షసుఁడు:—మోసపుచ్చుటకు శక్యుఁడగునా,

దౌవా:—రాక్షసామాత్యుఁడు.

వీరిద్దరి వాక్యములు కలిపి యన్వయించినచో రాక్షసుని భావమునకు విరుద్ధముగా నర్థమిచ్చుచున్నది.

5 ఈయంకముననే మలయకేతువు 'దైవవశముననే నేను సచివాయత్తతంత్రుఁడనై యుండకపోవుట' యని లో సంతోషించును. కాని చివరకీ దోషము చేతనే తా పరాజయమును గాంచును.

6 పంచమాంకమున అతని సాన్నిధ్యమునకు మలయకేతువు కోరికపై రాక్షసుఁడు నగల ధరించువాఁడై, దాను పూర్వము వర్తకుల వద్దకొన్న మూఁడునగలలో నొకదానిని ధరించి యతని సాన్నిధ్యమునకుఁ

బోవుటకు నిశ్చయించి యట్లుసేయును. ఈ నగలు పర్వతకుని నగలుగా గుర్తింపఁబడి మలయకేతువుచేఁ దిరస్కరింపఁబడును. ఇది సంఘటన రూపమైన విరోధము.

7 మలయకేతువు దోషియగు రాక్షసుని త్యజించి 'రాక్షస, నేను విశ్వాసఘాతియగు రాక్షసుఁడనుగా' నని పల్కును. పూర్వార్థా ర్థ్యమునకుఁ, జివరకు మలయకేతువు బంధింపఁబడి రాక్షసునొద్దకు తేగా నాతనిపై విశ్వాసముతోడనే యతనిబంధమోక్షము సేయించి రాజ్య ప్రదానముసేయును.

8 షష్ఠాంకమున రాక్షసుఁడు 'పగవారి చేతులలోఁ బడినైనఁ జచ్చుంగాని చంద్రగుప్తుతో నైతము సంధిసేయఁడని' నిశ్చయించెను. చివరకట్లే బుద్ధిపూర్వకముగ చంద్రగుప్తామాత్యపదమును గ్రహింప వలసివచ్చెను.

ఇ త ర నా ట క ము ల పో లి క లు :—

మృచ్ఛకటిక ముద్రారాక్షసములు:—మృచ్ఛకటికమందలి షష్ఠాం కము మొదలు దశాంకమువఱకుగల యుత్తరభాగమునకును, ముద్రా రాక్షస నాటకమునకుఁ గొన్ని ముఖ్యమైన పోలికలు గలవు. ఇవి కేవలము యాదృచ్ఛికములైనవి. ఈ రెండునాటకముల కర్తలు రాజులగుటయు, నీ రెండు నాటకముల ప్రస్తావనలందలి సూత్రధారులు దమనటులు బ్రాహ్మణుల సమారాధనకై యింటిలో పిండివంటకములు చేయు ప్రయత్నమును దెలిపి తర్వాత చమత్కారముగ నాటక కథలను సూచింతురు. ఈ రెండు నాటకములందు నిర్దోషులైన చారుదత్త రాక్షసు లకారణముగ దోషారోపణ చేయఁబడి చిక్కులోఁబెట్టఁబడు దురు. మృచ్ఛకటికమున నధికరణికుఁడును, ముద్రారాక్షసమున మలయ కేతువును ప్రాడ్వివాకులు.

మృచ్ఛకటిక నాటకమున నీచుఁడైన శకారుఁడు వసంతసేనను జంపి, యమాయకుఁడైన చారుదత్తుఁ డామెను చంపినాఁడని యధికరణి కునితో దోషారోపణ చేయును. ముద్రారాక్షసమున చాణక్యభృత్యుఁ

డైన భాగురాయణుఁడు 'నిన్ను ద్రోహముచేసి చంద్రగుప్తుతో రాక్షసుఁడు గలయనున్నాఁ' డని మలయకేతువుతో దోషారోపణచేయును. ఇవి కొన్ని సాక్ష్యముల మూలమున బుజువుగాఁబడినవి. 2 మృచ్ఛకటికమున, నధికరణికునిచేఁ బంపఁబడి, వీరకుఁడు చూచినపుడు యాదృచ్ఛికముగా నచట పడియున్న యొక స్త్రీకళేబరము వసంతసేనహత్యకు సాక్ష్యమగును. ముద్రారాక్షసమున, పర్వతకుని రాక్షసుఁడే చంపించెనని జీవసిద్ధిచే భాగురాయణుఁడు చెప్పించుమాటలు మలయకేతువు చాటుననుండి వినుట వలన,నవి ప్రబలసాక్ష్యమగును. 3 మృచ్ఛకటికమున, నార్యకుని రక్షించుటకై పరోపకారపరుఁడైన చారుదత్తుఁ డొసంగిన తన శకటమును పరీక్షించుచు, నది వసంతసేన యెక్కిన చారుదత్తుని శకటమను విషయమునుగూర్చి రాజభటులైన వీరక చందనకులకు జరిగిన కలహమును దెలుపుటకై, చారుదత్తుని నేరమును విచారించు సమయమున నధికరణికుని యొద్దకు యాదృచ్ఛికముగవచ్చి చారుదత్తాభిమానియైన వీరకుఁ డమాయికముగ 'చారుదత్తుని శకటముపై వసంతసేన యరుగుచుండె'నని చెప్పినవాక్యములు చారుదత్తుని నేరమునకు సాక్ష్యమగును. అట్లే ముద్రారాక్షసమున, శకటదాసుని రక్షించితెచ్చిన సిద్ధార్థకునికి రాక్షసుఁడు కృతజ్ఞుఁడై, పూర్వము దనకు మలయకేతువు కానుకగ పంపిన నగ దనమెడనుండి తీసి బహుమానముగ నొసఁగినది, రాక్షసునిపై దోషారోపణమును దృఢపఱచినది. 4 మృచ్ఛకటికమున యాదృచ్ఛికముగ నేడ్చుచున్న చారుదత్తుని కుమారుని సంతృప్తిపఱచుటకై, యాతఁ డాడుకొను మట్టిబండిపై వేసి పోయిన వసంతసేన నగల నామెకొసంగుటకై పోవుచు, విదూషకుఁడు యాదృచ్ఛికముగ చారుదత్తుఁడున్న యధికరణికుని మండపమునకేగి, చారుదత్తుని స్థితిని దెలిసికొని, దానికి కారకుఁడైన శకారునితోఁ గలహించుచుండగా నతని చంకలోనుండి యా నగలమూట జారిపడి, చారుదత్తునినేరమును దృఢపఱచినది. అట్లే ముద్రారాక్షసమున, లేఖతోఁ బోవుచున్న సిద్ధార్థకుఁడు, భాగురాయణుని భటులచే చిక్కి దండింపఁబడినపు డతని చంకనుండి రాక్షసుఁడిచ్చిన నగతో రాక్షసుని ముద్రగల పెట్టె జారిపడి,రాక్షసునిపై ద్రోహమును దృఢపఱచినది. అవి పూర్వము

మలయకేతువు రాక్షసునకు బహుమానముగా పంపినవానిని శకట దాసుని రక్షించి తెచ్చిన సిద్ధార్థకుని క్రియఁబడినవి. 5 మృచ్ఛకటికమున, యధికరణికునియొద్దకు విదూషకుఁడు యాదృచ్ఛికముగా దెచ్చిన వసంత సేన నగలమూట వలన, చారుదత్తుఁడే నగలకొఱకు వసంతసేనను జంపె నని నమ్ముటకు నిదర్శనమయ్యెను. అట్లే ముద్రారాక్షసమున, రాక్ష సుఁడమాయికముగ వర్తకులయొద్ద కొన్న పర్వతకుని నగలను ధరించి మలయకేతువునొద్దకుఁ బోయినపుడు, రాక్షసుఁడే పర్వతకునిఁ జంపించె నని జీవసిద్ధివలన వినినదాని కీ నగలు నిదర్శనముగనుండి, రాక్షసునిపై ద్రోహమును దృఢపఱచినవి. 6 మృచ్ఛకటికమున నిర్దోషియైన చారు దత్తుని యురిశిక్ష యెట్టిదో, ముద్రారాక్షసమున స్వార్థత్యాగియైన చందన దాసు యురిశిక్షయు నట్టిదే. ఇరువురు పురాణములందలి సాత్త్వికనాయ కులు వంటివారు. వీరు వధ్యస్థానమునకుఁ గొనిపోఁబడు రెండు సన్నివేశ ములు కరుణరసమయములే. చారుదత్తుని భార్యాకుమారులును, చందన దాసుని దారాపుత్త్రులును సదృశప్రవర్తనులే. చారుదత్తునిఁ జంపఁబోవు చండాలురైన చందనక వీరకులును, చందనదాసుని వధింపఁబోవు కృత్రి మచండాలురగు సిద్ధార్థక సమిద్ధార్థకులును సమానప్రవర్తనులే. కడకు చారుదత్తుని రక్షించుటకై వసంతసేన వచ్చినట్లుగా, చందనదాసుని బ్రతికించుటకై రాక్షసుఁడు శ్మశానమునకు వచ్చును.

7. మృచ్ఛకటికమున వసంతసేన శకారునిచేఁ జంపఁబడుట ప్రత్యక్ష ముగాఁ జూచిన స్థావరకుఁడు, తనచెఱసాలనుండి సంకెళ్లను దెంపు కొనివచ్చి శ్మశానసమీపమున వధింపఁబడఁబోవుచున్న చారుదత్తునియొద్ద కరిగి యచ్చటనున్న జనులకు యథార్థవృత్తాంత మంతయును జెప్పును. ఇంతలో శకారుఁడు ప్రవేశించి తన కృత్రిమముచే వానిని తిరస్క రించి పంపివేయును. ముద్రారాక్షసమున రాక్షస కాపట్యము బుజువు చేయుటకై మలయకేతు వా కూటలేఖను లిఖించిన శకటదాసును పిలి పింపఁగోరును. శకటదా సాస్థానమునకు వచ్చినచోఁ దా నా కృత్రిమ లేఖను వ్రాయింపఁ జేసినవారు, నా సందర్భము, సిద్ధార్థకుని ద్రోహము పర్వతకుని నగలను దానుకొన్న విషయము సర్వమును దెల్పి, సత్యమును బహిర్గతముచేయును. అంత చాణక్యతంత్రమంతయు విఫలమగును. కాన

నంటనే సూక్ష్మబుద్ధియైన భాగురాయణుఁడీ విషయమును సర్వము గుర్తించి, శకటదాసు నక్కడకు రప్పింపకుండ నాతని హస్తాక్షరసాదృశ్యమున లేఖాక్షరములు శకటునివని నిరూపించి కృత్రిమముగా తప్పించును.

పైన వివరించినట్లు మృచ్ఛకటికమున చారుదత్తుఁడొనర్చెననిన వసంతసేనహత్య యసత్యమైనను యాదృచ్ఛికములైన సంఘటన లెన్నియో ప్రబలసాక్ష్యములై, చారుదత్తపక్షపాతియైన యధికరణికునిఁగూడ విశ్వసింపఁజేసినవి. ఇందుచే నీ నాటకమున ప్రబలమైన విధివైపరీత్యము ప్రకటింపఁబడినది. ముద్రారాక్షసమునఁగూడ నసత్యమైన రాక్షసద్రోహము నతఁడు దూరదృష్టిరాహిత్యమున నమాయికముగఁ జేసిన కార్యములన్నియు, చాణక్యుఁడు కూర్చిన వ్యూహమున, విపరీతముగా పరిణమించి, తననేరములకు ప్రబలసాక్ష్యములై, ఋజువుచేయును. కాని రాక్షసుఁడు తన దూరదృష్టిరాహిత్యమును, చాణక్యుని దుర్బోధమైన తంత్రమువలన గ్రహింపలేక, యంతయు తన విధిప్రాతికూల్యమని భ్రాంతిపడెను. మృచ్ఛకటికమందున్న యాదృచ్ఛికసంఘటనల రూపమైన విధివైపరీత్యమేమియు ముద్రారాక్షసమునఁ గానరాదు. ముద్రారాక్షస నాటకమున రాక్షసముద్రాంగుళీయకము చాణక్యచారునకుఁ దొరికిన విషయమొక్కటే యాదృచ్ఛికసంభవము. ఇందు చాణక్యుని సూక్ష్మబుద్ధిని ప్రకటించును. కాని యతఁడు శకారునివలె పరమనీచుఁడు మాత్రము గాఁడు.

విశాఖదత్తునకు ముద్రారాక్షసమును రచించుటకు భాసుని ప్రతిజ్ఞాయౌగంధరాయణమునందు వత్సరాజును యౌగంధరాయణుఁడు చెఱనుండి విడిపించుటకై యొనర్చిన తంత్రవృత్తాంతము మార్గదర్శకమై యుండఁదగును. కాకతాళీయన్యాయముగ నీనాటకమునకు వేణీసంహారనాటకమునకుఁ గూడఁ గొన్ని తుల్యసన్నివేశములు కథాసంధానమునఁ గన్పించుచున్నవి. ముద్రారాక్షసమున చాణక్యుని శిరోజములఁబట్టి లాగి యవమానించిన నందులను జంపిననేకాని తన శిరోజముల ముడివేయనని ప్రతిజ్ఞచేసి, యట్లుచేసి, రాక్షసుని చంద్ర

గుప్తామాత్యుని జేసినతర్వాత చాణక్యుఁడు జుట్టుముడి వేసికొనును. వేణీ సంహారమున ద్రౌపదీకేశాకర్షణుఁడగు దుశ్శాసనుని, దానికి కారకుఁడగు దుర్యోధనుని చంపిననేగాని యామె శిరోజముల ముడువనని ప్రతినపట్టి, ప్రతిన నెరవేర్చికొనును. ఈ సందర్భమున ముద్రారాక్షసమున మొదట

ఆ॥వె॥ నందవంశకాననమునకు దావాగ్ని, యైన నాప్రకోపమార్పఁదివురు
నొడ లెఱుంగకెవ్వఁడో మూర్ఖుఁడు తదగ్ని కీలలందు శలభలీలఁగాంచు॥ అం. 1.

వేణీసంహారమున,

ఆ॥వె॥ ముక్తవేణియైన ముదిత నీకృష్ణను, ధూమశిఖను బోలెఁ దొడరియంటి
కౌరవాన్వయంపుఁ గారుచిచ్చునకును, శలభమగుట కెవఁడు సాహసించె॥

ఇందుపయోగింపఁబడిన యుపమానములుగూడ రెండునాటకములందు సమమే.

2. ముద్రారాక్షస తృతీయాంకమున చాణక్యచంద్రగుప్తుల కపటకలహము వర్ణితము. వేణీసంహార తృతీయాంకమున కర్ణాశ్వత్థామల స్వపక్షకలహము వర్ణింపఁబడినది. కర్ణాశ్వత్థామల సహజకలహముకంటెఁ జాణక్యచంద్రగుప్తుల కపటకలహ మెక్కువ చమత్కారముగను, ప్రకృతిసిద్ధముగా నుండునట్లు కల్పింపఁబడినది.

3. ముద్రారాక్షసమున నానందపరవశుఁడైన రాక్షసుఁడు పరోపకార మొనర్చిన సిద్ధార్థకునికిఁ దన యొడలినుండి యమూల్యాభరణములఁ దీసి, పారితోషికమిచ్చును. వేణీసంహారమున భానుమతీ ప్రత్యవమానరూపమున సాయపడిన చెలికత్తెకుఁ దన యొడలినుండి యమూల్యాభరణములఁ దీసి పారితోషికమిచ్చి భీముఁడు దన కృతజ్ఞతను దెల్పును. కాని ముద్రారాక్షసము రాజకీయసంబంధ నాటకమగుటచే వేఱుగా పరిణమించినది.

4. ముద్రారాక్షస చతుర్థాంకమున భాగురాయణుఁడు మలయకేతువునకు రాక్షసునిపై ద్వేషము గల్పించుటకై దుర్బోధలు, దుర్వ్యా

ఖ్యానములు సేయును. వేణీసంహార తృతీయాంకమున కర్ణుఁడు ద్రోణాశ్వత్థామలపై ద్వేషము గల్పించుటకై దుర్యోధనునకు దుర్బోధలు, దుర్వ్యాఖ్యానములు సేయును. ఆ దుర్బోధల విని ముఖ్య సహనాయకులు నష్టకష్టముల పాలగుదురు.

5. ముద్రారాక్షసమున రాక్షసమంత్రి కరభకునితో కుసుమపురవృత్తాంతమును, చంద్రగుప్తచాణక్యుల విరోధమును గూర్చి ప్రసంగించుచుండు మధ్యలో, మలయకేతువు భాగురాయణునితో వెనుకనుండి రహస్యముగవచ్చి వారి ప్రసంగమును చాటుగా విని రాక్షసుని ననుమానించును అందలివాక్యము లనుమానము గల్గించును. వేణీసంహారమున భానుమతి తన చెలులతో నొక నకులము నూరుసర్పములఁదిన్న తన స్వప్నవృత్తాంతమును దెల్పుచుండఁగా మధ్యలో దుర్యోధనుండు రహస్యముగా వెనుకనుండి వచ్చి, చాటుగా నామెమాటల విని, యామె ననుమానించును. అందలి మాటలుగూడ ననుమానము గల్గించును.

6. ముద్రారాక్షస ద్వితీయాంకమున విరాధగుప్తుఁడు రాక్షసునితోఁ గుసుమపుర వృత్తాంతములను, స్వమిత్రనాశనమును దెల్పఁ బ్రతినాయక హృదయనిర్వేద మొందిన సన్నివేశము, వేణీసంహారనాటక చతుర్థాంకమందు సుందరకుఁడు దుర్యోధనునితో స్వబంధుమిత్రనాశనమునుదెల్పఁ బ్రతినాయకుఁడు దుఃఖమొందిన ఘట్టమును బోలియున్నది. కాని వేణీసంహార ఘట్టమందలి యుద్ధవర్ణన దీర్ఘవచన రచనతో నీరసముగానుండి విసుఁగుగొల్పును. ముద్రారాక్షసమున నారీతిగాక హృద్యమై యా సన్నివేశము వెంటనే శకటదాస సిద్ధార్థక సన్నివేశము తదనుసరణముగ గూర్పఁబడి చమత్కరింపఁబడెను.

ఇఁక నీ నాటక సప్తమాంకమున రాక్షసకుటుంబ సంరక్షణార్థము దన ప్రాణముల గోలుపోనున్న చందనదాసుకొఱకై విలపించు నాతని దారాపుత్రాదుల యవస్థ, నాగానందనాటకమున గరుడభక్ష్యార్థము పోవు శంఖచూడుఁడను నాగకుమారునికై విలపించు నాతని

సప్రాణమాత్రుని జేసిన తర్వాత చాణక్యుఁడు జుట్టుముడి వేసికొనును. వేణీసంహారమున ద్రౌపదికేశాకర్షణుఁడగు దుశ్శాసనుని, దానికి కారకుఁడగు దుర్యోధనుని చంపిననేగాని యామె శిరోజముల ముడువనని ప్రతిజ్ఞపట్టి, ప్రతిజ్ఞ నెరవేర్చికొనును. ఈ సందర్భమున ముద్రారాక్షసమున మొదట

ఆ॥వె॥ నందవంశకాననమునకుఁ దావాగ్ని, యైన నాప్రతిజ్ఞోపహాస్యమెసఁగ
నొడలు జెఱుపఁగల్వాఁడో మూర్ఖుఁడు చెదరి కీలలందు శలభకేళిఁగాంచు॥ అం. 1.

వేణీసంహారమున,

ఆ॥వె॥ ముక్తవేణినైన ముదిత సిగ్గుపడఁగ, ఘనశిఖను బోలెఁ దొడరియుంటి
కౌరవాన్వయంపుఁ గానచిచ్చునకును, శలభమగుట కెవఁడు సాహసించె॥

ఇందుపయోగింపఁబడిన యుపమానములుగూడ రెండునాటకములందు సమమే.

2. ముద్రారాక్షస తృతీయాంకమున చాణక్యచంద్రగుప్తుల కపటకలహము వర్ణితము. వేణీసంహార తృతీయాంకమున కర్ణాశ్వత్థామల స్వపక్షకలహము వర్ణింపఁబడినది. కర్ణాశ్వత్థామల సహజకలహముకంటెఁ జాణక్యచంద్రగుప్తుల కపటకలహ మెక్కువ చమత్కారముగను, బ్రకృతిసిద్ధముగా నుండునట్లు కల్పింపఁబడినది.

3. ముద్రారాక్షసమున నానందపరవశుఁడైన రాక్షసుఁడు పరోపకార మొనర్చిన సిద్ధార్థకునికిఁ దన యొడలినుండి యమూల్యాభరణములఁ దీసి, పారితోషికమిచ్చును. వేణీసంహారమున భానుమతీ ప్రత్యవమానరూపమున వ్రాయపడిన చెలికత్తెకుఁ దన యొడలినుండి యమూల్యాభరణములఁ దీసి పారితోషికమిచ్చి భీముఁడు దన కృతజ్ఞతను దెల్పును. కాని ముద్రారాక్షసము రాజకీయసంబంధ నాటకమగుటచే వేఱుగా పరిణమించినది.

4. ముద్రారాక్షస చతుర్థాంకమున భాగురాయణుఁడు మలయకేతువునకు రాక్షసునిపై ద్వేషము గల్పించుటకై దుర్యోధలు, ధుర్యాల

ఖ్యానములు సేయును. వేణీసంహార తృతీయాంకమున కర్ణుడు ద్రోణాశ్వత్థామలపై ద్వేషము గల్పించుటకై దుర్యోధనునకు దుర్బోధలు, దుర్వ్యాఖ్యానములు సేయును. ఆ దుర్బోధల విని ముఖ్య సేనానాయకులు నష్టకష్టముల పాలగుదురు.

5. ముద్రారాక్షసమున రాక్షసమంత్రి కరభకునితో కుసుమపురవృత్తాంతమును, చంద్రగుప్తచాణక్యుల విరోధమును గూర్చి ప్రసంగించుచుండు మధ్యలో, మలయకేతువు భాగురాయణునితో వెనుకనుండి రహస్యముగవచ్చి వారి ప్రసంగమును చాటుగా విని రాక్షసుని ననుమానించును అందలివాక్యము లనుమానము గల్గించును. వేణీసంహారమున భానుమతి తన చెలులతో నొక నకులము నూరుసర్పములం దున్న తన స్వప్నవృత్తాంతమును దెల్పుచుండగా మధ్యలో దుర్యోధనుండు రహస్యముగా వెనుకనుండి వచ్చి, చాటుగా నామెమాటల విని, యామె ననుమానించును. అందలి మాటలుగూడ ననుమానము గల్గించును.

6. ముద్రారాక్షస ద్వితీయాంకమున విరాధగుప్తుడు రాక్షసునితోఁ గుసుమపుర వృత్తాంతములను, స్వమిత్రనాశనమును దెల్పఁ బ్రతినాయక హృదయనిర్వేద మొందిన సన్నివేశము, వేణీసంహారనాటక చతుర్థాంకమందు సుందరకుఁడు దుర్యోధనునితో స్వబంధుమిత్రనాశనమును దెల్పఁ బ్రతినాయకుఁడు దుఃఖమొందిన ఘట్టమును బోలియున్నది. కాని వేణీసంహార ఘట్టమందలి యుద్ధవర్ణన దీర్ఘవచన రచనతో నీరసముగానుండి విసుఁగుఁగొల్పును. ముద్రారాక్షసమున నారీతిగాక హృద్యమై యా సన్నివేశము వెంటనే శకటదాస సిద్ధార్థక సన్నివేశము తదనుసరణముగ గూర్పఁబడి చమత్కరింపఁబడెను:

ఇఁక నీ నాటక సప్తమాంకమున రాక్షసకుటుంబ సంరక్షణార్థము దన ప్రాణముల గోలుపోనున్న చందనదాసుకొఱకై విలపించు నాతని దారాపుత్రాదుల యవస్థ, నాగానందనాటకమున గరుడభక్ష్యార్థము పోవు శంఖచూడుఁడను నాగకుమారునికై విలపించు నాతని

గుప్తామాత్యుని జేసినతర్వాత చాణక్యుఁడు జుట్టుముడి వేసికొనును. వేణీసంహారమున ద్రౌపదీకేశాకర్షణుఁడగు దుశ్శాసనుని, దానికి కారకుఁడగు దుర్యోధనుని చంపిననేగాని యామె శిరోజముల ముడువనని ప్రతినపట్టి, ప్రతిన నెరవేర్చికొనును. ఈ సందర్భమున ముద్రారాక్షసమున మొదట

ఆ॥వె॥ నందవంశకాననమునకు దావాగ్ని, యైన నా ప్రకోపమార్పఁదివు:ప
నొడ లెఱుంగకెవ్వఁడో మూర్ఖుఁడు తదగ్నికీలలందు శలభలీలఁగాంచు॥ అం. 1.

వేణీసంహారమున,

ఆ॥వె। ముక్తవేణియైన ముదిత నీకృష్ణను, ధూమశిఖను బోలెఁ దొడరియంటి
కౌరవాన్వయంపుఁ గారుచిచ్చునకును, శలభమగుట కెవఁడు సాహసించె.॥

ఇందుపయోగింపఁబడిన యుపమానములుగూడ రెండునాటకములందు సమమే.

2. ముద్రారాక్షస తృతీయాంకమున చాణక్యచంద్రగుప్తుల కపటకలహము వర్ణితము. వేణీసంహార తృతీయాంకమున కర్ణాశ్వత్థామల స్వపక్షకలహము వర్ణింపఁబడినది. కర్ణాశ్వత్థామల సహజకలహముకంటెఁ జాణక్యచంద్రగుప్తుల కపటకలహ మెక్కువ చమత్కారముగను, బ్రకృతిసిద్ధముగా నుండునట్లు కల్పింపఁబడినది.

3. ముద్రారాక్షసమున నానందపరవశుఁడైన రాక్షసుఁడు పరోపకార మొనర్చిన సిద్ధార్థకునికిఁ దన యొడలినుండి యమూల్యాభరణములఁ దీసి, పారితోషికమిచ్చును. వేణీసంహారమున భానుమతీ ప్రత్యవమానరూపమున సాయపడిన చెలికత్తెకుఁ దన యొడలినుండి యమూల్యాభరణములఁ దీసి పారితోషికమిచ్చి భీముఁడు దన కృతజ్ఞతను దెల్పును. కాని ముద్రారాక్షసము రాజకీయసంబంధ నాటకమగుటచే వేఱుగా పరిణమించినది.

4. ముద్రారాక్షస చతుర్థాంకమున భాగురాయణుఁడు మలయకేతువునకు రాక్షసునిపై ద్వేషము గల్పించుటకై దుర్బోధలు, దుర్వ్యా

ఖ్యానములు సేయును. వేణీసంహార తృతీయాంకమున కర్ణుఁడు ద్రోణాశ్వత్థామలపై ద్వేషము గల్పించుటకై దుర్యోధనునకు దుర్బోధలు, దుర్వ్యాఖ్యానములు సేయును. ఆ దుర్బోధల విని యుగ్ర రూపనాయకులు నష్టకష్టముల పాలగుదురు.

5. ముద్రారాక్షసమున రాక్షసమంత్రి కరభకునితో కుసుమపురవృత్తాంతమును, చంద్రగుప్తచాణక్యుల విరోధమునుగూర్చి ప్రసంగించుచుండు మధ్యలో, మలయకేతువు భాగురాయణునితో వెనుకనుండి రహస్యముగవచ్చి వారి ప్రసంగమును చాటుగా విని రాక్షసుని ననుమానించును అందలివాక్యము లనుమానము గల్గించును. వేణీసంహారమున భానుమతి తన చెలులతో నొక నకులము నూరుసర్పములఁదిన్న తన స్వప్నవృత్తాంతమును దెల్పుచుండఁగా మధ్యలో దుర్యోధనుండు రహస్యముగా వెనుకనుండి వచ్చి, చాటుగా నామెమాటల విని, యామె ననుమానించును. అందలి మాటలుగూడ ననుమానము గల్గించును.

6. **ముద్రారాక్షస ద్వితీయాంకమున విరాధగుప్తుఁడు రాక్షసునితోఁ గుసుమపుర వృత్తాంతములను, స్వామిత్రనాశనమును దెల్పఁ బ్రతినాయక హృదయనిర్వేదమొందిన సన్నివేశము, వేణీసంహారనాటక చతుర్థాంకమందు సుందరకుఁడు దుర్యోధనునితో స్వబంధుమిత్రనాశనమును దెల్పఁ బ్రతినాయకుఁడు దుఃఖమొందిన ఘట్టమును బోలియున్నది. కాని వేణీసంహార ఘట్టమందలి యుద్ధవర్ణన దీర్ఘవచన రచనతో నీరసముగానుండి విసుఁగుగొల్పును. ముద్రారాక్షసమున నారీతిగాక హృద్యమై యా సన్నివేశము వెంటనే శకటదాస సిద్ధార్థక సన్నివేశము తదనుసరణముగ గూర్పఁబడి చమత్కరింపఁబడెను:**

ఇఁక నీ నాటక సప్తమాంకమున రాక్షసకుటుంబ సంరక్షణార్థము దన ప్రాణముల గోలుపోనున్న చందనదాసుకొఱకై విలపించు నాతని దారాపుత్త్రాదుల యవస్థ, నాగానందనాటకమున గరుడభక్ష్యార్థము పోవు శంఖచూడుఁడను నాగకుమారునికై విలపించు నాతని

జననిస్థితినిబోలియున్నది. ఈనాటకమునఁదనభర్తను రక్షింపుఁడని చందనదాసునిభార్య యరచుచుండగా నాకస్మికముగా రాక్షసుఁ డరుదెంచి యతనిని రక్షించును. అట్లే నాగానందనాటకమున నాగమాత దన కుమారుని రక్షించువారెవరు లేరా? యని యరచుచుండగా జీమూతవాహనుఁ డకస్మాత్తుగావచ్చి రక్షించును. జీమూతవాహనుఁడు స్వప్రాణత్యాగి. రాక్షసుఁడు స్వార్థత్యాగి. జీమూతవాహనుఁ డొక జీవిప్రాణరక్షణకై తనప్రాణముల నర్పించును. రాక్షసుఁడు సన్నకై ప్రాణములఁ గోల్పోనున్న మిత్రునికొఱకై శత్రువులకు దాస్యమొనర్చుట కంగీకరించిన స్వార్థత్యాగి.

ఈనాటకమున రాక్షసుని ముద్రాంగుళీయకము మూలముగఁ జాణక్యుఁడు రాక్షసమలయకేతువులకు భేదము గల్పించి రాక్షసుని జయించుట, ఒథెల్లోనాటకమున ఒథెల్లోచేతిరుమాలు నియాగో సంగ్రహించి దానిమూలముననే ఒథెల్లో కాతని భార్యపై ద్వేషము గల్గునట్లుచేసి చివరకు వారిద్దరి పతనమును గల్గించుటను బోలియున్నది. కాని ఇయాగో ప్రవర్తనము చాణక్యుని తంత్రమువలె దుర్మార్గము, నీచమునైనను, చాణక్యతంత్ర పర్యవసానము ఘోరమైనది మాత్రము గాదు. చాణక్యుఁడు ఇయాగోవలె నీచుఁడును గాఁడు.

ముద్రారాక్షసమున ప్రాముఖ్యముగల స్త్రీ పాత్రలు లేకుండుటచే నిది రసవంతమైన నాటకము గాదని యొక యాక్షేపణగలదు. కాని రాజకీయసంబంధ నాటకములందు స్త్రీ పాత్ర ప్రాధాన్యమున కవకాశము గల్గించుట యనౌచిత్యముగా నుండకపోదు. స్త్రీపాత్ర ప్రాముఖ్యము శృంగార రసపోషణమున శోభించును. ఈ నాటకమున నంగముగనైన శృంగారరసమును పోషించుట వస్త్వైక్యమునకు భంగము వాటిల్లనోపు. నాటకవస్తువునుబట్టి యిది పామరులకు హృద్యము గాకపోవచ్చును కాని విద్వాంసుల కీ నాటక మారాధ్యమే.

Books consulted ;

H. H. Wilson :— Theatre of the Hindus. Vol. II.
S. Ray, M. A., :— Edition of Mudra Rakshasa.
Kale :— do.
K. T. Telang, M. A., L. LB., C. I. E. do.
Dhruva :— do.

# వేణీసంహారము

కవికాలము:— క్రీ. శ. 750-800 మధ్యకాలమువాఁడైన వామనుఁడు దన కావ్యాలంకార సూత్రవృత్తియందు వేణీసంహార నాటకకము నుదాహరించుటచేత నీ నాటకకర్తయగు భట్టనారాయణకవి క్రీ. శ. 750 పూర్వముండవలయును. 7 వ శతాబ్ద పూర్వభాగమునకుఁ జెందిన భట్టబాణుఁడు దనహర్ష చరిత్రపీఠిక పద్యములలోఁ దనకుఁ బూర్వులైన కొందఱు కవులనుగాని వారి కావ్యములఁగాని పేర్కొనెను. అందులో భట్ట నారాయణుఁడుగాని, వేణీసంహార నాటకముగాని సూచింపఁబడ లేదు. కాన మనకవి భట్టబాణుని తర్వాత ననఁగా 650 పిమ్మట జీవించి యుండవలెను. అందుచే నితడు క్రీ. శ: 650-750 మధ్యనుండి యుండును. మఱియు నాదిసురుఁడను రాజు కన్యాకుబ్జమునుండి బంగాళమునకు మన కవి నితరబ్రాహ్మణ పంచకముతోఁబాటు పిలిపించుకొనెనని పరంపరాగత కథలు దెల్పుచున్నవి. శూరసేనుఁడను నామాంతరముగల యీరాజు భాగ్యదేవికిఁ బతియు నేపాళరాజగు నంశువర్మకు సోదరుఁడని హ్యూయాన్ త్సాంగు తన యాత్రాచరిత్రలో నీతనిఁ బేర్కొనెను. అంశువర్మ క్రీ. శ. 644-652 వఱకు పరిపాలించెనుగాన, నాదిసురనృపతియు, మన కవియు సప్తమ శతాబ్దోత్తర భాగమున జీవించి యుండవచ్చును. భట్టనారాయణుఁడు కృత్యారావణమను మఱియొక నాటకమును రచించినాఁడు.

వేణీసంహార నాటకమును మొదట కోరాడ రామచంద్రశాస్త్రిగారాంధ్రీకరించినట్లు తెలియుచున్నది. కాని, యాగ్రంథ మిప్పుడెక్కడను గానరాదు. వడ్డాది సుబ్బారాయుడుగారి తర్వాత నింకెవ్వరు దీని నాంధ్రీకరించినట్లు తెలియరాదు.

సంస్కృతమున రామాయణకథను నాటకీకరించినంతమంది కవులు భారతకథ నాంధ్రీకరించలేదు. భాసరచిత మధ్యమవ్యాయోగ, దూతఘటోత్కచ, యూరుభంగ, కర్ణభార, పంచరాత్ర నాటకములు భారతకథలో నేకదేశమునే గ్రహించుటయేకాక, మహానాటకముగానైన రచింపఁబడలేదు. ఇవియున్నిటీవలనే ప్రచారమునకువచ్చినవి.

ఇఁకరాజశేఖరకృత ప్రచ్ఛన్న పాండవము, బాణకవి రచిత 'ముకుట తాడితము; త్రిలోచనుని పార్థవిజయమును నామమాత్రశేషములు గానే యున్నవి. ప్రకటితమైన వత్సరాజకృత, పార్థ పరాక్రమము, గుణచంద్రరచిత విక్రాంత కౌరవమును విశేష వ్యాప్తిలో లేవు. ఈ కారణములచేత, ననేకాలంకారికులు వేణీసంహారనాటకమును దశ లక్షణ గ్రంథములం దుదహరించుటచేత నీనాటకను ప్రఖ్యాతివహించి నది. నాటకదృష్టిలోఁ జూచినపుడు దీనిలో గుణము లెన్నిగలవో దోష ములన్నియుగలవు. ఈనాటకఖ్యాతికి కారణమందలి నాటకశిల్పముకంటె కథయే ప్రధానము. భట్టనారాయణకవి చమత్కార కల్పనలచే మూల కథకు మెరుగుపెట్టుటవలన జనసామాన్యము భారతకథ నీనాటక మూల మునసే నేర్చుకొనినది.

కథాపరివర్తనము:— ప్రథమాంకమున భీముఁడు పాండవ కౌరవసంధి కొడంబడక కోపావేశ పరవశుఁడైయుండగా నాతనియొద్దకు భానుమతీ పరిహాస వాక్యావమానితయైన ద్రౌపది వచ్చినట్లున్నది. మూలకథయైన భారతమం దీవిషయములేదు. భీముని క్రోధోద్రేకము నధికముచేసి వీరరసపోషణము సేయుటకై యీకల్పనము భట్టనారాయ ణునిచే నాటకమునఁ జేయఁబడినది. క్రోధోద్రేకములో దుర్యోధన రక్త సిక్తహస్తములతో ద్రౌపదీ కేశములను ముడుతునని భీముఁడు ప్రతినఁ జేయుటకుఁ జక్కని యవకాశము గల్గించుటకై యీ మార్పును కవి చేసెను. దీనిచేతనే నాటకమునకు వేణీసంహారమని పేరు పెట్టఁబడెను. వేణీసంహార మనఁగా వేణీబంధనమనిగాని; వేణీకారణముచేత గల్గిన కౌరవ సంహారమనిగాని యర్థమగును. భారత సభాపర్వమందు ద్యూత సభామధ్యమున దుశ్శాసనుఁడు ద్రౌపదిని కేశాకర్షణమును వివస్త్రను జేసినట్లును దుర్యోధను డామెకుఁ దొడచూపినట్లును నంత భీముఁడు దుశ్శాసను ఱొమ్ముచీల్చి రక్తపానము చేయుదుననియు, దుర్యోధనుని తొడలు గదచే నుగ్గుచేసెదనని ప్రతినచేసినట్లున్నది. కాని దుర్యోధనుని రక్తముచే విడిపోయిన ద్రౌపదీ కేశముల ముడుతునను ప్రతిజ్ఞచేసినట్లు భారతమున నెచ్చటను లేదు. ఇది రసపోషణమునకై కవిచే కల్పింపఁబడి కథకు మెఱుఁగు పెట్టఁబడినది.

2 నాటకమున శ్రీకృష్ణుఁడు పాండవులకై దూ ళ్లిప్పించి సంధి చేయు షరతుతో దూతగాఁ బోయినట్లుగా నున్నది. కాని భారతమున నీషరతుతో సంధిప్రయత్నము సల్పినవాఁడు సంజయుఁడుగాని శ్రీకృష్ణుఁడుగాఁడు. శ్రీకృష్ణుని దౌత్యమం దీషరతు లేదు. భట్టనారాయణుఁడు సంజయరాయబార వృత్తాంతము ననవసరమునఁ బ్రత్యేకముగాఁ జెప్పఁదలఁచుకొనక యుధిష్ఠిరుని సౌమ్యభావమును దెలియఁబఱచువాఁడై యీ నియమమును శ్రీకృష్ణరాయబార సందర్భమునకు మార్చెను. మఱియు నైదుగ్రామముల యంతరార్థమును ద్యోతకము సేయుటకై కూడ నిక్కడకు మార్చెను. ఈమార్పువలన కథయం దౌచిత్యభంగము వాటిల్లకుండుటయేకాక శ్రీకృష్ణ సంజయ బారముల సారము క్లుప్త పఱచి నిర్వహింపఁ బడినది.

3 నాటకమున దుర్యోధనుఁడు శ్రీకృష్ణుని బంధించుటకుఁ బ్రయత్నింపఁగా భగవానుఁడు విశ్వరూప ప్రదర్శనముచేసి వాని ప్రయత్నము భంగపఱచినట్లున్నది. కాని భారతమున దుర్యోధనుఁడు శ్రీకృష్ణుని బంధింప దుష్టాలోచన సేయుచుండగనే ధృతరాష్ట్రుఁడు గ్రహించి కుమారుని దూషించినట్లును, పిమ్మటఁ దనప్రభావముఁ జూపుటకై శ్రీకృష్ణుఁడు విశ్వరూప ప్రదర్శనము చేసినట్లున్నది. నాటకకర్త శ్రీకృష్ణ విశ్వరూప ప్రదర్శనమున కొక ప్రయోజనమును సిద్ధింపఁజేయుటకై దుర్యోధనాదులు దన్ను పట్టఁ బ్రయత్నించుట నొక కారణముగ కల్పించి, వీని రెంటికి కార్య కారణ సంబంధమును గూర్చి రసౌచిత్య పోషణములఁ జేసినాఁడు.

4 ద్వితీయాంకమున భానుమతీ స్వప్నవృత్తాంతమును, దుర్యోధనుఁ డామెను గలిసికొని సంభాషించుటయు మూలమున లేవు. ఇది ముఖ్యముగా భావ్యర్థమును సూచించి పతాక స్థానకమును గూర్చుటకును (Dramatic irony), భానుమతీ దుర్యోధనుల పాత్రపోషణమునకుఁ గల్పింపఁబడినది. భారతమున దుర్యోధనుని భార్యపేరు భానుమతి యని తెల్పనైనలేదు. అందామె వృత్తాంతమే లేదు. ఇది పూర్తిగా కవి కల్పితమే.

5 భారతమున భీముఁడు దుశ్శాసనుని రక్తము పానముచేసినట్లుండగా నాటకకర్త తృతీయాంకప్రవేశకమున భీముని మానవరక్తపాన దోషమును రాక్షస చేష్టనుండి తప్పించి పాత్రపోషణ చేయుటకై, ఘటోత్కచుఁడు భీమునిలోఁ బ్రవేశించి దుశ్శాసనుని రక్తపానముచేసి తన్మూలమున భీముఁడు తన ప్రతిజ్ఞఁ బాలించినట్లు కవిచేఁ గల్పింపఁబడినది.

6 భారతమున కర్ణుఁడు తన్నర్ధరథునిగాఁ బరిగణించుటచే భీష్మునిపైఁ గోపగించి యతఁడు చచ్చువఱకు శస్త్రసన్న్యాసము గావించి నట్లున్నది. మఱియు ద్రోణపర్వ 158–159 అధ్యాయములందు కర్ణుఁ డాత్మబలమును బొగడుకొని పాండవుల సంహరించెదనని గర్వోక్తులు పలుకఁగా, కృపుఁడు వానిని తిరస్కరించి యుత్తరగోగ్రహణాది సమయములందు కర్ణుఁడు పాండవులచేఁ బొందిన పరాజయమును సూచింపఁ గర్ణుఁడు కుపితుఁడై మఱియొకమాఱట్లు పల్కిన నతని నాల్కఁ గోయుదుననెను. అంత నశ్వత్థామ ఖడ్గహస్తుఁడై కర్ణునిపై నురుక వారిద్దరకు గలహము గలుగఁగ కృప దుర్యోధనులు వారిని వారింతురు. ఈ గాథ ద్రోణవధకుఁ బూర్వము జరిగినది. భట్టనారాయణుఁడు దీనియం దనేకమైన మార్పులు సందర్భోచితముగఁ జేసెను. నాటకమున వీరి కలహము ద్రోణవధానంతరము కర్ణుని కృత్రిమ వ్యాఖ్యానముతోఁ బ్రారంభించుచున్నది. మఱియు కృపాచార్యున కిందు తావులేదు. కర్ణాశ్వత్థామల కలహ పర్యవసానముగ నశ్వత్థామ కర్ణమరణ పర్యంతము శస్త్రసన్న్యాసముసేయును. భారతమందలి కర్ణుని శస్త్రసన్న్యాస మిట్లు మార్పఁబడినది. ఇందు బ్రాహ్మణ వీరుఁడు కర్ణునికంటె నధికుఁడని తెల్పుటకై కొన్ని మార్పులుచేసి రౌద్రరసపోషణము గావించినాఁడు నాటకకర్త.

7 భారతమున నభిమన్యు పరాక్రమ వధలు విపులముగ వర్ణితముగాఁగ, నాటకచతుర్థాంకమున వృషసేను పరాక్రమ వధలు విపులముగ నట్లే వర్ణింపఁబడినవి. యుద్ధపరాజితులగు కౌరవపక్ష వీరుల మరణ వృత్తాంతమునే విపులముగా వర్ణింపఁ నుచితమని దలఁచి, తత్పక్షమున నర్జుననితో సమానుఁడగు కర్ణుని కుమార యుద్ధవధలఁ దెలుపనెంచి

నాటకకర్త, తత్పూర్వము నాతని పరాక్రమము నభిమన్యు పరాక్రమమును వలె విపులముగ వర్ణించెను. మఱియు నర్జునుఁడు సమీపమున లేని సమయమున కర్ణాదు లభిమన్యునిఁ జంపఁగా గర్జునుఁడుండగనే యర్జునుఁ డొక్కఁడు వానితనయు వధించుకీర్తిని వర్ణించి, పాండవ ప్రాబల్యమును విశేషముగఁ జూపుటకుఁ గాని నాటకకర్త యిట్లు మార్చియుండును.

8 పంచమాంకమున గాంధారీ ధృతరాష్ట్రులు యుద్ధభూమి యందున్న దుర్యోధనునిఁ జూడవత్తురు. భారతమున దుర్యోధనుఁడు జీవించియుండగా నతనిఁజూచుటకతని పితరులు భండనభూమికి వచ్చినట్లు లేదు. దుర్యోధనుని మరణానంతరము యుద్ధభూమికి వారు వచ్చినట్లు శాంతిపర్వమందున్నది. సంధివిషయము హెచ్చరించి దుర్యోధనుని పాత్ర పోషణచేయుటకును, గాంధారీ ధృతరాష్ట్రుల దుఃఖవ్యక్తీకరణము వలన కరుణరసమును ప్రతిపాదించుటకును యీమార్పును నాటకకర్త చేసెను.

9 ఈసమయమునచే భీమార్జునులు గాంధారీ ధృతరాష్ట్రుల నమస్కరించు నెపమున నచటికిపోయి క్రూరవాక్కుల వారల నొప్పించు టయు, దుర్యోధన భీమసేనుల వాక్కలహము మూలమున లేక పోయినను నాటకకర్త వీరరస పోషణమునకై కల్పించెను.

10 భారతమున దుర్యోధనుఁడు స్వబుద్ధిచేతనే ద్వైపాయన హ్రదమున దాఁగినట్లుండగా, నాటకమున ధృతరాష్ట్రబోధితుఁడై కొల నిలో దాఁగినట్లున్నది. ఇందుమూలమున ధృతరాష్ట్రుని కౌటిల్యము స్పష్టమై దుర్యోధనుని శీలము పోషింపఁబడుచున్నది.

11 షష్ఠాంకారంభమున భీమసేనుఁ డానాఁడు తప్పక దుర్యోధ నుని వధింతుననియుఁ గానిచోఁ దా నాత్మవధఁ గావించుకొందునని చేసిన ప్రతినను విని దుర్యోధనుఁడు, తండ్రిప్రేరణమున ద్వైపాయన హ్రద మున దాఁగి కొనును. ప్రొద్దుగ్రుంకువఱకు దాఁగి యున్నచో భీముఁ డాత్మహత్య గావించుకొనుననియు, నంత నతని సోదరులు గూడ నతని ననుసరింతురుగాన, తేలికగ తనకు రాజ్యము సేకూరుననియు నెంచి యీ యుపాయమునకు దుర్యోధనుఁడు సమ్మతించినాఁడు. భారతకథ ప్రకా

రము దుర్యోధనుఁడు భయమువలననే ద్వైపాయన హ్రదమున దాఁగినను, భీమునిప్రతిజ్ఞ దానికొక కారణమును గల్పించుచున్నది. మూలమున లేని యీప్రతిజ్ఞవలన భీముని సాహసపరాక్రమములు ప్రకటింపఁబడుచున్నవి. ఇది యర్జునుఁడు సైంధవునిచంపుదునని సల్పు ప్రతిజ్ఞ ననుకరించినది.

12 ద్వైపాయన హ్రదమున దాఁగియున్న దుర్యోధనుని ధర్మయుత సాత్త్వికవచనములతో ధర్మరాజు పిలిచినట్లు భారతమున నుండఁగ, నాటకమున భీముఁడే క్రోధవచనముల పిలిచినట్లును, నాసమయమున ధర్మరాజు మఱొకచోట నున్నట్లు మార్పబడినది. దీని మూలమున దుర్యోధనునితో యుద్ధముచేయుచున్న భీముని పరాక్రమ శీలములను నాటకకర్త పోషించినాఁడు.

13 భారత శాంతిపర్వమందు ధర్మరాజు పట్టాభిషేక సమయమున దుర్యోధనుని మిత్రుఁడైన చార్వాకుఁ డను రాక్షసుఁడు విప్ర వేషముతో ధర్మరాజును దూషించి యచ్చోటఁ జంపఁబడినట్లున్నది. నాటక షష్ఠాంకమున వానినే ప్రవేశపెట్టి, ధర్మరాజు నతఁడు వంచించినట్లు కవి మార్చినాఁడు. ఈమార్పువలన నద్భుతరస మవమర్శసంధియందు ప్రతిపాదింపఁబడినను, నది యెంతవఱకు సమంజసముగా నున్నదను విషయము విచారణీయము. ఈమార్పువలన బక కీచక జరాసంధాదుల నవలీలఁ జంపిన భీముఁడును, కాలకేయాది రాక్షసరాజులఁ గసిమసంగిన వివిధాస్త్రధురంధరుఁడైన యర్జునుఁడు నంతలాఘవముగ దుర్యోధనునిచేఁ జంపఁబడెనని ధర్మరాజు నమ్మి, భీమార్జునుల బల పరాక్రమములందు ధర్మరాజున కేమియు విశ్వాసము లేనివాఁడుగఁ గనఁబడుటయే కాక, ద్రౌపదితోఁబాటు తానుగూడ పౌరుషహీనుఁడై, పిరికివానివలె, దుఃఖించుచు, వివేకమును గోల్పోయిన యజ్ఞానివలె, నగ్నిప్రవేశము చేయఁ బ్రయత్నించుటచే నతని పాత్రకుఁ గళంకము గూర్పఁబడినది. మఱియు నింతవఱకు నాటకకథ సక్రమముగా నడిచి, సామాజికుల కుత్సాహము గల్గించి, దీని కల్పనమువలన ధర్మరాజాదుల హృదయములతోఁబాటు సామాజికుల మనస్సులు గూడఁ గ్లేశముచెంది కలఁతఁబారును. కాన నీమార్పు కవి దలఁచినంత ప్రయోజనకారి కాదని తలఁపనగును.

నాటకరచనమునకుఁ దగిన కథ నేరుకొనుటలోనే కవినేర్పు కొంత విశదమగును. సామాన్యముగా మూలకథ నీరసానౌచిత్యాది విషయ భూయిష్టముగ నుండును. గనిలోని బంగారము పుటమువెట్టి యపరంజి గాఁ జేయఁబడునట్లు, మూలకథయందలి నీరసానౌచిత్యాది భాగ ములఁ బరిహరించి, నాటకకర్త కథ నక్కృత్రిమముగ, సహేతుకముగ, స్వచ్ఛ ముగ నుండునట్లు సేయును. తరువాత కంసాలి నగను చేయుటకు బంగారు ముద్దనుండి యనూనాధిక్యముగాకుండ, వలసినంత హేమమును మాత్రమే గ్రహించి, రత్నములపొదిగి, నిగిపీ పనితో రమణీయముగ నెట్లుచేసి తన పనివానితనమును జూపించునో, యట్లె నాటకకర్త గూడ మూలకథలోఁ గొంతభాగము మాత్రము గైకొని యందులోఁగొంతవదిలి వేసియుఁ గొన్నింటిని కలిపి, మఱికొన్నింటిని యథోచితముగ మార్చి గసవంతమైన భాగమునుండి నాటకకథ నారంభించి రక్తికట్టించి, రసపాత్రపోషణములఁ జేసి, సర్వావయవ శోభస్కరముగ నొనర్చి తనపని వానిని తనమును ప్రదర్శింపఁ బ్రయత్నించును. ఈ ధర్మము ననుసరించి కవి వేణీసంహారమునందు భారతకథనుండి కొన్నిమార్పులు వైరితిగఁ జేసెను.

—: పా త్ర పో ష ణ ము :—

భీముఁడు:— ఇతఁడు ధీరోద్ధతుఁడైన నాయకుఁడు. అమిత బల పరాక్రమశాలియగు నసహాయశూరుఁడు. కోప మవతారమెత్తిన వాని వలె శత్రువులపై నిప్పులురుమును.

ఉ॥ తల్లడమందఁ గౌరవశతంబును బట్టి యనిన్మథింపనా?
ప్రల్లదు దుస్ససేను రుధిరంబును గ్రచ్చిగ్రతావనా?
పెళ్ళుమనక సుయోధనుని పెందొడలక గద నుగ్గుపేయనా?
యూళ్ళయిదింటితో నృపతి యొప్పగఁ జేసెడుఁగాక సంధులక అం.1.

అధర్మపరులును, దమ్మవమానించినవారునగు శత్రువుల నితఁ డెంతమాత్రము క్షమింపడు. వారినాశనముచేగాని యతని కోపశాంతి గాదు.

చ॥ ఖలులయి నాఁడు లక్కయిలుగాల్చి, విషాన్నము వెట్టి, జూదపుం
గొలువు ప్రవేశపెట్టి, మముఁ గూరత జీనధనంబులందుఁ జే

దల నొనరించి, చాలకది ద్రౌపదిఁ గొప్పునుబట్టి యీడ్చి, చీ
రల సభ నొల్చినట్టి ధృతరాష్ట్రజులేఁ గలుగంగ స్వస్థతే॥ అం. 1.

ఇతఁడు దన కోపోద్రేకము నాపుకొనలేఁడు. ధర్మబద్ధమైన తన కోపము నంగీకరింపని సోదరుఁడైన సహదేవునిగూడ తిరస్కరించును. తన కోపోజ్జృంభణ విఘ్నకారిణమైన సంధిని గోరుధర్మజునితోఁ బ్రత్యే కింపఁదలఁచి పూజ్యులఁగూడ నిందించును. మితిమీరినకోప మితినిది.

'... నేఁటికి మీరు గారు గురువుల్, తమ్ముండగా నేనునుంగా" అం. 1.

పౌరుష హీనుఁడగు ధర్మరాజు నిట్లు నిందించును.

గీ॥ ఊర్జితంబగు క్షాత్రంపు టుగ్రతేజ
మీమహారాజునకు నాఁటనే తొలంగె
దాయతోడుత నెపుడు జూదంబునాడఁ
బాచికలఁ దనచేతను బట్టినాఁడొ॥ అం. 1.

కోపావేశపరవశుఁడై శత్రుసంహారమునకై యాయుధాగారమునకుఁ బోయి, భానుమతీపరిహసిత ద్రౌపదీ యాగమన మను నిశితశస్త్రదర్శన మునఁ దనకోపము దోహదముపొంది, తీక్ష్ణరూపముదాల్చినది. బల పరాక్రమశాలి కాయుధదర్శన ముద్రిక్తునిగావించుట సహజము. భీముని యాయుధాగారమునఁ దనున్నుద్రిక్తుని గావించు సాధారణాయుధముల కంటె నధిక తీవ్రమైన యొకశస్త్రము నిక్షిప్తమైనది. అదియే ద్రౌపది. కవికల్పితమైన వ్యంగ్యప్రధానమైన యీ చమత్కార సన్నివేశము ప్రశం సార్హమైనది. పరాక్రమప్రకటనముచేతనే శత్రుకృతావమాన ప్రతికృతి చేయఁగోరువాఁ డితఁడు. అట్లుసేయు తనవంటి స్వభావముగలవారిని మెచ్చుకొని బహూకరించును. ద్రౌపదిని పరిహసించిన భానుమతిని తిరస్కరించిన ద్రౌపదీ చెలికత్తెకు భీముడిచ్చిన పారితోషిక మిట్టిదే. భీమునికిఁ గోప మలంకారమైన ట్లింకొకగుణ మలంకారముకాదు. ఈతఁడు కేవలము కార్యశూరుఁడే కాని వాక్శూరుఁడుమాత్రము గాఁడు.

భీము:— దేవీ! ఈ కల్లబొల్ల యూరడింపులతోఁ బ్రయోజనమేమి,

గీ॥ పరిభవగ్లాని లజ్జావిధురిత వదనుఁ
గా, నవిశ్శేషిత క్రూరకౌరవునిఁగ

నింకను వృకోదరునిఁ జూడ విదినిజంబు
చారు శారద పూర్ణిమాచంద్రవదన॥ అం. 1.

ఈతనికి ద్రౌపదినిజూడఁగనే యామెను పరిభవించిన దుశ్శాసన దుర్యోధనులు దన మనోనేత్రమునకు సాక్షాత్కరించి, ప్రత్యక్షముగాఁ దన యెదుటనున్నట్లుభావించి వారిపై కురుకఁ జూచు క్రోధోద్వేగుఁడు ఇంత కోపస్వభావుఁడయ్యు శ్రీకృష్ణుని మాహాత్మ్యము నెఱిఁగిన జ్ఞానియు, భక్తుఁడును, దుర్యోధనుని మాధ్యమునుగూడ గుర్తించిన సూక్ష్మబుద్ధి యితఁడు.

శా॥ ధీరత్వంబున నిర్వికల్పక సమాధిం జిత్తముల్ నిల్పి, దు
ర్వారంబైన తమంబు జ్ఞానమున విధ్వస్తంబు గావించి, యా
త్మారామముల్ దిలకించు నెవ్వలఁగు మోహాంధుండు దుర్యోధనుం
డే రతింగని తాఁ బరాత్పరునిఁగా నెంచంగ శక్తుండగుఁ॥ అం. 1.

శ్రీకృష్ణుఁడు ప్రయత్నించిన పాండవకౌరవ సంధి విఘ్నమైనపుడు శత్రునాశనకరమైన తనయుద్ధాభిలాష నెఱవేఱునని సంతోషించి, కౌరవులపై ధర్మరాజునకుఁగూడ గోపము వచ్చినదని యెఱిఁగి యాతని ప్రయత్నమునకుఁ దోడ్పడు నుత్సాహముతో శత్రుసంహారాందోళన మానసుఁడైన యీతని నాళములలోని రక్తము కోపాగ్నిచే నుడుకుచుండెను. శత్రుకృతావమానమునకుఁ బ్రతిక్రియ నాచరింప నితఁడు తొట్రుపడుచుండును.

చ॥ బిఱబిఱఁ ద్రిప్పి కొంచుగద, బిట్టు సుయోధనుగిట్టి, పెందొడల్
విరుగఁగఁ గొట్టి చేసులను వెచ్చటినెత్తుటనద్ది నీకురుల్
మెఱుఁగిడి, భీమసేనుఁ డవలీలను జిక్కుడలించి కూర్చెడుం
గొఱకొఱయేల? దేవి, యిదిగో ముదమందెడు చూడు నీమదిఁ॥అం.1.

ఈవిధమున భీముఁడు వీరావేశమున వీరభద్రావతారుఁడగును.

ఇతఁడు దుశ్శాసను పచ్చినెత్తురు పానముచేయుటచే శత్రువులకు రాక్షసుఁడువలె భయంకరుఁడు. పగసాధించుటయం దుత్సాహపరుఁడు. అవమాన ప్రతీకారసాధన తత్పరుఁడు.

ఉ॥ ఏన్నృపసుండు ద్రౌపదిని నేడ్చేరఁ గొప్పునుబట్టి యీడ్చెనో
మానధనుల్ గనుంగొనఁగ మానిని పుట్టము లెవ్వఁ డూల్చెనో,

యేని యురస్థలక్షతజమేఁ జవిచూడఁ బ్రతిజ్ఞ గొంటినో,
యానయహీనుఁ గాచికొనుఁడా పడె నా భుజపంజరంబునన్॥ అం. 3.

ప్రతీకారమును సకలశత్రుసమక్షమున బాహాటముగా నొనర్చిన గాని యీతనికి సంతృప్తి లేదు. కావుననే వారందఱను బిలిచి ప్రతిక్రియ చేయును.

కార్యశూరుఁడేగాక యితఁడు వాక్శూరుఁడుగూడ నగును. ద్రౌపదిని పరిహాసముచేసిన భానుమతికిఁ బ్రతీకారముగా నామె భర్తయగు దుర్యోధనుని, కించిదవశిష్ట నిర్వర్తిత ప్రతిజ్ఞుఁడగు భీముఁడు పరామర్శించి పరిహాసము చేయవచ్చి యతనిని వెదకును.

సీ॥ కపటంపు జూదంబు కల్పించిన ఖలుండు, లక్కయిల్గాల్చిన మొక్కవీఁడు

... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

గీ॥ అగుమహారాజుగారు మీ యధిపులిప్పు
డెందు గొలువున్న వారో మాకెఱుఁగఁ జెపుడు,
మేము పగచేతరాలేదు, మిన్నకతని
వదనమును జూచిపోవంగ వచ్చినాము॥ అం. 5.

ఇంపుచే నితఁడు చమత్కార వాక్కులతోఁ బరిహాసముచేయఁ గలుగు రసజ్ఞుఁడుగూడ నని తెలియుచున్నది. ఈ పరిహాసముతోనే వృద్ధులగు గాంధారీ ధృతరాష్ట్రుల నడలఁగొట్ట శంకించి జాలిచెందు నర్జునుని భీముఁడు పరిహాసముగా ధిక్కరించును. 'మూఢుఁడా' సదాచారము దాటనగునా, తలిదండ్రులు వందనీయులనుమాట నీ చెవి నెప్పుడు బడ లేదాయేమి' యని నర్మగర్భముగాఁ బలికి గాంధారీధృతరాష్ట్రులకు గర్భనిర్భేదమైన నిష్ఠురవాక్యములచే నమస్కరించును.

గీ॥ కురుకుమారులనెల్ల నుగ్గుగనొనర్చి
దుస్ససేనుని ఱొమ్ము నెత్తుటనుభలిసి,,
యిఁక సుయోధను తొడలు ఛేదింపనున్న
భీముఁడిదె మ్రొక్కుచున్నాఁడు పితలకిపుడు॥ అం. 5.

ఈమాటలు శస్త్రవ్రణంబులకన్న వేదనాదాయకములై మర్మభేదము సేయునవి. శత్రుకృతావమానమునకుఁ బ్రతీకార మిన్నివిధముల నింత తీక్ష్ణముగనొనర్చినగాని యతనికి సంతృప్తియుఁ మనశ్శాంతియుఁజేకూరదు కాఁబోలు. క్రోధోద్రిక్తుఁడైన యీ సమయమందుగూడ నగ్రజునాజ్ఞకు బద్ధుఁడై గౌరవమును జూపును.

నిర్వర్తితప్రతిజ్ఞుఁడైన యీతనిఁగాంచి కురుపక్షసైనికులుగూడ రాక్షసుఁడనుకొని భయభ్రాంతులైరి. ప్రథమాంకమున ద్రౌపది నోదార్చినరీతిగ దుర్యోధన దుశ్శాసనులఁజంపకపూర్వ మీతఁ డామె కంటఁబడఁడు. వారిని వధించిన తర్వాత ద్రౌపదీ వేణీమహోత్సవము చేసిన మానధనుఁడితఁడు.

దుర్యోధనుఁడు:—ఇతఁడు ప్రతినాయకుఁడు. 'ధర్మమే జయము'ని బోధించుటకై ప్రతినాయకుని సకలదుర్గుణ కళంకితుఁడుగా చిత్రించుట భారతీయ కవుల సంప్రదాయము. సుగుణదుర్గుణ మిశ్రితముగ పాత్రలఁ జిత్రించుట సహజముగ నుండినను, నది పాశ్చాత్య సంప్రదాయముగాని భారతీయనాటక పద్ధతిగాదు. కాన ప్రతినాయకుఁడైన దుర్యోధనుఁడు పరమదుర్మార్గుఁడుగ నిర్మింపఁబడినాఁడు. ఇతఁడు ద్వితీయాంకమున రంగస్థలముమీఁదికి వచ్చినను నంతకుముందే ప్రథమాంకమున నితఁడు భగవంతుఁడైన శ్రీకృష్ణుని గట్టివేయఁ బ్రయత్నించుటయు, విశ్వరూప ప్రదర్శనాంతమునఁ గూడ నాతని భగవంతునిగా గ్రహింపఁ జాలని మూర్ఖుఁడుగాఁ దెలుపఁబడును.

ద్వితీయాంకమున యుద్ధారంభ సమయమునఁగూడ దుర్యోధనుఁ డంతఃపురస్త్రీలతో భోగింపఁదలఁచుట యాతని విషయలాలసత్వమును దెలుపును. అంతియకాక పతివ్రతయైన తన భార్యాశీలమునుగూర్చి యతఁ డనుమానించును. ఇతఁడు దుస్స్వప్నశకునాదుల విశ్వసింపని బుద్ధిగల వాఁడే కాక వాని లక్ష్యముసేయక నిశ్చలచిత్తముతోఁ నుండును.

గీ॥ కాకతాళీయముగ మూఁడు గల్గుచుండు
స్వప్నశకునములును గ్రహచారములును,

బిఱికివారలు వానికి బెదరుచుండు
ప్రేజ్ఞులాచండమున భయపడరు మదిని॥ అం. 2.

యుద్ధమున నితనికి స్వబలపరాక్రమాదులందు విశ్వాస మధికము.

తృతీయాంకమున నితఁడు కర్ణుని దుర్భోధలవిని వానిప్రకారమే యాచరించుటచే స్వతంత్రాభిప్రాయ మితనికిఁ దక్కువనియు, మిత్రునిపై నధికవిశ్వాసాభిమానములు గలవాఁడనియుఁ దెలియుచున్నది. నిష్కల్మష హృదయుఁడగు గురుపుత్రునియందుకంటె, ముఖప్రియ వాక్యములాడు మిత్రునిపై గౌరవమీతనికి మెండు. ఇతనికి సోదరునియందు వాత్సల్యమును, మిత్రకుమారుఁడైన వృషసేనునియందు పుత్త్రతుల్యప్రేమయు నధికమై వారల మరణమున కెంతేనియు దుఃఖించును. ఇంతకంటె నధికముగ కర్ణుని మరణమునకు శోకించును.

గీ॥ అకట! నాప్రాణములకంటె నధికుఁడయిన
యంగరాజిట్లు టాలించి, ప్రాణములను
విడువనందుకే కడు సిగ్గుపడుచునుంటి
నింక నే నూఱడిల్లుట యెట్లు తండ్రి! అం 5.

గీ॥ వగవవలసిన వగవ, నే బాలుఁడైన
దుస్ససేనుని వధకు, బంధువుల మృతికి;
నాకు నత్యుపకార మొనర్చినట్టి
కర్ణకులమెల్ల మాపితిఁ గాన వగతు॥ అం. 7.

తలిదండ్రులం దపారభక్తి ప్రేమలుగల్గి తాను వారికి యుద్ధకాలమునఁ గల్గించిన పుత్త్రశోకమునకెంతేనియు నితఁడు దుఃఖ పశ్చాత్తాపములఁ బొందును.

ఉ॥ తమ్ములచావు చూచితిని దత్ప్రతికారము సేయలేక; నే
నమ్మరో! నీకు నయ్యకును నాఁటని దుఃఖము దెచ్చినాను, స్వ
చ్ఛమ్ముగు చున్న యీ భరతసంతతి మాపఁగ బుట్టు పాతకిన్
నమ్ముఁడి మీకునేను సుతనాశఁడగాని సుతుండఁగాఁజుడీ॥ అం. 5.

ఈతఁడు సర్వసైన్యము గోల్పోయినను చివరవఱకు శత్రువుల ద్వేషించుచునే యుండెను. కాని వారితో సంధిచేయుట కెంత మాత్రముగోరడు.

ఈవిషయమునఁ దలిదండ్రుల వాక్యములఁగూడఁ గౌరవింపఁడు. శత్రువుల సర్వనాశ మింతఁడెల్లప్పుడు కోరును.

ఆ॥ కుంతి నిప్పుడేగు గొడుకులుఁ జచ్చిన
దానిఁగానొనర్తుఁ దథ్యముగను
మీరు దానితోఁ గుమారుల కొఱకేడ్చి
యూరడించుకొనెద రొకరి నొకరు॥ అం. 5.

ఈ విషయమున నితఁ డెంతయుమూర్ఖుఁడు. ఎవరెంత హితము సెప్పినను వినఁడు. వైరుల కృత్రిమముగా వధించుటకుఁగూడసమ్మతింపఁడు. ఈ విషయమున తండ్రిబోధనుగూడఁ దిరస్కరించును. తనయునిఁగూర్చి ధృతరాష్ట్రుఁడిట్లు పలుకును.

ఆ॥ మానశౌండ, నీకు మాయగిట్టదు, కూట
సమర మరులదెట్లు చత్తునేను॥ అం. 5.

ఇతనికి బలపరాక్రమములకుఁ దో డభిమానముగూడ మెండు.

ఉ॥ "ఏఁ గన నాదుబంధువుల నెల్ల వధించినవారిఁ జాటుగా
బాగ వధింప, యుద్ధమున వైరులు మెచ్చనిచంపుచంపొకో" అం. 5

శత్రుప్రాబల్య మెఱిఁగియు యుద్ధమును వదలు భీరుఁడుగాఁడు. చివర వఱకుపోరి జయమో, వీరస్వర్గమో పొందఁగోరిన నిశ్చలహృదయుఁడు. శత్రుసమక్షమునఁగూడ వారి నతి లఘువుగా పరిగణించు శూరుఁడు. చివరకు ద్వైపాయనహ్రదమున దాఁగుటకూడ స్వబుద్ధిప్రేరకమునఁగాక ధృతరాష్ట్రుని కుతంత్రోపదేశమున నాచరించినట్లుగ నాటకమున దుర్యోధనపాత్ర పోషింపఁబడినది. అశ్వత్థామ యమాయికుఁడైనను, మిత్రుఁడైన కర్ణుని విరోధిగానఁ దనకుఁగూడ ద్వేషిగనే పరిగణించెను. మిత్రపక్షపాత మితని కపారము. ఇది యితని యవివేకమునుగూడ చాటును. చివరకు తుల్యవీరునితో బహిరంగయుద్ధమొనర్చి వీరస్వర్గము చేరిన మహాశూరుఁడితఁడు.

అశ్వత్థామ:—ఇతఁడు బ్రాహ్మణుఁ డయ్యుఁ దండ్రివలె నసహాయ శూరుఁడు. మహాపరాక్రమశాలి. పితృవధ ప్రతీకార మనస్కుఁడై నాటక

రంగమున ఖడ్గహస్తుఁడై ప్రవేశించి పాండవనాశనమును జేయఁ బయ్రత్నించును. భీమునివలె నీతఁడు రౌద్రోద్రేకపూరితుఁడు. పితృమరణము నకై యపరిమిత దుఃఖముపొందును.

గీ॥ తండ్రి నీవస్త్రదనృత వధంబు వినుచు,
విడిచి తుసుఋల స్త్రముతోడఁ గొడుకుఁ దీపి;
నీదు నిక్కంపు వధ విని నేను మఱెద;
నిట్టి ఖలునెడఁ బ్రేమ నీకేలపుట్టె॥ అం. 3.

ఈతనికిఁ బితృభక్తి యపారము. పితృ నవమానమును సహింపక యపర పరశురామునివలె విజృంభించును.

చ॥ గురునిశిరంబు ముట్టెరను కోపమునన్, జ్వలదగ్నితుల్యమా
పరశున జామదగ్న్యుఁడు నృపాలుర నెమ్మెయిఁజేసె వింటిరే,
నరపతులార, దారుణరణంబున రోషకషాయితాక్షుఁడై॥
యరి రుధిరప్రవాహముల నట్టులు ద్రోణి యొనర్ప లేడొకో॥ అం. 3.

భీమునివలె నితనికోపము ధర్మయుతమైనది. కర్ణునివలె నితఁడు దనస్వామియైన దుర్యోధనునియందు భక్తివిశ్వాసములు గల్గి రాజభృత్యుఁడైనందుల కుపకారమొనర్చి, యతనియందు కృతజ్ఞతఁజూపు నుత్సాహపడువాఁడు. కాని కర్ణునివలె కృతిమ్రుఁడు, ముఖస్తుతిపారగుఁడు మాత్రము గాడు. నిష్కల్మష హృదయుఁడు, నమాయికపు కోపియు. భీమునివలె నితఁ డెంతమాత్ర మవమానము సహింపనివాఁడై, తండ్రిశిరమంటిన ధృష్టద్యుమ్నునిపైఁ గత్తిదూసి, తన్నుఁ దనతండ్రిని నిందించిన కర్ణుని దూషించి, యతనిని సంహరింపఁజూచును. పగను సాధించుటకై బ్రాహ్మణత్వమునుగూడఁ బరిత్యజింపఁగోరు పౌరుషోద్రిక్తుఁడు. భీమునికివలె నీతనికి రౌద్ర మలంకారము.అవమానజనిత కోపాగ్ని నాశములందలి రక్తము నుడికింపఁజేయు వీరిద్దరు తన్మయమున విశ్వమును మఱతురు. వీరిద్దర మూలముననే రౌద్రరసప్రధానమైన యీ నాటకము శోభించుచున్నది. ఆత్మ బలపరాక్రమముల నెఱిఁగి వీరు శత్రువుల నెంతమాత్రము లక్ష్యముసేయరు.

దుర్యోధనునిచే నవమానితుఁడయ్యు, కౌరవసైన్యము శత్రుభయమున పలాయన మొనరించుచుండఁ దన నిర్వేదమును కర్ణుని వధవలను నస్త్రసన్యాస మొనరించుటచే వారికి సాయముచేయఁజాలని తన యశక్తతకు విచారమును బ్రకటించుటవలన నశ్వత్థామ యౌదార్యము స్పష్టమగుచున్నది. ఇట్టి యసహాయశూరుఁడయ్యు నశ్వత్థామ యీ నాటకమున నిష్ప్రయోజకుఁ డగుచున్నాఁడు. దుర్యోధనుఁడు కర్ణునిపై నభిమానముచే నశ్వత్థామపైఁ జిన్నచూపు చూపుటచే నతఁడు దనశక్తి సామర్థ్యములఁ జూపి, శత్రువుల రూపుమాపి, రాజును మెప్పించి, తన కృతజ్ఞతను గార్యరూపము దాల్పఁజేయుట కవకాశ మశ్వత్థామకుఁ జిక్కకపోయినది. అంతయేకాక యకారణముగను,నిర్దోష ముగను, కర్ణునిచే దూషణావమానములను, దుర్యోధనునిచే ననాదర మును గూడ ననుభవించెను. ఈ యవమానమున కతఁడెంతమాత్రము బాధ్యుఁడుగాని, యోగ్యుఁడుగాని కాఁడు. ఈ కార్యము కేవలము యాదృచ్ఛికముగా గలిగి యట్లు పరిణమించినది. ఇం దశ్వత్థామదోష మేమియు లేదు. ప్రపంచమున మానవుల కొక్కొక్కమా యిట్లు సంభవించు చుండును. మానవజీవిత ప్రతిపాదనమే వాఙ్మయము గాన కవులచేఁ గావ్యమున నట్టి పాత్ర లప్పు డప్పుడుసృష్టింపఁబడుచుందురు. షేక్స్పియరు వ్రాసిన Merchant of Venice అను నాటకమున గూడ Shylock అను వడ్డీ వ్యాపారస్థుఁడు తన దోష మేమియు లేకపోయినను నవమానాపకార ములకు పాత్రుఁడగును. నాటకమున నశ్వత్థామ రౌద్రోద్రేకము రక్తి కట్టి నాటకమును రమణీయముగ చేసినది.

కర్ణుడు:— ఇతఁడు మహాబలశాలి యయ్యు శాపదగ్ధుఁడగుటచే నిష్ప్రయోజకుఁ డగుచున్నాఁడు. మహావీరుఁడైన నీతనికి విధి ప్రతికూలముగా నున్నది. కాని విధిని గూడఁ దిరస్కరించు గర్విష్ఠి. ఈతఁడు సర్వవిధముల నశ్వత్థామకంటె భిన్నశీలము గలవాఁడు. అతఁ డమాయకుఁ డితఁడు కృత్రిముఁడు. అతఁడు హితభాషి; ఇతఁడు ముఖప్రియవాది. అతఁడు శస్త్రశక్తియుతుఁడు. ఇతఁడు శాపదగ్ధుఁడు, అతఁ డాత్మశుద్ధిగలవాఁడు, ఇతఁడుపాపభీతి లేనివాఁడు. కాని యిద్దరు బలపరాక్రమశాలురైన స్వామి భక్తులే. మిత్రుఁడైన దుర్యోధనునిపైఁ గృతజ్ఞతచే శత్రువుల కెంతటి

ద్రోహమైనను పాపభీతి లేక చేయఁబూనును. నిర్దోషియైన ద్రోణుని శీలమును దుర్యోధనునితో దుర్వ్యాఖ్యానము చేయుట యిట్టిదే. పరమ కృతిమిఁడై దుష్టుఁడైనరాజుతో మనోహరవాక్యములుపలికి యాతనిగౌరవాదరణములను బడయును. వాస్తవ ప్రపంచమునందలి కొంటెగాండ్రితని వంటివారే. బలపరాక్రమ గర్వముచే నగ్రజాతులను, గురువులఁ గూడ తిరస్కరించును. హీనకుల జాతుఁడనుకొని యగ్రజాతులనగౌరవపఱచును. బ్రాహ్మణ ద్వేషియై ద్రోణాశ్వత్థామలఁ దుఱనాడును. బలపరాక్రమములందుఁ దనతోఁ దుల్యుఁడుగాని, యధికుఁడు గాని లేఁడను గర్వముతోఁ బితృవధ ప్రతీకార సమర్థుఁడై పాండవ నాశనమున కుత్సహించు నశ్వత్థామను తృణీకరించి, యవమానించి, యతనితోఁ గలహించును.

క॥ నాకరమునఁ గరవాలము
  గైకొని యుండఁగ లాఁతి ఖడ్గంబేలా?
  నాకైదువు పేర్చనిపని
  యేకైదువు దీర్పఁజాలు నీలోకమునన్॥ అం. 3.

అని, తుల్యాధిక బలులం దసూయయు నీతనికిఁ గలదు.

ఈవిధముగా నీ నాటకమున పాత్రపోషణము బహురమణీయముగఁ జేయఁబడినది పాత్రల ప్రత్యేకత్వమే యీ నాటక విశిష్టలక్షణము. భీముని పౌరుషము, కర్ణుని గర్వము, నశ్వత్థామ రౌద్రకరుణా స్వభావములు, దుర్యోధనుని స్వార్థ స్వాభిమానము, లిందు బహు నైపుణ్యముతోఁ బ్రకటింపఁబడినవి. కాని దాదాపు పాత్రలందఱు పరిపూర్ణముగా చిత్రింపఁబడలేదు. మఱియు కవి తలవని తలంపుగా ద్రౌపదీ ధర్మజుల పాత్రపోషణములకంటె భానుమతీ దుర్యోధనుల నెక్కువ జాగ్రత్తగాఁ జిత్రించినాఁడు.

ద్వితీయాంకము:— ఈ నాటక ద్వితీయాంకమున కవి కల్పించిన భానుమతీశృంగారవిషయాదుల సందర్భము లనౌచిత్యములని యనేక ప్రాచ్యపాశ్చాత్యవిమర్శకులు నిందించిరి. కాన నా విషయము కొంచెము విచారించెదను.

ప్రతినాయకుఁడైన దుర్యోధనుఁడకారణముగ భార్యపై ననుమానించుట, గర్వంబున శత్రుబలంబుల లక్ష్యము సేయకుండుట, స్వబలనాశనమునకై విచారింపక యుండుట, యుద్ధసమయమున భార్యతో శృంగారప్రసంగములు సేయుట, భార్యయొక్క దుస్స్వప్నమును నిర్లక్ష్యముగా నెంచుట, సోదరులశక్తిపై దృఢవిశ్వాసముతో నుండుట యనువానిని జూపుటచే నతనిని సంపూర్ణదుర్గుణునిగాఁ జూపవలయునని కవి యుద్దేశించి కృతకృత్యుఁడాయెను. కావ్యము విశ్వశ్రేయము గూర్పవలయునుగాన సన్మార్గుఁడైన భీమునిచే దుర్మార్గుఁడైన దుర్యోధనుఁడు చంపఁబడి మనకు సంతోషము గలుగఁజేయవలయునసిన ప్రతినాయకుని పూర్వప్రవర్తనము బహుజుగుప్సాకరముగ నుండవలయునుగాన ప్రతినాయకుని పాత్రపోషణ మీ విధముగ చేయుట సముంజసముగా నున్నది.

భానుమతీ విషయమును ప్రవేశపెట్టి ప్రతినాయకుని పాత్రపోషణ చేయుటయేకాక కవి మఱియొక మహాకార్యమును గూడ సాధించినాఁడు. అదేదనఁగా కావ్యములలో ధ్వని ప్రధానమైన కావ్యము శ్రేష్ఠమైనది. అందు విశేషముగ నాటకములలో రాఁబోవు కథను ధ్వనిచే సూచించుట మహోత్కృష్టకార్యము. ఇది కవిత్వ పరమావధి యని యాలంకారికుల మతము. పాశ్చాత్య నాటకములలోగూడ నీ పద్ధతి గలదు. దీనిని వారు (tragic or dramatic irony)అందురు. ఇట్టి కార్యము నీ నాటకమున మొదటిమాఱు 'ఒక నకులము నూరుపాముల మ్రింగుట' యను భానుమతీ స్వప్నవృత్తాంతమూలమున కవి సూచించినాఁడు. రెండవమాఱు కంచుకితో మాట్లాడించుచు, నన్వయ భేదముచే నమంగళము దుర్యోధనునిచేఁ బలికించి రాఁబోవు కార్యమును కవి సూచించెను. ఇదియే యలంకారపరిభాషలో పతాకస్థానక మనఁబడును.

దుర్యో:—
గీ॥ సేవకులతోడఁ బాంధవశ్రేణితోడ, హితులతోడఁ గుమారసంతతులతోడఁ
దమ్ముగమితోడ,దాసుయోధనునిఁగూల్చుఁదనబలంబున రణమందు ధర్మసుతుఁడు.'అం.2.

మూఁడవ మాఱు కవి తన ధీశక్తినంతయు నుపయోగించి దుర్యోధనుని 'యూరుభంగమును' జమత్కారముగఁ గూర్చి రాఁబోవు కథనంతనీ ద్వితీయాంకమునందే ధ్వనింపఁజేసెను. భానుమతితో మాట్లాడుచు,

దుర్యో:—— ... ... 'నీచూపుదనుపు నాయూపుయుగము.
కంచుకి:—(ప్రవేశించి) దేవా, భగ్నమైనది.
దుర్యో:——ఎవనిచే ?
కంచుకి:——'భీమునిచే'

అని కూర్చెను ఈ వ్యంగ్యమువలన నద్భుతరసము,తన్మూలమున నానంద మును జనించుట లేదా. కాన నీమార్పు సందర్భోచితమైనదా, లేక పాత్ర పోషణము, రసపోషణముకొఱకు కల్పింపఁబడినదా. ఇట్టి ప్రయోజన ములుగల యీ మార్పు భట్టనారాయణుని ప్రజ్ఞను జాటుచున్నది. ఇట్టి నాటకకళాసౌందర్యమంతయు నీ ద్వితీయాంకమున కవి గుప్తము చేసినాఁడు. ఇది రసోచిత కథాపరివర్తనము.

ప్రథమాంకమున భీముని గొదాప్రవేశకథను చిత్రించి, ద్వితీ యాంకమున నకస్మాత్తుగా నసందర్భపు శృంగారచరిత్రను వర్ణించుట నాటక నిర్మాణౌచిత్యక్రమపద్ధతి కాదేమో యనిపించును. కాని ప్రథ మాంకమున యుద్ధమునకుఁ బూర్వపు రాయబార విషయమును జూపి, సభాపర్వాది ప్రాచీనకథావిషయమును దెల్పి, నాయకుని తోడను. కథ తోను మనకుఁ బరిచయము గలిగించి, ద్వితీయాంకమున ప్రతినాయకుని స్థితినిగూడ మనకుఁ దెల్పుచున్నాఁడు. కాని యుద్ధమధ్యమున నసందర్భవిషయములఁ గూర్పలేదు. నాయక ప్రతినాయకులను నాయికా ప్రతినాయికలను కథకుఁ గూర్చినట్లయిన కథ నిరాటంకముగ సాగును. అట్లుగాక ద్వితీయాంకమందుగూడ భీముని ప్రవేశపెట్టినకథ కేక దిక్ప్ర దర్శనముమాత్రమే యుండును. ఈ శృంగారకథా కల్పనమువలన నాటక మున శృంగారరస మంగముగాగూడ ప్రతిపాదింపఁబడినది. కొంద రీ మార్పును బలవదారోపితమై యనుచితముగ నున్నదని భావింతురు. కాని యీ భేదము వారియభిరుచి నాశ్రయించియుండును.

మఱియు భానుమతీస్వప్నకథనమున నకులకుమారుఁడు సుందరుఁ డనియు, వాఁడు దనపైటను దొలఁగించెనని కవి కల్పించుట యౌచిత్య భంగకరములైన విషయములనియు, గజాశ్వాదులందుమాత్రమే సౌంద ర్యము గాననగునుగాని, నకులమునందు సౌందర్యము విశిష్టముగ నుండ

దనియు, కొందఱు వాదింతురు. ఈ కల్పనను శ్లేషగ మాద్రేయుని స్ఫురింపఁజేయుటయే కవిముఖ్యోద్దేశముగాని యన్యముగాదు. స్వప్నము లం దనేక యనౌచిత్యములు తలతోకఁ లేనివి గానవగుట స్పష్టమేకదా. కాని యిది స్వప్నకథనముగ దెల్పుటవలన ననౌచిత్యదోషము పరిహరింపఁ బడినది.

కథాసంధానము — వస్త్వైక్యత లేని నాటకములందు గూడ పంచసంధులను నిరూపించుట యాచారమై పోయినది. యథార్థమునకు వేణీసంహారనాటకమున వస్త్వైక్యత లేదనియే చెప్ప వచ్చును. ఎందుకనఁగ నందలియంకములలోని కథాసంయోగము బిగువుగ లేక సడలియున్నది. ఐనను ప్రధానకథయందు పంచసంధులను వివరించుట దుస్సాధ్యముగాదు.

ఈనాటక ప్రథమాంకమున శ్రీకృష్ణసంధిప్రయత్న విఫలానంతరము యుధిష్ఠిరుఁడు ధార్తరాష్ట్రులతో యుద్ధమును చేయఁబూనుట యను బీజముతోడ భీమసేనుఁడు ప్రతిజ్ఞాపూర్తికై పడు తొందర యను నారంభముగలసి ముఖసంధి యగుచున్నది. ద్వితీయాంకమున జయద్రథుని మాతయు, దుస్సలయుఁ బ్రవేశించుట యను బిందువును, నర్జునుఁడు జయద్రథునిఁ జంప నిశ్చయించుటను యత్నమును గలిసి ప్రతిముఖసంధియై కథాభివృద్ధియగుచున్నది. ఈ యంకమందలి భానుమతీదుర్యోధనుల కథ యప్రధానమై కథాగమనమునకు భంగముగూడఁ గల్గించుచున్నది.

తృతీయాంకమందలి యశ్వత్థామ పితృశోకమును, కర్ణాశ్వత్థామల కలహమును, చతుర్థాంకమందలి సుందరకుని యుద్ధవర్ణనమును ప్రస్తుతకథ కప్రస్తుతములైన పతాకలు. చతుర్థాంకాంతమున తెరవెనుక దుశ్శాసనుఁడు దనచేతిలోఁబడి చిత్రవధ గావింపఁబడె నను భీమసేనుని వాక్యములును, దుశ్శాసనుని రక్తమును భీముఁడు పానముచేయుచుండె నను నశ్వత్థామవాక్యము లను ప్రత్యాశతోఁగూడి గర్భసంధి యగుచున్నది. దీనిమూలమున దుర్యోధనుని వధగూడ నాశింపఁదగినది. పంచమాంకమున ధృతరాష్ట్రుని సంధిప్రయత్నము నాయకుని కార్యసాఫల్య

మునకు భంగము గల్గించుచున్నది. మఱియు షష్ఠాంకమందలి చార్వా కుని కార్యముగూడ ప్రకరి యగును. భీముని నూత్నప్రతిజ్ఞా పర్యవసాన ముగ భీముఁడు మాయమగుట నాయకుని ఫలప్రాప్తిని సంధిగ్ధావస్థలోఁ బెట్టుచు నవిమర్శసంధియగుచున్నది. ఇక్కడ చార్వాకుని మోస కార్యమువలన నద్భుతరసము ప్రతిపాదింపఁ బడినది. మఱియు పాంచా లకుఁడు దుర్యోధనుఁడు గనఁబడెనని చెప్పుటవలనను, భీముఁడు దుర్యోధ నుని వధించునని సూచించుచు విజయోత్సవముఁను గూర్పుమని యుధి ష్ఠిరునకుఁ బంపఁబడిన వార్తవలనను నియతప్రాప్తి గలుగుచున్నది.

కడకు భీముఁడు దుర్యోధనునిఁ జంపి ప్రతిజ్ఞాంబుధిని దాటితినని చెప్పుకార్యము ద్రౌపదీవేణీ మహోత్సవమను ఫలానుగమముతోఁ గూడి నిర్వహణసంధి యగుచున్నది. ఇందు భీమునిఁజూచి దుర్యోధనుఁ డని భ్రాంతిపడిన యుధిష్ఠిరాదుల కతఁడు భీముఁడేయని కంచుకి గుర్తించుట ప్రధానాంశము.

ర స ము:— ఈనాటకమున తృతీయాంకమందు ద్రోణవధకై యశ్వత్థామయు, చతుర్థాంకమున వృషసేను వధకై దుర్యోధనుఁడును, పంచమాంకమున దుశ్శాసనాదుల మరణమునకై గాంధారీ ధృతరాష్ట్రు లును,షష్ఠాంకమున నలీక భీమ మరణ వృత్తాంతమునకై ద్రౌపదీ యుధిష్ఠి రులును, శోకించిన కారణమున నీనాటకమున కరుణరసము ప్రధానమని గజేంద్ర గడకర్ పండితుఁ డభిప్రాయ పడుచున్నాఁడు. కాని ఈవాదము దుర్బలమైనది. ఈనాటకమున కరుణరస మంగముగఁ బోషింపఁబడినదే కాని యంగిగా కాదు. ఈకరుణము నతిశయించి వీరరౌద్రరసములున్నవి. ద్రౌపదీవేణీసంహార వృత్తాంతమునకు కరుణరస మెంతమాత్రము సహాయకారి కాదు; మఱియు వీర రౌద్ర రసములే సహాయకారులు. కథానాయకుఁడగు భీమసేనునకుఁ గరుణరసమునకు విరుద్ధభావముగలదు. కథానాయకేతి వృత్తములతో రసమున కవినాభావ సంబంధముండును. కాని యీ నాటకమున నీరెండును కరుణ రసమునకు విరుద్ధ ముగానుండుటచే నీ రస మంగికానేరదు. ఇఁక నీనాటకమున ప్రధానరసము నాట్యలక్షణము ననుసరించి వీరమని చెప్పఁదగినను, నిందు వీరరసము...

నకు స్థాయీభావమైన యుత్సాహముకంటె, రౌద్రరసమునకు స్థాయీ
భావమైన క్రోధమే యెక్కువగా ప్రతిపాదింపఁబడినది గాన నీనాటక
మున రౌద్రరసమే యంగియని చెప్పుట యెక్కువ సరసముగా నుండును.

నాటక నాయకుఁడు:— నాటకలక్షణానుగుణముగ కార్య
ఫలానుభవకర్తయు, భరతవాక్యము నుచ్చరించువాఁడును నాయకుఁ
డగుచో నీ నాటకమున యుధిష్ఠిరుఁడు రాజపట్టాభిషిక్తుఁడై భరతవాక్య
మును బలుకును గాన నాయకుఁడు గాఁదగును. కాని నాటకమున
నీతనికి విశేషప్రాముఖ్యత లేదు; చివరియంకమునమాత్రమే యితఁడు
వచ్చును. నాటకకథ యీతనిమీఁద నెంతమాత్ర మాధారపడి యుండ
లేదు. ఈతఁ డీ నాటకమున లేకపోయినను నాటకకథాభాగమున కెంత
మాత్రము భంగముకాదు. మఱియు నాటకకార్యఫలమగు రాజ్య
సంపాదనకుఁ గారణభూతుఁడై, తత్కార్యసాధనమగు శత్రుసంహార
మొనరించినవాఁ డితఁడుగాఁడు. అదియుగాక యీ నాటకకథ ప్రారంభ
మగు ద్రౌపదీవేణీవృత్తాంతమునకు నీతనికి నెట్టి సంబంధము లేదు.
పోనీ యితనియందు వీరపురుషోచితగుణము లేవియుఁ గానరాకపోవుటయే
కాక యితఁడు భీరుఁడుగను, సులభవంచితుఁడుగను, దుర్బలచిత్తుఁడుగను
ద్రౌపదితోఁగూడ నాత్మవధగావించుకొనువాఁడుగాను, పరాక్రమ
హీనుఁడుగను బాత్రపోషణ చేయఁబడినాఁడు. సామాన్యముగా ధీరోదా
త్తాదినాయకులం దుండఁదగిన లక్షణము లేవియు నితనియందు గాన
రావు. విశేషించి వీరము లేక రౌద్రరసము ప్రధానముగాఁగల యీ
నాటకమందు నాయకుఁడగుట కీతఁ డెంతమాత్రము దగఁడు గాన నీతఁ
డీ నాటకమునకు నాయకుఁడుగాఁడు.

వేణీసంహారనాటకము రౌద్రము లేక వీరప్రధానరసమైనది గాన
నీ రసము తృతీయాంకమందు పరిపక్వావస్థకు వచ్చినదికాన, నా
రససిద్ధి యశ్వత్థామ మూలమున గలుగుటచే నాటకమున కాతఁడు
గూడ నాయకస్థాన మాక్రమింపఁగలుగుట కవకాశమిచ్చుచున్నది. కాని
యితఁ డెంతపరాక్రమశాలియగు వీరుఁడైనను నాటకమున నితని కవ
మానాపజయములే గల్గినవి కాని జయము చేకూరలేదు. మఱియు

ద్రౌపదీవేణీసంహారకథావిషయమం దీతని కేమియు జోక్యము లేదు. నాటకమున నీతని విషయము ప్రాసంగికమే కాని యాధికారికముగాదు. కాన నీతఁడు నాటకమునకు నాయకుఁడుగాఁ దగఁడు.

ఇఁక నాయకుఁడు గాఁదగినవాఁడు భీముఁడు. రౌద్రరసప్రధాన నాటకోచితమహావీరపురుషలక్షణోపేతుఁ డితఁడు. మహాబలపరాక్రమ శాలి, మానధనుఁడు, ధీరుఁడు. వైర్యవమాన ప్రతీకారాయత్తచిత్తుఁడైన శత్రుసంహారోత్సాహి. ద్రౌపద్యవమాన పీడితహృదయుఁడై తత్ప్రతీ కారమునకై ప్రతిజ్ఞలుచేసి వానిని నిర్వహించి ద్రౌపదీవేణీసంహార మహోత్సవమును జేసిన వీరుఁ డితఁడు. వేణీసంహారనాటకమంతయు నీతని మీఁదనే యాధారపడియున్నది. నాటకకథ ప్రథమాంకమున నీతని తోడనే ప్రారంభించి, తృతీయాంకమున నీతనిమూలముననే దుశ్శాసన వధవలన పరమోచ్ఛదశ (Climax) కు వచ్చి, షష్ఠాంకమున దుర్యోధన వధ ద్రౌపదీవేణీసంహారమహోత్సవములచే పరిసమాప్తి నొందుచున్నది. మఱియు ద్వితీయాంకమున నీతఁడు రంగస్థలము మీఁదికి రాకపోయినను భానుమతీస్వప్నవృత్తాంతమువలన సూచింపఁబడిన నకులుఁడు భీముఁడే కదా. పిమ్మట కంచుకి తెల్పు తొందరమాటలమూలమున భీముఁడే దుర్యో ధనుని తొడలు భగ్నముసేయునని ధ్వనించుటచేత, భీమసేనునివృత్తాంత మీ యంకమునఁగూడ వ్యాపించినదనుట స్పష్టము. పంచమాంకమున భీమసేనుఁడు ప్రత్యేకముగ రంగస్థలముమీఁదికి వచ్చి తన ప్రభావమును దెల్పును. కనుక కథాభిరుచియంతయు నీతనిమీఁదనే నేకాగ్రత వహించి యున్నది.

ద్రౌపది తన యవమాన ప్రతీకారమగు వేణీసంహారమహోత్సవ మాశించినది భీమునియందే. నాటకమున ప్రధానరస మగు రౌద్రము గాని, వీరముగాని కేవలము తృతీయాంకమున నశ్వత్థామమూలముననే కాక, భీముని మూలముననే ప్రథమాంకమునను, తృతీయాంకమున దుశ్శాసనుని వధయందును, పంచమాంకమున గాంధారీ ధృతరాష్ట్రులను పరామర్శించుటకు వచ్చినపుడును, షష్ఠాంకమున దుర్యోధనుని వధించి, రక్తసిక్తాంగుఁడై ద్రౌపదీ వేణీమహోత్సవము చేసినపుడు విశేషముగ శోభించుచున్నది. కాన వీరరౌద్రరసము లీతనిమీఁదనే విశేషముగ

నాశ్రయించియున్నవి. మఱియు కథాఫలితమగు రాజ్యసంపాదనకార్యమైన దుర్యోధనవధ నీతఁడే యొనర్చెను. కాఁన నీతఁడే నాయకుఁడుగా దగును.కాని తత్ఫల మీతనికిఁ జేరదుకదా,యని పూర్వపక్షముగాఁబోలు. కిరీటధారణ సింహాసనారూఢములు మినహాగా సకలరాజ్యభోగానుభవములఁను, రాజ్యభారనిర్వహణమును భీమునకు ధర్మరాజుతో సమానమే. ఆ ఫలసంపాదనము భీమునివలననే కలుగుచున్నది. రాజ్యానుభవఫలము ధర్మజుతోఁబాటు భీముఁడుగూడ ననుభవించునుగాన, ఫలానుభవముగూడ భీమునికిఁ జేరుచున్నది. ఇట్లీవిధమునఁ జూచినను భీముఁడే నాయకుఁడుగాఁ దగినవాఁడుగాన నీ నాటకమునకు నాయకుఁడు భీముఁడే.

నాటకగుణములు :— భారతకథయందు రౌద్రరస ప్రతిపాదకములైన ఘట్టములు ద్రౌపద్యవమాన సన్నివేశమును, పాండవ కౌరవ సంధి విధాన సందర్భమును. ఈసందర్భములందుఁగూడ నాసంఘటనల నతితీక్ష్ణముగ హృదయమున ననుభవించి బాధపడినవారు భీమ ద్రౌపదులు మాత్రమే. భట్టనారాయణుఁ డీ పాత్రలతోఁగూడిన సన్నివేశములనే ప్రథమాంకమున వస్తువుగా గ్రహించి, దానికి భానుమత్యవమాన కల్పనమున దోహదముగావించి రక్తికట్టించినాఁడు.నాయకుని యుత్సాహమిట్లుండ ద్వితీయాంకమునఁ బ్రతినాయకుఁడగు దుర్యోధనుని యవలక్షణములఁ బ్రదర్శింపఁదలఁచి కవి కొన్ని విశేషములఁ గల్పించినాఁడు. దీనివలన ప్రతినాయకుని దుర్గుణములు ద్యోతకమగుటయేకాక, నాటక కథాపర్యవసానము వ్యంగ్యరూపమున రెండు మూఁడు పర్యాయములు ధ్వనింపఁబడినది. ఇది నాటకకళా చమత్కారము. ఇందు కొంత యశ్లీలమున్నను, గుణరాశియందు మగ్నమగుచున్నది. కలదుకదా 'ఏకో హి దోషో గుణ సన్నిపాతే, నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః'

తృతీయాంకారంభమునందలి ప్రవేశకమెంతయు రమణీయమైనది. సామాన్యముగ నాటకములందు యుద్ధకథనము గగనచారులైన యే గంధర్వకుమారులో, లేక యిద్దరు సైనికులో చేయుదురు. ఈ నాటకమున యుద్ధఫలమును బ్రత్యక్షముగ ననుభవించు రాక్షసులఁ బ్రవేశపెట్టి, హాస్యరసోచిత సంభాషణముసేయించి, యుద్ధవర్ణనము

సేయుట చాల సొగసుగను, స్వాభావసిద్ధముగ నున్నది. ఈ హాస్యము క్షుద్రరసానుభవమున కొకవిధమగు విశ్రాంతి గల్గించి వైవిధ్యము గూర్చుచున్నది. నాటకమున విదూషకుఁడు లేని లోపమునుదీర్చి సందర్భ శుద్ధినిగూడ గల్గించుచున్నది. ఇఁక తృతీయాంక కథాకల్పన మతిరమణీయమును రసవంతమును. అశ్వత్థామ పితృశోకము వీరముగా మాఱుటయుఁ, దనతండ్రిని దూషించిన కర్ణునితోడి కలహాపరిణామము సెంతో స్వాభావసిద్ధముగ నున్నవి. ఇందలి పాత్రపోషణము నాటకమునకు జీవము పోసినది. దీనితోఁబాటు దుశ్శాసనవధ ప్రస్తావనసందర్భము రసోచితముగ నున్నది. ఈ యంకమున వచ్చు పాత్రలందఱు వీరరసోద్రిక్తులు. సన్నివేశములు రసమయములును:

యుద్ధమున ననేకబంధువులు మరణింతురుకదా. దుఃఖహేతువగు వారి నాశనము వారి బంధువులకుఁ గరుణ గొల్పును. నాటకమునఁ గరుణరసమునుగూడ నొకయంగముగఁ బోషింపఁదలఁచి దుశ్శాసనాదుల మరణమునకు, దుర్యోధనుని యసహాయ స్థితికి గాంధారీ ధృతరాష్ట్రుల దుఃఖము ప్రకటింపఁబడినది. తలిదండ్రుల పుత్రవాత్సల్యమును, పుత్త్రుల క్షేమమునకై వారు సామాన్యముగా చేయనిశ్చయించు కృత్రిమములను దెల్పుటకై వీరి కథాసన్నివేశములు కల్పింపఁబడినవి. మఱియు ధర్మాత్ములైన పాండవుల కపకారమును, సాధ్వియైన ద్రౌపదికి మానభంగము నొనర్చి, స్వబలపరాక్రమముచే విఱ్ఱవీఁగుచున్న కౌరవులఁ జంప ప్రతినపట్టి, కించిదవశిష్టముగా నిర్వర్తిత ప్రతిజ్ఞులగు భీమార్జునులు శస్త్రాస్త్రంబులచే వైరుల నొప్పించుటయే కాక, వాక్శూలములచేఁగూడపీడించురీతియు,దుర్మార్గులగు ధృతరాష్ట్రాదులఁజూచి హేళనముసేయు విధము నిందు ప్రకటింపఁబడి చమత్కరింపఁ బడినది. ఇందలి భీమునివాక్కు లెంతయు నర్మగర్భములై మర్మభేదములు సేయునవిగ నున్నవి. ఈ కల్పిత సన్నివేశ మెంతయో రమణీయమై, కవికల్పనాసామర్థ్యమును జాటును.

షష్ఠాంకమున నద్భుతరసమునుగూడ ప్రతిపాదింప నెంచిన వాఁడై కవి, చార్వాక రాక్షసుని కృత్రిమచర్యను బ్రవేశపెట్టినాఁడు.

కాని దీనిమూలమున రసముకంటె వైరస్యమే యెక్కువ గల్గినది. ఈ నాటకమున ముఖ్యాంకములందుపాత్రయు వీరరౌద్రరసపూరితములై కథకు తేజముగొల్పి, సామాజికుల కుత్సాహానందములు గొల్పెను.

భారతయుద్ధకథ యభిమన్యువధ ఘట్టమునుండి రసవంతమై రమణీయముగనుండును. అక్కడనుండియే కౌరవాదృష్ట పతనము ప్రారంభించును. తత్పూర్వయుద్ధమున పాండవులకే పరాజయము గలుగు చుండెను. భీష్ముడు తొమ్మిదిదినములు పోరాడి పాండవుల బరాజితులఁ జేయుటచేతనే శ్రీకృష్ణుడు చక్రము ధరింపవలసివచ్చినది. ద్రోణుని యుద్ధ ప్రారంభదినములలో నభిమన్యాదివీరులు పాండవపక్షమున మరణించిరి. అభిమన్యు వధానంతరము పాండవుల పరాక్రమ మధికముగాఁగ, ధార్త రాష్ట్రులు క్రమముగ క్షీణింపసాగిరి. నాటకమున ధార్తరాష్ట్రపతనమే నిర్దేశించు సందర్భమున, పాండవపరాజయ సూచితమగు పూర్వయుద్ధ భాగమును ప్రకటింపక, ధార్తరాష్ట్రపరాజయ ప్రారంభఘట్టమగు నభిమన్యు వధానంతరయుద్ధమునుండి ప్రారంభించుట సమంజసముగా నుండునుగాన, కవి యిట్లు మొదలిడి క్రమముగా సైంధవ, దుశ్శాసన, వృషసేన, కర్ణ దుర్యోధనుల వధలను వరించు యుద్ధమును మాత్రమే గైకొని నాటకకథ కౌచిత్యముగూర్చినాఁడు.

నాటకదోషములు:— నాటకమున రసపాత్రపోషణములు బాగుగ నిర్వహింపఁబడినను నంకములందలి కథ బిగువుగల్గి వస్త్వైక్య ముతోఁగూడి నిర్వహణమునకుఁ జేరినగాని నాటకత్వము సిద్ధించి రక్తి కట్టదు. ఈ విషయమున వేణీసంహారనాటకకథ కుంటుపడినది. పాత్ర రసపోషణ విషయములందు రమణీయముగనున్నను, నిందలి యంకములు కథావిషయమున వస్త్వైక్యత లేక బిగువు సడలి దేనికది విడివిడిగానున్నట్లు న్నదిగాని నాటకనిర్మాణపటుత్వము గల్గినట్లుగా స్పష్టపడదు. ఇది దీర్ఘకథగల పురాణమును వస్తువుగా గ్రహించుటవలని దోషముగాదు. పురాణమునుండి నాటకమునకు వలయు భాగములనుమాత్రమే కవి గ్రహించెను; కాని కొన్ని యపూర్వసన్నివేశములను గల్పించుటచే ప్రధానకథకు భంగము వాటిల్లినది. ద్వితీయాంకమందలి భానుమతీ దుర్యోధనుల శృంగారగాథ నెంత వేడుకతో వినినను తృతీయాంకమున

నశ్వత్థామ దుఃఖముతో మన మెంతసానుభూతిని జూపి యతనికిఁ గర్ణునకుఁ గల్గిన కలహము నెంతయుత్సాహముతోఁ జూచినను, ప్రధానకథయగు ద్రౌపదీవేణీసంహారకథకు వీనికి నేమియు సంబంధము లేదని గ్రహింపఁగలము. ఈ రెండువిషయముల మూలమున నాటకవస్తువునందప్రధానకథకుఁ గవి విశేషప్రాముఖ్యము నిచ్చుటయు, ముఖ్యభాగమునకుఁ బ్రాముఖ్య మొసఁగకపోవుటయను దోషము దవిలినది. ఈ యంకములందలి, జయద్రథ దుశ్శాసనకథావృత్తాంతములు ప్రధానకథకు వస్త్వైక్యతఁగూర్చుటకుమాత్ర మతికించినట్లున్నవే కాని కలిసిపోలేదు.

దీనికిఁ దోడు చతుర్థాంకమున సుందరకుని యుద్ధవర్ణనము దీర్ఘవచన భాగములతో నిండియుండుటచే నెక్కువ విసుఁగుఁ గొల్పును. ఈ భాగము తీసివేసినచో నాటకకథకు భంగము కలుగకుండుటయే కాక, కళంకరహితముగ నుండును, నాటక రచనాశిల్ప మెఱిఁగిన యే కవియు నిట్టి యంకముల వ్రాయఁడు. ఇంక షష్ఠాంకమున చార్వాక రాక్షస వృత్తాంతమువలనఁ గూడ నాటక కథకు విశేషప్రయోజనము లేదు. దీనిని పరిహరించిన ధర్మజుని పాత్ర కళంకితము గాకయుండెడిది. కాని యీలోపము లితరగుణముల వలనఁ గొంతవఱకు కప్పివేయఁబడినవి. ఈ దోషములవలన కవికి కథాకథనమం దంగాంగీభావ విచక్షణమున సూక్ష్మదృష్టి తక్కువయని తోఁచుచున్నది.

Books consulted:—

Dravid's edition of Venisamharam

Gajendragadakar:— study of Venisamharam

H. H. Wilson:— Theatre of the Hindus.